శతజయంతి సదస్సు ప్రసంగ వ్యాసాలు

అవిశ్రాంత భాషా సేవకుడు

# తిరుమలరామచంద్ర



సంకలనం:

జి. యస్. వరదాచారి

2

అట్ట లోపలివైపు అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్యులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువున వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖనకళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇది ప్రాచీనమైనది.

నాగార్జున కొండ, క్రీ.శ. 2వ శతాబ్దం.
(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ వారి సౌజన్యంతో)

3

అవిశ్రాంత భాషా సేవకుడు

# తిరుమల రామచంద్ర

(శతజయంతి ఉత్సవ సదస్సు ప్రసంగ వ్యాసాలు)

సంకలనం:

జి. యస్. వరదాచారి




సాహిత్య అకాడెమి

4

Avishrantha Bhasha Sevakudu **Tirumala Ramachandra** : Seminar papers edited by G.S. Varadachari presented in Centenary Seminar on *Tirumala Ramachandra* at Hyderabad, Sahitya Akademi, 2016, Rs.85/-

© సాహిత్య అకాదెమీ

మొదటి ముద్రణ : 2016

**సాహిత్య అకాదెమి**

రవీంద్ర భవన్, 35, ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - 110 001

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001

172, ముంబై మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్, ముంబై - 400 014

4, డి.ఎల్. ఖాన్ రోడ్, కోల్‌కతా - 700 025

సెంట్రల్ కాలేజ్ క్యాంపస్, డా.బి.ఆర్.అంబేడ్కర్ వీధి, బెంగళూరు - 560 00

443, గుణ బిల్డింగ్స్, తేనాంపేట, అన్నాశాలై, చెన్నై - 600 018

ISBN : 978-81-260-4961-8

వెల : ఎనభై ఐదు రూపాయలు

టైప్ సెట్టింగ్: సిడ్విన్ గ్లోబల్ సల్యూషన్స్, బెంగళూరు. ముద్రణ : కీర్తి ప్రింటర్, బెంగళూరు.

5

# విషయ సూచిక

– – –

# ప్రస్తావన

2013 సంవత్సరంలో కేంద్ర సాహిత్య అకాడమి అధ్వర్యాన నలుగురు సాహితీ మూర్తుల శతజయంతి సదస్సులు జరిగాయి. వారు కొండూరు వీరరాఘవాచార్యులు, కాళోజీ నారాయణరావు, పుట్టపర్తి నారాయణాచార్యులు, తిరుమల రామచంద్ర. తిరుమల రామచంద్ర భాషా సాహిత్యాలపైన ఒక సదస్సు 22 డిసెంబర్ 2013న జరిగింది. హైదరాబాద్‌లోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఎన్.టి.ఆర్ ఆడిటోరియంలో వయోధిక పాత్రికేయ సంఘం వారి అండదండలతో (ముఖ్యంగా డా. జి.యస్. వరదాచారి, కొండా లక్ష్మణరావు, టి. ఉదయవర్లు ప్రభృతుల సముదాత్త కృషితో) ఆ సదస్సు ఎంతో సార్థకంగా, సాఫల్యభరితంగా జరిగింది. తిరుమల రామచంద్ర సృజనాత్మక పండితులు, విశిష్ఠ పరిశోధకులు, బహుభాషా విదులు, అరుదైన పాత్రికేయులు, ప్రధానంగా చిత్తశుద్ధి కలిగిన పవిత్రమైన వ్యక్తి. పేదరికమునే వ్రతముగా గ్రహించి తెలుగుజాతికి విలువైన జ్ఞానసంపదను సమకూర్చిన మహనీయుడు.

తెలుగు పత్రికారంగంలో శతజయంతి వేడుకలు ఘనంగా జరిగిన తేజోమూర్తుల్లో తిరుమల రామచంద్ర రెండవ వారని విజ్ఞుల అభిప్రాయం నార్లవేంకటేశ్వరరావు మొదటివారు.

సాధారణంగా సదస్సులలో ప్రసంగాలు ఎంత బాగా జరిగినా అవి నిశ్శబ్ద గర్భంలోకి వెళ్ళిపోయి చాలాకాలం తర్వాత గాని వ్రాతరూపంలోకి రావు. కాని ఇక్కడ పత్ర సమర్పకుల నిబద్ధతవల్ల వయోధిక పాత్రికేయ సంఘం వారి పూనిక వల్ల అనతికాలంలోనే గ్రంథ రూపం ధరిస్తున్నవి. వేదికపైన ప్రకటించిన మేరకు తన కర్తవ్యాన్ని సకాలంలో నెరవేరుస్తున్నందుకు అకాడమీ పాత్ర అభినందన పాత్రం.

అకాడమీ ఔద్యోగిక వర్గం ముఖ్యంగా కేంద్రసాహిత్య అకాడమీ కార్యదర్శి డా. కె. శ్రీనివాసరావు, బెంగుళూరు ప్రాంతీయ కార్యాలయం అధికారి యస్.పి. మహాలింగేశ్వర్ అందించిన సహకారం శ్లాఘనీయం. ప్రసంగ వ్యాసకర్తలందరినీ ఈ సందర్భంగా అభినందిస్తున్నాను. ఇది చక్కని పరామర్శ గ్రంథంగా ఉపయోగపడగలదని నమ్మకం. ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు.

**డా. ఎన్.గోపి**

15-04-2014

# లక్ష్యశుద్ధి గల రచయిత : తిరుమల రామచంద్ర

- డా. జి.యస్.వరదాచారి

తిరుమల రామచంద్ర నిరాడంబరుడు, కానీ నిక్కచ్చిమనిషి. పరమ సౌమ్యుడు, కాని నిర్మొహమాటి. బహుభాషాకోవిదుడు, కాని నిగర్వి, మహాపండితుడు కాని నిష్కపటి, మహామహోపాధ్యాయుడు, కాని భాషా సేవకుడు అనిపించుకోవడమే ఇష్టం. బహు బిరుదాంకితుడు, కాని పత్రకార్ శిరోమణిని తప్ప మరి దేన్ని ధరించనివాడు. లక్ష్మీ కటాక్షానికి ప్రాకులాడని యావజ్జీవ సాహితీ కృషీవలుడు. అలాంటి అసామాన్య వ్యక్తి శత జయంతి సంవత్సరమిది. ఆయన అద్వితీయ వ్యక్తిత్వానికి సరితూగే విధంగా అక్షర నివాళి సమర్పించడానికి కేంద్ర సాహిత్య అకాడమీ విద్వద్గోష్ఠిని నిర్వహించడం అభినందనీయం. దీనిలో ఉడతా భక్తిగా మా వయోధిక పాత్రికేయ సంఘం పాత్ర ఉండటం మాకు ఆనందదాయకం.

రామచంద్ర బహుముఖీనమైన సాహిత్య వ్యాసంగానికి తగినట్టుగా ఈ గోష్ఠిలో చర్చించదలచుకొన్న విషయాలు ఉన్నాయి. రామచంద్ర పాళీ ప్రాకృతాల పరిశోధన, లిపి పుట్టుపూర్వోత్తరాలు, నుడినానుడి పర్యాలోకనం, కలం చిత్రాలు-అవలోకనం, తిరుమల రామచంద్ర సాహిత్య వ్యాసాలు- పరిశీలన, పాత్రికేయుల రచనలు-పలుకుబడి - అన్వీక్షణం, హంపీ నుండి హరప్పాదాక - ఆత్మ కథాంశాలు, వ్యక్తిగా తిరుమల రామచంద్ర అనేవి. విషయానికి తగినట్టుగా ఆయా అంశాలను లోతుగా అధ్యయనం చేసిన ప్రసంగ పత్ర సమర్పకులను ఎంపిక చేయడం ముఖ్యం. ఈ విషయంలో అకాడమీ తెలుగు సలహా మండలి సంచాలకులు, ప్రముఖ కవి డాక్టర్ ఎస్. గోపి సలహా కోసం వెళ్లినప్పుడు ఆయన వెంటనే స్పందించి సాధికార ప్రసంగ పత్రాలు సమర్పించగల సమర్థులు డాక్టర్ చౌడూరి ఉపేంద్రరావు, శ్రీ

నారాయణ శర్మల పేర్లు సూచించడమే గాక తామే వారితో మాట్లాడి అంగీకరింపజేశారు. మిగతా పత్ర సమర్పకులంతా అంతే సమర్థులైన మా పాత్రికేయ కుటుంబ సభ్యులు. గోపి చొరవతోనే ఈ సదస్సు రూపుదిద్దుకొన్నది.

పత్రికా రచనలో విషయాన్ని బట్టి భాష, విషయాన్ని బట్టి శైలి అనే సూత్రముంది. సామాన్య సంఘటనాత్మక వార్తలు వ్రాసేటప్పుడు సరళ సామాన్య నుడికారపు తెలుగు భాషనే వాడటం సముచితం. శాస్త్ర సాంకేతిక విషయాలను గురించి వ్రాసేటప్పుడు నిర్దిష్టత కోసం, క్లుప్తత కోసం పరిభాష వాడటం అవసరం. సాహిత్య విషయాలను గురించి నివేదించవలసి వచ్చినప్పుడు ఆలంకారిక పద ప్రయోగాలకు అవకాశముంది. సంఘటనాత్మక వార్తలను జరిగింది జరిగినట్టుగా చెప్పడమే కర్తవ్యం గనుక నిరలంకారంగా వ్రాయవలసి ఉంటుంది. పాండిత్య ప్రకర్షకు ఆస్కారం ఉండదు. శ్రీ రామచంద్ర తమ రచనలన్నింటిలో ఈ పాత్రికేయధర్మాన్ని పాటించారు. ఏది చెప్పినా సత్యనిష్ఠ సడలకుండానే పాఠక ప్రియంగా చెప్పాలన్న సూత్రాన్ని పాటించారు. వ్యంగ్య, విమర్శనాత్మక వ్యాసాలలో సైతం ఆయన అతిగా, లేఖన మర్యాదలను ఉల్లంఘించి పోలేదు. ఆయనే మరొకరి గురించి వ్రాసినట్టు నమ్మిన సిద్ధాంతాన్ని అక్షరాలా ఆచరించారు.

"తెలుగు పత్రికల సాహిత్య సేవ" అనే గ్రంథంలో ఆయన వ్యాసాన్ని గురించి వ్రాస్తూ దాని లక్షణాలను ఈ విధంగా తెలిపారు: అతి దీర్ఘంగా ఉండరాదు. సంగ్రహంగా క్లుప్తంగా ఉండాలి. విషయోద్దేశం నిర్దిష్టంగా ఉండాలి. భాష నిర్దుష్టంగా సులభ గ్రాహ్యంగా ఉండాలి. ఉపక్రమణ, ఉపపాద, ఉపసంహారాల క్రమాన్ని పాటించాలి. ఇవి పాటించిన కర్తవ్య పరాయణుడాయన. కనుకనే వ్రాసినవి సంక్లిష్ట విషయాలైనా సామాన్యుడిని సైతం పట్టి చివర వరకు చదివించే విధంగా వ్రాయగలిగారు.

ఈ రోజు ఇక్కడ ఆవిష్కరించబోతున్న "పలుకుబడి" ఇందుకు ఉదాహరణ. పత్రికారచయితలు, వారి ప్రభావంతో ఇతర రచయితలు చేస్తున్న అపప్రయోగాలను ఎత్తి చూపే గ్రంథం పలుకుబడి. పాండిత్య ప్రదర్శనకు యత్నించి చేస్తున్న తప్పులను సవరించడానికి ఉద్దేశించింది. వ్యాకరణ సూత్రాలు తెలిసినవారు గనుక సందర్భోచితంగా వాటినీ చెప్పారు. కాని పాఠక సులభంగా చమత్కారశైలిలో చెప్పారు. ఈనాటి ముఖ్య అతిథి రవ్వా శ్రీహరి కూడా "వాడుక తెలుగులో అప ప్రయోగాలు" అనే పేరుతో ఒక్క చక్కటి పుస్తకం వ్రాశారు. దాసుడు కూడా "దిద్దుబాటు" అనే

పేరుతో మరో గ్రంథం ప్రచురించాడు. రామచంద్ర ఏది సాధువో, ఏది కాదో,ఎందుకు కాదో, వ్యుత్పత్తి ఏమిటో, పదాల మధ్య అన్వయం సాధించడమెలాగో చెప్పారు. కాని "కట్టెలతో కొట్టినట్టు నిష్ఠురమైన మారుమూల వ్యాకరణ ప్రయోగాలతో పిడుగులు రాల్చక, సరళమైన వ్యావహారిక వాక్కులతో" చెప్పారు. నేనిక్కడ ఉల్లేఖించిన ఈ మాటలు శూద్రకునివి. తెలుగు పత్రికల భాషా సేవ అనే గ్రంథంలో రామచంద్ర వ్రాసినవే. ఆయనకు అవి సరిగ్గా సరిపోతాయి గనుక వాడుకున్నాను.

రామచంద్రతో నా తొలి పరిచయం 1956లో. నేనప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జర్నలిజం విద్యార్థిని. కోర్సులో భాగంగా నాలుగు వారాల ఇంటర్న్‌షిఫ్ కోసం మద్రాసులో హిందూ పత్రికలో పని చేయడానికి వెళ్ళాను. సాయంకాలం పూట తెలుగు పత్రికా రచయితలను కలవడానికి వెళ్తుండేవాడిని. అప్పుడే నార్ల, విద్వాన్ విశ్వం, నీలంరాజు శేషయ్య, రామచంద్ర, జి.కృష్ణ, మాలతీ చందూర్ మొదలైన వారిని తొలిసారి కలిశాను. తర్వాత పత్రికారచయితగా నేను ఉద్యోగంలో చేరాను. కాని కొన్నేళ్ళ వరకు వీరెవరినీ కలిసే అవకాశం రాలేదు. 1975-79 మధ్య నాలుగేళ్ళపాటు ఆంధ్రభూమిలో రామచంద్రతో కలిసి పనిచేసే అవకాశం నేనే కల్పించుకున్నాను. పఠనాసక్తి ఉన్నందున 1950ల దశకం చివర్లో రామచంద్ర వ్రాసిన లిపి పుట్టుపూర్వోత్తరాల గురించి వార్త చదివాను. 1990లో అది రెండవ ముద్రణ పొందింది. అప్పుడు రామచంద్ర హైదరాబాద్‌లో ఉన్నారు. పుస్తకం పుటలు తిరగేస్తుంటే "వర్ధిత ద్వితీయ ముద్రణ" అనే మాట నన్ను ఆకర్షించింది. తర్వాత దాన్ని చదివాను. చాలా బరువైన పుస్తకం. పరిచయంలో తాపీ ధర్మారావు ఇలా వ్రాశారు: "ఇలాంటి గ్రంథం వ్రాయడం సులభమైన పని కాదు. అనేక దేశీయ, విదేశీయ లిపి పరిణామాలను మేళవించి ఇంత సాకల్యంగా వ్రాసిన గ్రంథం మన భాషలోనే కాదు. ఇతర భాషలలో కూడా ఇంకొకటి లేదనే నా నమ్మకం... ఇటువంటి పొడి విషయాన్ని ఏదో కథల పుస్తకం లాగా విడిచి పెట్టకుండా చదవాలన్న కుతూహలం కలిగే పద్ధతిని వ్రాయగలగడం రామచంద్రకే సాధ్యం." తాపీ వారు అన్నట్టు కొన్ని నిర్ధారణలు ఊహించి చేయవలసి వుంటుంది. అవి కొందరికి నచ్చవు. అవి ఒప్పించి, మెప్పించే విధంగా ఉన్నప్పుడే అంగీకార యోగ్యమవుతాయి. రామచంద్రకు ఆ విషయం తెలుసు కనుకనే కేవలం ఊహాచాతుర్యం మీద ఆధారపడలేదు. రుజువులు చూపారు.

ఆయన ఇలా వ్రాశారు. "ఋగ్వేదంలో కొందరు వేదవాక్కును చూచీచూడరు, వినీ వినరు" అని ఒక ఋక్కు ఉంది. చూచీ చూడరు అన్నప్పుడు లిపి ఉందనే

ధ్వనిస్తుంది. లిపినే గదా చూసేది. తైత్తిరీయ సంహితలో అక్షరాలు, ఛందస్సు ప్రసక్తి ఉంది... మహాభారతం ఆది పర్వంలో వ్యాసుడికి విఘ్నేశ్వరుడు లేఖకుడు అని ఉంది... ఈ అక్షరం, వర్ణం అన్న పదాలు లిపిని సూచించేవి కావని ఆధునికులు వాదిస్తారు. వేదాలను శ్రుతి అనడం, వాటిని...ముఖతః నేర్చుకోవాలనడాన్ని కారణంగా చెబుతారు. ఇంతవరకు చెప్పి చదవడంలో లోపాలు చెప్పే "షడీతె పాఠకాధమాః" అనే శ్లోకాన్ని పేర్కొని రామచంద్ర ఈలోపాలు పోగొట్టుకోవడానికే గురు ముఖతః నేర్చుకోవడం తప్ప లిపిలేక కాదు అని నిర్ధారిస్తారు. ఇంకా చాణక్యుడు గ్రంథస్తమైన విద్య, పరాయి చోట ఉన్న సొమ్ము సమయానికి అక్కరకురావు అని చమత్కారంగా చెప్పిన శ్లోకాన్ని ఉదాహరిస్తారు. బుద్ధ నిర్యాణం తర్వాత ఆయన బోధనలను సంపుటీకరించిన విషయాన్ని పేర్కొంటారు. ఇంకా రుజువులు కావాలనుకునే వారి కోసం "లలిత విస్తరం"లో బుద్ధుడికి 64 లిపులు తెలుసు అని ఉన్నట్టు తెలిపి ఆ లిపుల పేర్లను గ్రంథంలో ఇచ్చారు. ఇంత వ్రాశారు కనుకనే రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ "నీ పని చాలా గొప్పదీ అనడం పునరుక్తి" అని రామచంద్రకు వ్రాసిన లేఖలో అన్నారు. "అంతేకాదు. ఈతూరి సాహిత్య అకాడమీ 500 బహుమతికి తగిన గ్రంథం" అని సిఫార్సు చేస్తున్నా అని వ్రాశారు.

రామచంద్ర మరో ప్రౌఢ రచన "గాథా సప్తశతిలో తెలుగు పదాలు". 1935లో వేటూరి ప్రభాకర శాస్త్రి ఏదో ప్రసంగవశాత్తు ప్రస్తావించారట. దానితో రామచంద్ర 'గాథా సప్తశతి'ని ఇతర ప్రాకృత కావ్యాలను అధ్యయనం చెయ్యడం ప్రారంభించారు. 1948-75 మధ్య పది వ్యాసాలు వ్రాశారు. "పెద్దల మాట సద్దిమూట" అని చెప్పి అలాంటి అనుభవామృత గుళికలు గాథా సప్తశతిలో కోకొల్లలు అంటారు రామచంద్ర. సామాన్య మానవుని జీవితం, ముచ్చట్లు, శృంగారం, పెండ్లిండు, నగలు, నాణేలు, చివరకు దారిద్ర్యాన్ని చిత్రించడంలోను ప్రాకృతకవి నేటి అభ్యుదయ రచయితలను మించి పోయాడనడానికి గాథా సప్తశతి కథలే సాక్ష్యాలంటారు. తాము చెప్పదలచుకున్న దానికి ఆయన వేసుకున్న ప్రణాళిక గమనించదగినది. తెలుగు పదాన్ని శీర్షికగా ఇచ్చారు. తర్వాత ప్రాకృత శ్లోకాన్ని ఇచ్చారు. తెలుగు తాత్పర్యం ఇచ్చారు. ఆ తర్వాత తమ వివరణ ఇచ్చారు. అనుకరణ శబ్దాలు పదబంధాలు లేని భాష ఉండదు. కాని తెలుగులోని అనుకరణ శబ్దాలవంటివే మరో భాషలో కనిపిస్తే ఆరెండు భాషలు ఆదాన ప్రదానాలు చేసుకున్నాయని అనుకుంటాము అని తేలుస్తారు.

"ప్రేమలేఖ" గురించి గాథా సప్తశతిలో వ్రాసిన విషయం చూద్దాం. "శకుంతల దుష్యంతునికి ప్రేమ లేఖ వ్రాస్తుంది. ఈ ప్రేమ లేఖ లేఖనం రామాయణ, భారతాల నుంచి తీసుకున్నట్టు కనిపించదు వాటిలో ప్రేమ లేఖలున్నాయా? ఆదర్శ ప్రేమికుడైన రాముడు హనుమంతునితో ఒక చీటి వ్రాసి పంపవచ్చుగదా లంకకు. పంపలేదు. ప్రేమమూర్తులు అయిన నలదమయంతులో, సావిత్రీసత్యవంతులో, పురుప్రమద్వరలో ప్రేమలేఖలు వ్రాసుకొన్నట్లు భారతంలో లేదు. రుక్మిణి కూడా అంతే. పల్లెటూరి పిల్లలాగా తన పురోహితునికి చెప్పిపంపుతుంది. లలిత విస్తరంలో ఇలాంటి లక్షణాలు గల కన్య కావాలని గౌతముడు పురోహితుని చేతికొక లేఖ వ్రాసి పంపినట్టు, దానికి యశోధర సమాధానం వ్రాసినట్టు ఉంది". ఇంత వ్రాసి కాళిదాసు ప్రేమలేఖను గాథా సప్తశతి నుంచి అనుకరించినట్టు వ్రాశారు. అయితే నిపుణుడైన కవి తాను గ్రహించిన దానికి ఆశించిందేమిటి? "నేను చేసిందంతా ఒప్పుకోండనే నిర్బంధమేమీ లేదు. సత్య దృష్టితో పరిశీలించడానికి ప్రయత్నించాడు సుమా అని భావిస్తే చాలు" అన్నారు.

ఈ గాథా సప్తశతిలోని ఒక్కో గాథనో, కొన్ని గాథలనో కలపి, పూర్వాపరాలను జోడించి రామచంద్ర "ప్రాచీనాంధ్ర గాథలు" అనే శీర్షికన ధారావాహికంగా 50 గాథలు వ్రాశారు. ఆ పుస్తకాన్ని శత జయంతి సందర్భంగా ఎమెస్కోవారు ఇటీవల ప్రచురించారు. ఏ గాథకు ఆ గాథ స్వతంత్రమైనది. మామూలు మనిషి జీవితంలో సుఖాలు, కష్టాలు, సోయగాలు, వియోగాలు, అల్పసంతోషాలు రమణీయంగా, మనసుకు హత్తుకునే విధంగా, సరళ సుందర జాను తెలుగులో కమనీయంగా వ్రాశారు. శీర్షికలు చూడండి ఎంత సొబగుగా ఉన్నాయో. వగలాడి, బుగ్గమీద మసి, పేదరాలి వేవిళ్లు, పగటి సిగ్గు, ఆరని ముద్దులు. ఉదాహరణకు "అమ్మో ఇక మొగడొద్దు" అనే రచనలో కొంత భాగం చూద్దాం. పురిటి నొప్పులు భరించలేకపోతున్న యువతి అన్న మాటలవి. "ఇలా ఉంటుందని తెలిస్తే పెళ్లే చేసుకునేదాన్ని కాదు. ఇంత వేదన కలిగితే మొగుడెందుకు?" ఇలా సాగుతుంది ఆమె గోడు. మధ్యలో రచయిత సుశ్రుతుడు సుఖ ప్రసవానికి మంత్రం చెప్పాడంటారు. చ్యవనుడు చెప్పిన మంత్రమది. మంత్రపాఠం ఇచ్చారు. అర్థం చెప్పారు. అంతేకాదు, ఎర్రావు పాలు, ఎర్రగా కాచినవి తాగితే, నెయ్యి బాగా వేసిన వేడి వేడి జావ తాగితే సుఖంగా కాన్పు అవుతుందని చిట్కా చెప్పారు. చివరకు "పండంటి బిడ్డడు– పరవశించిపోతున్నావు. సుఖదుఃఖాలు ఒకదానినొకటి వెన్నంటే ఉంటాయి. ఇదే ప్రపంచ ధర్మం. ఇప్పుడు చెప్పు మొగుడు

కావాలా వద్దా?" అన్న ప్రశ్న, అమ్మో! వొద్దు. వొద్దంటే వొద్దు. అని ఆమె సమాధానంతో ముగింపు. కాదంటే అవుననిలే అన్న ధ్వని. ఈ కథలన్నీ చదివి ఆనందించదగినవి. ఒకప్పుడు పెద్దలు చెప్పిన చిట్కాలు కూడా తెలిపేవి శృంగార గాథలే. కాని అమలిన శృంగారం. మనం మరచిపోతున్న చక్కని నుడికారంతో వ్రాసినవి. కుటుంబ విలువలకు చేటుచేయని కథలు.

రామచంద్ర ఆత్మకథాత్మక యాత్రాకథనం "హంపీ నుంచి హరప్పా దాక"లో కూడా సొంత గోడు కన్న సమకాలీన సామాజిక స్థితగతుల చిత్రణే ఎక్కువ. ఆయన రచనలన్నీ పరిశోధనకు సంబంధించినవే. భాషకు సంబంధించినవే. లక్ష్యశుద్ధి, లక్ష్యసిద్ధి ఉన్నట్టివే. అందుకే భాషే పనిముట్టుగా చేపట్టిన పత్రికా రచయితలకు అవశ్యపఠనీయమైనవి. మంచి దారి చూపేవి.

--------

# మరపురాని మహామనీషి : తిరుమల రామచంద్ర

- ఆచార్య రవ్వా శ్రీహరి

సంస్కృతాంధ్ర ప్రాకృతాద్యనేక భాషల్లో మహాపండితుడిగా, విమర్శకుడిగా, పరిశోధకుడిగా, లిపిశాస్త్రజ్ఞుడిగా, భాషాశాస్త్రజ్ఞుడిగా, పత్రికారచయితగా, అనువాదకుడిగా, సమీక్షారచయితగా, సాహితీమూర్తుల వాఙ్మయజీవితచరిత్ర రచయితగా, ఆత్మకథారచయితగా, నిఘంటు నిర్మాతగా, సంగీత, చిత్రకళాత - త్వాభిజ్ఞుడిగా, జైనబౌద్ధాదిమతాల చరిత్రాధ్యేతగా, ప్రాచీన పండితుడైనా పుష్కలంగా నవీనతను సంతరించుకున్న రచయితగా, సాహిత్య పరిశోధన తప్ప అన్యమెరుగుని నిత్యసత్యశోధకుడిగా, ఆయుర్వేదశాస్త్రవేత్తగా, గ్రంథపరిష్కరణ రహస్యజ్ఞునిగా, దేశభక్తుడిగా, నిరాడంబరుడిగా, నిర్మముడిగా, నిరంతరసాహితీ కృషీవలుడిగా, ఉ త్తమగురువుల శిష్యుడిగా, పత్రికావ్యవస్థాపకుడిగా - అఖిలాంధ్రదేశంలోనే కాక యావద్భారతదేశంలోనూ తిరుమల రామచంద్రగారు ప్రసిద్ధులు. రామచంద్రగారి రచనావ్యాసంగం సంస్కృతకవిత్వంతో ప్రారంభమైంది. తమ పద్నాలుగోఏటనే రమ్యమైన సంస్కృతంలో కవిత్వాన్ని చెప్పినారు. చూడండి.

మంజులనూపురశింజిత
పుంజీకృతరసికలోకహృత్కంజా
కుంజరగమనా గచ్ఛతి
భంజంతీ మదనమంజులతామ్.

(ఇంపైన అందెల రవళితో రసికుల హృదయకమలాలను లాక్కుపోతూ, మదనుని సౌందర్యాన్నికూడా విరిచివేస్తూ మదగజయాన వెళ్లుతున్నది)

మరో శ్లోకం :

రచయంతీ రంగలతాం
మంగళగాత్రీ సలీలమంగణకే
విటజనహృదయాంగణకే
అనంగబాధాం విశాలయతి నూనమ్.

(ముంగిట్లో ముగ్గుపెడుతున్న మంగళగాత్రి ముగ్గులసాకుతో విటజన హృదయాలలో మన్మథ బాధను విస్తరింపజేస్తుంది) ఆర్యాఛందస్సులో శృంగారరసాన్ని ఎంత సుందరంగా చిత్రీకరించినారు ఈ కవితలో! తరువాత కవితారంగాన్ని ఎందుకు వీడినారో తెలియదుకాని అది విమర్శరంగానికీ, పరిశోధనరంగానికీ ఎంతో మేలు చేసిందనే చెప్పాలి.

వివిధ భాషాసాహిత్యాల్లో విమర్శరంగంలోను, పరిశోధనరంగంలోను రామచంద్రగారు మహనీయమైన కృషిచేసి ఎంతో కీర్తినార్జించినారు. వారి ఈ కృషిని దిఙ్మాత్రంగా పరిశీలిద్దాం.

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక ప్రారంభించినపుడు అంటే 1952 సంవత్సరంలో – ఒక పదాన్నో, పదబంధాన్నో కథలాగా, మౌలికంగా చర్చించాలనీ ఆ చర్చ ఒక పుటకు మించరాదనీ అప్పటి సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారు ఆదేశించగా రెండు సంవత్సరాలపాటు కొన్ని తెలుగుపదాల పుట్టుపూర్వోత్తరాలనుగూర్చి పరిశోధనాత్మకంగా, భాషాశాస్త్ర భూమికతో వ్రాసిన వ్యాసాల సంపుటియే నుడి నానుడి. ఈ వ్యాసాల్లో ఆయాపదాల పుట్టుపూర్వోత్తరాలను చర్చించేప్పుడు రామచంద్రగారు తెలుగు తోబుట్టువులలోని సమానార్థక సరూపపదాలతో (Cognates) తులనాత్మకంగా తరచిచూడడమేకాక మానవజాతి పరిణామదృష్టితోను, సంఘపరిణామదృష్టితోను పరిశీలించడం జరిగింది. చెంబు, కంచం, పనస, ఉప్పు, పాలు, సీతాఫలప్పండు, మగువ, ఉల్లి, వేప, కోమటి, చింత, తెరవవంటి పదాల వ్యుత్పత్త్యర్థాలను వివరించడంలో రామచంద్రగారి సునిశితభాషాశాస్త్రదృష్టితోబాటు ద్రావిడభాషల్లో వారికున్న అభినివేశమూ వ్యక్తమౌతాయి.

ఒక్క ఉదాహరణను గమనించండి. చెంబు అనే శబ్దాన్ని చర్చిస్తూ తమిళంలో రాగిని సెంబు, సెప్పు అని అంటారనీ, దీనికి ఎఱ్ఱనిది అని అర్థమనీ, కెంపు, చెన్, కెన్ మొ॥ పదాలన్నీ ఈ జాతివే అని చెపుతూ ఎరుపు అనే అర్థాన్ని తెలిపే వర్ణవాచకమైన చెన్‌పు లోహవాచ వాచకంగా వాడుకలోకి వచ్చిందనీ చెన్‌పు నుండే 'చెంబు' అనేపదం

ఏర్పడిందనీ, మొదట చెంబు అనేది రాగితో చేసిన చెంబు అనే అర్థాన్నే తెలిపేదనీ, తరువాత అర్థవ్యాకోచంతో అన్నిరంగుల చెంబుకూ ఈ పదం వాడుకలోకి వచ్చిందని వివరించినారు.

రామచంద్రగారు ఈ సందర్భంలో కేవలం భాషాశాస్త్రదృష్ట్యా చెంబు శబ్దవ్యుత్పత్తిని చెప్పడమేకాక మొట్టమొదట వాడుకలోకి వచ్చిన లోహం రాగేనని, సెమెటిక్ జాతులు రాగిని ఎక్కువగా వాడతాయని, వారే ఈ లోహాన్ని మొట్టమొదట కనిపెట్టారని, మొట్టమొదట కనిపెట్టిన రాగి లోహంతో చేయబడిన చెంబుకు చెంబు అనే పేరు వచ్చిందని లోహచరిత్రను కూడా మనకు తెలియజేసినారు. ఇలాగే కంచం అనేది కంచునుండి ఏర్పడిందని, ఈ కంచు రాగి తరువాత కనుక్కున్న లోహమని తెలుపుతూ చమత్కారంగా కంచంకంటే చెంబే వయస్సులో పెద్దదని చమత్కరించినారు.

ఇలాగే కన్నడంలో ఆకాశం అనే అర్థం కల 'వాన' శబ్దంనుండి వాన అనేపదం, తూరుధాతువునుండి తూర్పు అనేపదం, పడువలనుండి పడువలను, పడుమర ఏర్పడినాయని – ఇలా ఎన్నెన్నో శబ్దాల అర్థాలను, వాటి చరిత్రను వివరించడంలో వారి భాషాశాస్త్రదృష్టి, చారిత్రకదృష్టీ వ్యక్తమౌతాయి. అంతేకాదు శాస్త్రీయ విషయాలను సామాన్యులకు కూడా ఆప్యాయంగా ఉండేరీతిలో చెప్పటం వీరి ప్రత్యేకశక్తి అని భద్రిరాజుగారు వీరిని ప్రశంసించినారు. మరికొన్ని శబ్దాలు గమనించండి.

**సీతాఫలం** – ఛీంటా, చీఁటా – మచ్చ, బుడగ, చుక్క; ఉల్లి – ఉల్, ఉళ్లం – ఉళ్ల – భూమిలోపల ఉండేది – ఉరళ్, ఉరళు, ఉరలు, ఉరళి – (త.క.) (గుండ్రంగా ఉండేవి)

**తెరవ** (తెర+వా) రహస్యం దాచనిది.

తెఱ – తెఱవు = జాలికి పర్యాయం. తెఱ – తెఱవు (క) = జాలి.

ఈ పుస్తక రచనకు "What's Dictionary of Commercial Products of India, Burma and Ceylon" అనే పుస్తకం ప్రేరకమనీ, ఇందులో ప్రతి పదం పుట్టుపూర్వోత్తరాలు అద్భుతంగా ప్రామాణికంగా చర్చింపబడ్డాయనీ, అలాంటి పుస్తకం తెలుగులో ఉంటే మేలనిపించి ఈ గ్రంథాన్ని రచించినారనీ పేర్కొన్నారు. ఈ గ్రంథం ఐదు ముద్రణలు పొందిందంటే ఇది ఎంత పండితాదరణ పొందిందో గమనించవచ్చు.

రామచంద్రగారు అప్పుడప్పుడూ వివిధ విషయాలపై రాసిన 36 వ్యాసాలను చేర్చి 'సాహితీసుగతుని స్వగతం' అనే పేర ఒక సంకలనంగా ప్రచురించినారు.

"ఇందులో కొన్ని మౌలిక పరిశోధన మనస్కాలు, మరికొన్ని విషయ నివేదనమాత్ర పరాయణాలు, ఇంకా కొన్ని ఊహొన్మేషవిలసితాలు. అన్నింటిలోనూ సహృదయులకు నా పరిశ్రమైకహృదయం, సత్యసన్నిహిత దృష్టి కనిపిస్తాయి" – అని వారు చెప్పుకున్న మాటలు అత్యంతసత్యాలు. వీటిలో పాఠపరిష్కరణ, ఆధునిక సాహిత్యం, శబ్దాల వ్యుత్పత్తి, సాహితీమూర్తులు, ప్రాకృతంలోని తెలుగుపదాలు, సాహిత్య విమర్శ మొదలైన వివిధాంశాలపై విమర్శాత్మకంగా, పరిశోధనాత్మకంగా రచించిన వ్యాసాలు చోటుచేసుకున్నాయి. శబ్దవ్యుత్పత్తిని నిర్ణయించటానికి ఎంతో పాండిత్యమూ, అనేక ద్రావిడ భాషలతో గాఢమైన పరిచయమూ, సమన్వయశక్తీ ఉండాలి. తిరుమల రామచంద్రగారికి ఈ గుణాలన్నీ కరతలామలకాలు. 'నువ్వులు కొట్టిన ఇడి నూటిడి' అనే వ్యాసంలో 'నూటిడి' శబ్దాన్ని వివేచించిన తీరు అద్భుతం. ఈ నూటిడి శబ్దం శ్రీనాథుని నైషధంలో 'ఉడువీథీ హరినీల రత్నమయ పాత్రోత్సంగ భాగంబునన్' అనే పద్యంలో ప్రయోగింపబడింది. ఇది నలచక్రవర్తి దమయంతితో అంటున్న పద్యం. "ఓ ప్రేయసీ! చూచావా! రాత్రి అనే ఇల్లాలు ఆకాశమనే నీలాల కంచంలో మన్మథునికి నేయి, నూటిడితోపాటు వడ్డించిన పాయసంలాగా చంద్రుడు కనిపిస్తున్నాడు. చకోరాలు బంతికూటికి రావాలని ఉవ్విళ్ళూరుతున్నాయి" అని దీని తాత్పర్యం. పూర్వ ముద్రణలలో నూటిడి అనే ప్రయోగమే ఉంది. కాని వేదంవారు ఈ పద్యంలోని నూటిడిని నూబిడి అని మార్చి నూబిడితో అంటే (నూవు+పిడి) పిడికెడు నువ్వులతోకూడా అని వ్యాఖ్యానించినారు. శాస్త్రిగారు నూంటిడిని తప్పుగా భావించడంవల్ల దానిని నూబిడిగా మార్చి యతికోసం సర్పిఃపాయసాహారమున్ అని సవరించినారు. కాని రామచంద్రగారు ఈ పద్యంలోని ఉత్ప్రేక్షకు మూలమనదగ్గ రంభామంజరి అనే నాటికలోని శ్లోకాన్ని గుర్తించి దాని ఆధారంగా ఈ పద్యంలో నూటిడి అనే పదమేకాని 'నూబిడి' కాదు అని నిరూపించినారు. చంద్రుడు, నిశాదేవికి నీలాలకంచంలో పెట్టిన బలిపాలులాగా ఉన్నాడట అని ఈ శ్లోక భావం. బలిహరణమప్పుడు అక్షతలు వేసి నువ్వులు, నూనె, బెల్లం కలిపిన ముద్ద పిడుచగాపెట్టి పాలు వదలుతారు. నక్షత్రాలు అక్షతల్లాగా, నీలాకాశం నీలాల స్థాలిలాగా, చంద్రునిలోని కళంకం చిమ్మిలి పిడచలాగా ఉన్నాయట. ఈ శ్లోకం 'తిలతైలగుడం' అనేదాన్ని శ్రీనాథుడు నూటిడిగా చేసుకున్నాడని వివరిస్తూ ఈ 'నూటిడి' నువ్వు + ఇడి అనే పదాలతో ఏర్పడిందనీ, నువ్వులపిట్టుతో – చేసిన పదార్థమనీ వివరించి ఆకాశమనే నీలాలకంచంలో మన్మథునికి నూటిడితోపాటు వడ్డించిన పాయసంలాగా చంద్రుడు కనిపిస్తున్నాడని ఎంతో సూక్ష్మేక్షికతో

వివరించినారు. అంతేకాక తాము సూచించిన 'నూటిడి' అనే పాఠం భక్ష్య పదార్థమే అనడానికి శ్రీనాథుడే హరవిలాసంలో చెప్పిన 'ఉండ్రాళ్లు నూటిడి పుండ్రేక్షులుందేనె యనఁటిపండ్లుం బూరియలు ఘృతంబు' అనే పద్యాన్నీ, అన్నమయ్య అధ్యాత్మిక కీర్తనలో చెప్పిన 'నువ్వులు చిటిబెల్లాలు నువ్వుటిడియును జన్నిమరుగులు' అనే కీర్తనను, 'సూర్యరాయాంధ్ర నిఘంటువును ప్రమాణంగా చూపి తాము సూచించిన పాఠాన్ని సమర్థించుకున్నారు. ఇట్లే శివతత్త్వసారం పాఠాల పరిష్కరణ' అనే వ్యాసంలో శివతత్త్వసారంలోని అనేక పాఠాలను మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో తాళపత్ర గ్రంథరూపంలో ఉన్న కన్నడ శివతత్త్వసారం మూలంగా పరిష్కరించవచ్చునని అనేక ఉదాహరణలతో నిరూపించినారు. ఒక్క ఉదాహరణం – "ఆడుదురు జతలు వెట్టుచు, పాడుదురు(న్) గతులువేసి పరమానంద, క్రీడాసంగతిఁ బ్రమథులు'. ఈ పద్యంలోని జతలు జతలుగాదనీ, జతులనీ 'ఆడువరు జతియ నిక్కుత' అనే మూలంలోని 'జతియ' అనే పదం ఆధారంగా నిరూపించి వాద్యాంగప్రబంధ విశేషమనే అర్థంగల యతి శబ్దానికి 'జతి' వికృతి అనీ పేర్కొన్నారు.

రామచంద్రగారు సంస్కృతాంధ్రాల్లోనేకాక ప్రాకృతంలోకూడా గొప్ప పరిశోధన కృషిచేసిన విద్వాంసుడు. సంస్కృతాంధ్రాల్లో విశేషకృషి చేసిన విద్వాంసులెందరో ఉన్నారు. కాని ప్రాకృత సాహిత్యాన్ని అధ్యయనం చేసి అందులో పరిశోధనచేసిన తెలుగు పండితులను వేళ్లమీద లెక్కబెట్టవచ్చు. తెలుగుభాషను భాషాశాస్త్రదృష్టితో పరిశోధించే ఆధునికభాషాశాస్త్రపండితులు ప్రాకృతభాషాధ్యయనం చేయకపోవడం సమగ్రభాషా పరిశోధనకు ఒక న్యూనతగానే భావించాలి. రామచంద్రగారు 'దేశినామమాల' లోని మరికొన్ని తెలుగుపదాలు' అనే వ్యాసంలో ప్రాకృతంలో చేరిన ఎన్నో తెలుగు పదాలను గుర్తించి వాటి వ్యుత్పత్తిని వివరించినారు. ఊసలం (లావైనది) – ఉసులుకొను అనే ధాతువునుండీ, చారో (ప్రియాలవృక్షం) సారచెట్టు అనే శబ్దంనుండీ, మండిల్లో (అపూపం) మండిగలు అనే శబ్దంనుండీ, హుడ్డా (పందెం) అనేది ఒడ్డు అనే తెలుగు ధాతువు నుండీ, చట్టూ (కర్రగరిటె) అనేది చట్టువం అనే తెలుగుపదంనుండి ఏర్పడ్డ రూపాలనీ చెపుతూ ఎన్నో ప్రాకృత పదాలను తెలుగుపదాలనుండి ఏర్పడ్డ పదాలుగా నిరూపించినారు. ఇలా భాషకు సంబంధించిన వ్యాసాలనేకాక నాయనివారి ప్రణయసూక్తం, కొన్ని సమకాలికనవలలు, నేటి తెలుగు కవితలో కల్పనారామణీయకం మొదలైన ఆధునికసాహిత్యాంశాలపైనా, కంకంటి విష్ణుమాయానాటకం మొదలైన ప్రాచీన సాహిత్యాంశాలపైనా, తెలుగు సాహిత్యరంగంలో సుప్రతిష్ఠితులైన ఆంధ్రనాటక

పితామహుడు ధర్మవరం రామకృష్ణమాచార్యులపైనా, చిలుకూరి నారాయణరావుగారిపైనా ఇందులో చక్కని వ్యాసాలున్నాయి.

ఒక విశేషం. రామచంద్రగారు సంస్కృతాంధ్ర ప్రాకృతాది భాషలకు సంబంధించిన అంశాలపైనేకాక మనమూహించని అంశాలపై కూడా రాసిన విలువైన వ్యాసాలు ఇందులో ఉన్నాయి. వాటిలో బుద్ధునికి ముందునుంచే ఉన్న ధూమపానం, ఈజిప్టు ప్రజల ఆముష్మిక చింత అన్న వ్యాసాలు గమనింపదగ్గవి. 1970లో దీనికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సాహిత్యవిమర్శ అవార్డు లభించింది.

రామచంద్రగారి మరో వ్యాససంకలనం 'ప్రాకృత వాఙ్మయంలో రామకథ' (1992). ఇందులో తొమ్మిది వ్యాసాలున్నాయి. వీటిలో మొదటి వ్యాసం ప్రాకృత వాఙ్మయంలో రామకథ. ఈ వ్యాసం పేరే ఈ గ్రంథానికి నామకరణం చేసినారు. తక్కిన వ్యాసాలన్నీ ఇంచుమించుగా ప్రాకృత సంబంధులే. సాహితీసుగతుని స్వగతంలోని 'దేశీనామమాలలోని తెలుగు పదాలు' అనే వ్యాసం తప్ప తక్కినవన్నీ కొత్తవే. తెలుగు కవుల్లో తిక్కన కాలంవరకు ఉభయ భాషల్లో – సంస్కృతాంధ్రాల్లో పండితులూ, కవులూ ఉండినట్లు, ఆ తరువాత అష్టభాషల్లో అంటే షడ్విధప్రాకృతాల్లోనూ, సంస్కృతాంధ్రాల్లోనూ పండితులు ఉండినట్లు మనకు తెలుస్తుంది. అంటే తెలుగువాళ్లలో ప్రాకృతభాషా పాండిత్యమనేది ఎంతోకాలంనుండి వస్తుందన్నమాట. ఆ లక్షణం తిరుమల రామచంద్రగారికి కూడా అబ్బిందన్న మాట. రామకథ వివిధ భాషల్లో వివిధ రీతులుగా వ్యాప్తి చెందిన విషయం మనకు తెలిసిందే. ప్రాకృతంలో రామకథ మూడు పాయలుగా – అంటే – బౌద్ధ సంప్రదాయానుసారిగా – జైన సంప్రదాయానుసారిగా – వాల్మీకి సంప్రదాయానుసారిగా సాగిందని చెపుతూ బౌద్ధజైన రామాయణ సాహిత్యాలు వాల్మీకి రామాయణ సుధాస్వాదనవంచితాలయ్యాయని బాధపడ్డారు. దీనికి కారణం బౌద్ధులు, జైనులు వాల్మీకి రామాయణాన్ని అమూలకంగా, అనపేక్షితంగా మార్చటమే. రామకథతో తమ మతంవారు ఆకృష్టులవుతారనే భావంతో ఈ మార్పులు చేశారా? అనే సందేహం వెలిబుచ్చినారు.

జాతక కథల్లో రామకథకు సంబంధించిన మూడు కథలు లభిస్తున్నాయని చెప్పి దశరథ జాతకం, అనామక జాతకం, దశరథ కథానకం మొదలైన వాటిలోని రామాయణ కథావిశేషాలను, తరువాత జైనరామాయణ కథావిశేషాలను వివరించినారు. జైన బౌద్ధ రామాయణాల్లో రామకథ ఎంత వికృతం చేయబడిందో ఈ వ్యాసంలో వివరింపబడింది. జైన, బౌద్ధరామాయణాల్లో మార్పులు గమనించండి.

1. దశరథుడు వారణాసిలో రాజ్యం చేస్తుంటాడు.
2. దశరథుని పట్టపురాణికి రామపండితుడు, లక్ష్మణ కుమారుడు అనే ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె - సీతాదేవి జన్మిస్తారు. సీత రాముని చెల్లెలన్నమాట. రాముడు సీతను పట్టమహిషిగా చేసుకుంటాడు.
3. రాముని సవతితల్లి వరంపై తండ్రి అరణ్యానికి పంపడు. రాముడు తన మేనమామ దండెత్తి వస్తాడని విని రాజ్యం వదలి అడవికి వెళతాడు.
4. అరణ్యవాసం చేస్తున్న రాముడు మూడు సంవత్సరాల తరువాతే అరణ్యవాసం చాలించుకొని వారణాసికి తిరిగి వస్తాడు.
5. దశరథునికి నలుగురు భార్యలు. పట్టమహిషికి రాముడు, తక్కిన భార్యలు ముగ్గురికి ఒక్కొక్కరు - లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు కుమారులు. లక్ష్మణ, శత్రుఘ్నులు ఒక్కతల్లి కొడుకులు కారన్నమాట.
6. సీత రావణ మండోదరుల కుమార్తె.

బౌద్ధులు రామాయణ భారతాలు విని వాటి ప్రభావానికి లోనవుతారని భయపడిన బౌద్ధాచార్యులు రామాయణాది ఆఖ్యానాలను వినడం నిషేధించినారని అందువలన అగతికంగా తప్ప రామాయణ భారతాల ప్రసక్తి జాతక కథల్లో రాలేదని అది వచ్చినా వికృతరూపంలో వచ్చిందని వివరించినారు.

ఈ వ్యాసం తిరుమల రామచంద్ర గారి ప్రాకృత సాహిత్యంతోడి పరిచయానికి కరదీపిక అనడంలో సందేహం లేదు. బెంగుళూరు వైట్ ఫీల్డులో సుమారు 35 ఏండ్లక్రితం జరిగిన రామాయణ సదస్సులో ఈ వ్యాసాన్ని నేను స్వయంగా విని ఆనందించడం నా భాగ్యంగా భావిస్తున్నాను.

తెలుగువారికి బాగా పరిచితమైన ప్రాకృత గ్రంథం హాలుని గాథాసప్తశతి. సున్నితమైన శృంగారం, గ్రామీణజీవితం ఇందులో కన్నులకు గట్టినట్లు గాథల్లో వర్ణింపబడింది. ఇందులోని కొన్ని గాథలను తీసుకొని అందమైన కథలుగా అల్లి 'పల్లకి' పత్రికలో ధారావాహికంగా ప్రచురించినారు. వీటిని ఇటీవల ఎమెస్కోవారు 'ప్రాచీనాంధ్రగాథలు' అనే గ్రంథంగా ప్రచురించినారు. ఇది రామచంద్రగారి సృజనాత్మకతకు అద్దం పడుతుంది. ప్రాకృత భాషలో సాహిత్య విషయకంగానేకాక భాషావిషయకంగా కూడా రామచంద్ర గారు చేసిన కృషికి ఇందులోని వజ్జాలగ్గంలోని తెలుగుపదాలు, తెలుగు ప్రాకృతాల సంబంధం అనే వ్యాసాలు నిదర్శనాలు. వజ్జాలగ్గం

హాలుని గాథాసప్తశతి వంటి సంకలన గ్రంథం. ఇది భర్తృహరి సుభాషితాల్లా వివిధ విషయ గుచ్ఛాల సంకలనం. వజ్జ (వ్రజ్య) అంటే పద్ధతి. పద్ధతి అంటే గాథ. అలాంటి పద్ధతుల సంకలనమే వజ్జాలగ్గం. జయవల్లభుడు దీని కర్త. ఈ వ్యాసంలో వజ్జాలగ్గంలో వాడబడ్డ 23 పదాలను పేర్కొని చర్చించడం జరిగింది. అంటే ఈ తెలుగు పదాలు మనం ఇప్పుడు వాడే తెలుగు పదాల రూపంలోకాక తెలుగులో చేరిన అన్యభాషాపదాలు నేడు తెలుగు ప్రత్యయాలతో తెలుగులో చేరి వివిధ వికారాలు పొందినట్లు ప్రాకృతవేషంతో విచిత్రంగా కనిపిస్తాయి. వింతర (సప్పాణ) వ ఖలాణం. వింతశబ్దంపై ఆలు మొ॥ స్త్రీప్రత్యయాలు చేరినపుడు 'ర్' ఆగమంగా వచ్చి వింతరాలు కావచ్చు. పేదరాలు, బీదరాలులాగా. అనుచితవిభాగంతో 'వింతర' రూపంలో వింత శబ్దం ప్రాకృతంలోకి వింతగా చేరిందన్నమాట.

ఇట్లాగే 'ఓ' (ఆశ్చర్యార్థకం), కసరక్కా (కసరుకాయ) విసూరణం (ఉసురు, ఉసూరు ఉసురుసురు, ఉస్సురుస్సురు - అనేవి తాపక వాచకాలు - ఖేద్ ధాతువుకు జార, విసూర అనేపదాలు ఆదేశాలు), చంపి ఊణ (చొనుపు ధాతువు - చొప్పు - చొప్పించు చొనుపే చంపు, చంపగా ఏర్పడి ఉండవచ్చు) ఉబ్బేఉ (ఉబ్బు ) విలయా (వెలయాలు) (విలయా - వనితా - నిపాతం అని ప్రాకృతవ్యాకరణాలు) కాణా - (గుడ్డివాడు) - కాననివాడు) మొ॥

ఇంకా ఈ వ్యాసంలో ఇంతకుపూర్వమే తాము హాలుని గాథాసప్తశతిలో గుర్తించిన అత్తా, పోట్టం, అద్దాఏ, మఇల (మైల), దోరో (దారం), అవ్వో (అమ్మో), దే (అదో) మొ॥ దాదాపు 40 పదాలను పేర్కొన్నారు. ప్రాకృత భాషాసాహిత్యాంశాల ఆధారంగానే రామచంద్రగారు తెలుగుదేశంలోని బౌద్ధశాఖలు, బౌద్ధ సాహిత్యం- ఆంధ్రబౌద్ధాచార్యులు మొదలైన అంశాలపై రాసిన విలువైన పరిశోధన వ్యాసాలు ఇందులో ఉన్నాయి. రామచంద్రగారు ప్రాకృత భాషాసాహిత్యాలకు చేసిన సేవకు ఈ గ్రంథం నిలువెత్తు సాక్ష్యమనటంలో అతిశయోక్తి లేదు.

తిరుమల రామచంద్ర గారి ప్రతిభకు, పరిశోధన ప్రవణతకు, గాఢ పరిశీలన శక్తికి వారి 'మన లిపి పుట్టుపూర్వోత్తరాలు' అన్న గ్రంథాన్ని దీపస్తంభంగా పేర్కోవచ్చు. రామచంద్రగారి తక్కిన గ్రంథాలన్నింటా మనందరికీ ప్రహతమైన సాహిత్యమూ, భాష మొదలైనవి చర్చనీయాంశాలైతే ఇందులో లిపికి సంబంధించిన అంశం చర్చనీయాంశం. ఎంతో కఠినమైన అంశం. పరిశోధనమే జీవితధ్యేయంగా ఎంచినవారు కనుక ఎంతో శ్రమించి లిపి పుట్టుపూర్వోత్తరాలనూ, దాని క్రమ పరిణామాన్నీ ఈ

గ్రంథంలో చర్చించినారు. "ప్రాచ్య పాశ్చాత్య పండితులు లిపి పరిణామం గురించి చెప్పిన సంగతులు క్రోడీకరించి భారతీయ దృక్పథంలో చెప్పడమే నే నీ పుస్తకంలో చేసిన పని. ప్రజాసామాన్యానికి లిపి పుట్టుపూర్వోత్తరాల జ్ఞానం కలిగించడానికి ఇలాటి ప్రయత్నం జరగడం భారతదేశంలోనే మొదలనిమాత్రం మనవి చేయగల"నని చెప్పుకొన్న మాటలు అక్షరసత్యాలు. పరిశోధనైకవేద్యమైన శాస్త్రీయమైన అంశాన్ని ప్రజాసామాన్యానికి అందించే దృష్టితో రచింపబడింది కనుకనే ఇందులో ఆసక్తికరమైన శైలి వాడబడింది. ఇందులోని 'ప్రాణాలతో ఉన్న పుస్తకం', 'మాట్లాడే వస్తువులు', 'కథ చెప్పే కాయితం', ఒత్తుల వయ్యారాలు', 'అంకెల అందచందాలు' మొదలైన శీర్షికలు పాఠకులకు ఎంతో ఆసక్తిని కలిగిస్తాయి. ప్రాచ్య పాశ్చాత్యపండితులు రాసిన ఎన్నో గ్రంథాలను ఆపోశనపట్టి వివిధదేశాలలోని ప్రాచీన లిపి విశేషాలను ఇందులో వివరించడం జరిగింది. ప్రాచీన మానవునికి సర్వగ్రంథాలు కంఠస్థంగా ఉండేవనీ కనుక తొలిపుస్తకం మానవుడేనని పేర్కొంటూ ప్రాచీన మానవుడు తొలుత వస్తువులనే ఉత్తరాలకు వాడుకునేవాడనీ, ఆ తరువాత వస్తువుల బొమ్మలను ఉత్తరాలకు వాడుకునేవారని, చిత్రలిపి నుండి అక్షరలిపి ఏర్పడిందని సోదాహరణంగా నిరూపించినారు. దాదాపు ఏడువేల సంవత్సరాలకు పూర్వం అవతరించిన అత్యంత ప్రాచీన సారస్వతమైన ఋగ్వేదంలోనూ, (ఉత త్వః పశ్యన్న దదర్శ వాచమ్ మొ॥) తైత్తిరీయసంహితలోనూ (పదార్థం - చివరి సంఖ్య - లక్షకోట్లు), బ్రాహ్మణాల్లోనూ (బంగారం - తూనిక - కృష్ణ 12 కృ - 1 మానం; దీనిని 12, 24, 48, 96 అని హెచ్చువేస్తూపోతే 3, 93, 216 వరకు గుణోత్తరశ్రేణి ఏర్పడుతుంది) రాతకు సంబంధించిన ఆధారాలున్నాయనీ, క్రీస్తుకు ఎనిమిది శతాబ్దాలకు పూర్వపు వ్యాకర్త పాణిని అష్టాధ్యాయిలో లిపి, లిభి, లిపికర అనే పదాలు ప్రయోగింపబడ్డాయనీ, యవనుల లిపిని యవనానీ అంటారనీ పేర్కొని అత్యంత ప్రాచీనకాలంలోనే భారతదేశంలో లిపి ఉండేదనే విషయాన్ని సప్రమాణంగా నిరూపించినారు.

బుద్ధుడు పలకా బలపం తీసుకొని బడిగి వెళ్లినాడట. ఆచార్యుడైన విశ్వామిత్రుడు అక్షరాలు దిద్దుకొమ్మని అంటే 64 లిపుల్లో ఏ లిపి నాకు నేర్పింపదలచుకున్నారు? అని 64 లిపుల పేర్లను పేర్కొన్నాడట. కనుక వాటిలో ఈ అరవై నాలుగు లిపులపేర్లు 'లలిత విస్తరం' లో పేర్కొబడ్డాయని చెపుతూ వీటిలో కొన్నైనా అప్పటికి ప్రచారంలో ఉండవచ్చని పేర్కొన్నారు. భారతదేశంలో వాడుకలో ఉన్న అన్ని లిపులకు బ్రాహ్మీ లిపి మూలమైనట్లే తెలుగులిపికి కూడా బ్రాహ్మీ లిపియే మూలమని పేర్కొని

ఆంధ్రదేశాన్ని పరిపాలించిన వివిధ రాజులు వేయించిన శాసనాల్లో తెలుగు లిపి ఏవిధంగా పరిణామం చెందింది స్పష్టపరచినారు. వివిధ లిపులు వ్రాయబడిన వస్తువులను బట్టి రామచంద్రగారు వీటిని శాశ్వత పుస్తకాలు (రాతిగుహలు, స్తంభాలు, రాతి ఫలకాలు మొ॥ - ఇనుప ఫలకాలు), కర్ర పలకల పుస్తకాలు, మైనపు పలకల పుస్తకాలు, చర్మ పుస్తకాలు మొదలైన వివరాలను పేర్కొంటూ వాటి చిత్రాలను కూడా ఇచ్చినారు. తిరుమల రామచంద్ర గారి గ్రంథాలన్నింటిలోనూ ఈ లిపి పుట్టుపూర్వోత్తరాలు చాలా విశిష్టమైన పరిశోధన గ్రంథమని చెప్పడంలో సందేహం లేదు. లిపి పరిణామాన్ని తెలిపే ఇలాంటి గ్రంథం తెలుగులోనే కాదు భారతీయ భాషల్లోనే ఇంతవరకూ రాలేదు. ఇది భారతీయభాషలన్నింటిలోనూ అనువదింపజేయడం ఎంతో అవసరం.

రామచంద్ర గారి మరో గ్రంథం 'మనవి మాటలు'. భారతిలో 'మనవి మాటలు' పేరుతో రాసిన వ్యాసాలు కొన్ని ఇందులో ఉన్నాయి. తక్కిన వ్యాసాలు కూడా వివిధ పత్రికల్లో ప్రచురింపబడ్డవే. ఇందులోని వ్యాసాలు కొన్ని బుద్ధి వికాసాన్ని కలిగించేవి. మరికొన్ని వినోదం కలిగించేవి. మరికొన్ని ఆలోచనలు రేకెత్తించేవి అని రామచంద్ర గారే 'మనవి'లో పేర్కొన్నారు. సంస్కృతాంధ్ర ప్రాకృత సాహిత్యాలు, నిఘంటువులు, సంగీత చిత్రకళ పదకోశాలు, విమర్శ, ఎంకి పాటలు, తెలుగులో తమిళ, కన్నడ పదాలు మొదలైన అంశాలతోపాటు ఏలూరు వరంగల్ తివాచీలు, రచయితల కీర్తికాంక్ష, ఆడవారికి నిజమైన స్వాతంత్ర్యం - ఆర్థిక స్వాతంత్ర్యం మొదలైన సాహిత్యేతరఅంశాలపై కూడా వ్యాసాలున్నాయి.

సంస్కృతవాఙ్మయంలో చెఱకు, బెల్లం, చక్కెర' అనే వ్యాసంలో వేదం మొదలుకొని కావ్యసాహిత్యం వరకూ ఉన్న సంస్కృత సాహిత్యంలోను, సుశ్రుతం మొ॥ వైద్యగ్రంథాల్లోనూ చెరకు ప్రసక్తి ఉన్న ఘట్టాలను పేర్కొని చెరకునుండి ఏర్పడే గుడ శర్కరాదుల విశేషాలను వివరించినారు. సుశ్రుతుడు చెప్పిన 'పౌండ్రకో భీరుకశ్చైవ వంశకః శ్వేతపారకః' అని పండ్రెండు రకాల చెరకు జాతులనుపేర్కొని చెరకు, బెల్లం అనే శబ్దాలతో ఏర్పడిన ఎన్నో లోకోక్తులను, న్యాయాలను, సుభాషితాలను వివరించడం గమనిస్తే 'కాదేదీ సమీక్షకనర్హం' అనే భావన కలుగుతుంది. తెలుగులో 'పంచదార' అనే పదం ఎలా వచ్చిందో నాకింతవరకూ తెలియదు. రామచంద్రగారి ఈ వ్యాసంవల్లే తెలియవచ్చింది. మలయాళంలో పంచసార అంటారట పంచదారను. ఇది ఐదుసార్లు వడపోయగా మిగిలిన సారం కనుక పంచసార అయ్యిందని అదే తెలుగులో పంచదార

అయ్యిందట. శర్కర అంటే మొరుం మొరుంగా ఉండేదనీ అదే తెలుగులో చక్కెర, తమిళంలో శక్కలై, కన్నడంలో సక్కరె అయ్యిందనీ, శర్కరనుండే షుగర్ మొదలైన పదాలు వచ్చినాయని పేర్కొన్నారు. ఈ వ్యాసం ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన కేంద్రం (అనకాపల్లి) వారి విశేష సంచికలో ప్రచురింపబడింది. "విశ్వవిద్యాలయాలకు వెలిగా జరిగిన వాఙ్మయ పరిశోధన" అనే వ్యాసం చదివితే జయంతి, గిడుగు, చిలుకూరి, పంచాగ్నుల, వేటూరి, మారేపల్లి, కూనవల్లి, కందుకూరి, కాశీభట్ల, జయంతి, వేదం, టేకుమళ్ల, చాగంటి, దీపాల, రాళ్లపల్లి, సురవరం, శేషాద్రి రమణ కవులు, తాపీ, తిమ్మావజ్ఝల, తిరుమల రామచంద్ర మొదలైనవారు తెలుగు పరిశోధనరంగంలో చేసిన కృషి మనను సంభ్రమాశ్చర్యాలకు లోను చేస్తుంది. 'నేను రాసిన వ్యాసాలు 99 పాళ్లు మౌలికమైన నూతనాంశాలు తెలిపేవే' అని రామచంద్రగారు తమ వ్యాసాలను గూర్చి చెప్పుకున్నారు. ఇది అక్షరాలా సత్యం.

'నన్నయ పదప్రయోగకోశ నిర్మాణం' అనే వ్యాసంలో 'ఒక్క నన్నయ భారతానికే కాదు ప్రతి ప్రాచీన కావ్యానికీ సిద్ధం చేయాలి. అప్పుడే అనేక అపూర్వ శబ్దాలు మనకు తెలిసి మహానిఘంటు నిర్మాణానికి, తద్వారా వాఙ్మయ విస్తృతికీ తోడ్పాటు కలుగుతుందని చక్కని సూచన చేసినారు. తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడెమీ ఈ దిశలో కృషిచేస్తే భాషకు ఎంతో మేలు జరుగుతుంది. నన్నయ పదప్రయోగకోశంలో కేవలం దేశ్యపదాలే చేర్చడం సముచితం కాదనీ, అందులో ప్రయోగించిన ఎన్నో సంస్కృతపదాలు సంస్కృతంలోని అర్థాల్లోకాక భిన్నార్థాల్లో వాడబడ్డాయని చెపుతూ ప్రతి సంస్కృతపదంకూడా నన్నయ పదప్రయోగంకోశంలో ఉండాలని పేర్కొని దీనికి అంతకక్షయం (యమగృహం అని అర్థం), రచియించు (కట్టు అని అర్థం) మొ॥ పదాలను దృష్టాంతంగా చూపినారు.

రామచంద్ర గారికి పూర్వాంధ్ర మహాకవులమీద అభిమానం ఎనలేనిది. కనుకనే 'నా కలలు' అనే వ్యాసంలో వారికి స్మారకంగా ఏమేం చేయాలో వివరించినారు. నన్నయ్యకు - గోదావరీతటాన గోపురం, సోమనాథునికి పాల్కురికిలో సౌధం, రంగనాథునికి ఓరుగల్లులో వీరగల్లు, కవిబ్రహ్మకు పెన్న ఒడ్డున కీర్తిస్తంభాన్ని, ఎఱ్ఱనకు పెంచికలదిన్నెలో పీఠాన్ని, పోతనకు బమ్మెరలో భవనం, శ్రీనాథునికి కృష్ణాతీరంలో గొప్ప కట్టడం, అన్నమయ్యకు తిరుపతిలో మరపురాని మందిరం - ఇలా ప్రసిద్ధ కవులందరికీ శాశ్వత చిహ్నాలు నెలకొల్పాలని సూచించినారు. తెలుగు కవుల విషయంలో వారు కన్న కలలవి.

వీలైనంత త్వరలో చిట్కాలో చిరయశస్సును సంపాదించుకుందామనే అపోహలు తొలగించుకోవడం ప్రతి రచయితకూ అవసరమనీ, రచనలో సత్తా ఉంటే రచన ఎన్నటికైనా ప్రజల హృదయాలలో నివసించకపోదనీ సత్తా లేకుండానే కీర్తిని కోరుకునే కవులకు 'కీర్తీషణ' అనే వ్యాసంలో చక్కని హితవు పలికినారు. ఇలా రామచంద్రగారి మనవిమాటల్లోని ప్రతి వ్యాసం విలువైనదే అని భావించవచ్చు.

తెలుగువారి భాషాసాహిత్యాలపైనే గాక తెలుగు సంస్కృతికి సంబంధించిన వ్యాసాల సంకలనాలను కూడా రామచంద్రగారు సంతరించినారు. వాటిలో ప్రధానమైంది 'హిందువుల పండుగలు – పర్వములు' అనేది. అంతకుముందే సురవరంవారి తెలుగు పండుగలను గురించిన పుస్తకం వెలువడింది. కాని దానిలో లేని విషయాలు పరిశోధించి, పండితులు మెచ్చే పుస్తకం రాయమని బాలసరస్వతీ బుక్ డిపో యజమాని బాలనాగయ్య సెట్టి గారు కోరగా రామచంద్ర గారు వారు కోరినట్లుగానే ధర్మశాస్త్ర, జ్యోతిష, ఆయుర్వేద, మానవజాతిశాస్త్ర, సాంఘికశాస్త్ర, భాషాశాస్త్రాల దృష్టితో తెలుగువారి పండుగలను గురించి చక్కని గ్రంథాన్ని రచించినారు. ఏటుకూరి బలరామమూర్తి గారు విశాలాంధ్ర దినపత్రికలో 'పాత చాదస్తాలు తెలుసుకోవడానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుంది' అని ఏకవాక్య సమీక్ష రాసినారట! కాని నేడు ఆధునికమనుకుంటున్న అంశాలు కూడా భవిష్యత్తులో చాదస్తాలుగానే భావింపబడతాయి కదా! ఐనా విశ్వనాథ, రాళ్లపల్లి బూర్గులవంటి వారు ఈ గ్రంథాన్ని ఎంతగానో ప్రశంసించినారట.

రామచంద్రగారు మౌలిక రచనల్లోనేకాక అనువాద రచనల్లోనూ సిద్ధహస్తులు. అనువాదమే లేకపోతే ప్రపంచ సాహిత్యమే లేదని, విశ్వవిఖ్యాతమైన ఆంగ్ల సాహిత్యం సగం అనువాదమేనని పేర్కొన్నారు. తెలుగులోని భారత, భాగవత, రామయణాది ఉద్గ్రంథాలన్నీ అనువాదాలే గదా! అనువాదమంటే అనుసృష్టి Transcreation. రామచంద్రగారు సంస్కృత, ప్రాకృత, కన్నడ, తమిళ, హిందీ, ఆంగ్ల – భాషలనుండి గ్రంథాలను అనువదించినారంటే వారి బహుభాషాపాండిత్యాన్ని మనం అర్థం చేసుకోవచ్చు. అజ్ఞాత కర్తృకమై బుద్ధుని చరిత్రను తెలిపే లౌకిక వచన వాఙ్మయంలోని తొలిగ్రంథమైన లలితవిస్తరాన్ని బులుసు వెంకటరమణయ్యా గారితో కలిసి తెనిగించినారు. క్షేమేంద్రుని బృహత్కథామంజరిని అనువదించి నాలుగేండ్లు వరుసగా ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో ప్రచురించినారు. వేటూరి శంకరశాస్త్రిగారి ప్రోత్సాహంతో హరమేఖల అనే ప్రాకృతంలోని ఆయుర్వేదగ్రంథాన్ని ఎంతో శ్రమించి

అనువదించినారు. 6వ శతాబ్ది ప్రాకృతకావ్యమైన లీలావయిని అనువదించి ఆంధ్రప్రదేశ్ సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రచురించినారు. ఇవన్నీ ప్రాకృత గ్రంథానువాదాలు. ఇక కన్నడం నుండి పన్నెండు నవలలు, కథాసంకలనాలు, వ్యాససంకలనాలు అనువదించినారు. సుశీలానయ్యర్ రాసిన 'గాంధీజీకే కారావాస్‌కే కహానీ' అనే హిందీ గ్రంథాన్నేకాక ఆంగ్లంనుండి దాదాపు ముప్పై గ్రంథాలు, కొన్ని వందల ఆంగ్లవ్యాసాలు అనువదించినట్లుగా ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహించిన పరివాతవాణి ప్రసంగవ్యాసంలో పేర్కొన్నారు. హరేకృష్ణ సంస్థవారికోసం 'కృష్ణా ది గాడ్' అనే వేయిపుటల ఆంగ్లగ్రంథాన్ని 'దేవాది దేవుడు కృష్ణుడు' అనే పేరుతో రచించినారంటే వారి అనువాదపటిమ ఎంత గొప్పదో తెలుసుకోవచ్చు.

తెలుగువారు తెలుగుతోపాటు సోదరభాషల సాహిత్యాన్నికూడా అధ్యయనం చేస్తేనే ఆయా భాషల సంబంధం ఉన్న తెలుగు గ్రంథాలకు సంబంధించిన గ్రంథగ్రంథులను విడదీసే అవకాశం ఉంటుంది. కన్నడ భాషలోకూడా ప్రావీణ్యం ఉన్నవారు కనుకనే రామచంద్రగారు శివతత్త్వసారాన్ని కన్నడ శివతత్త్వసారంతోనూ, కేతన ఆంధ్రభూషణాన్ని కన్నడంలోని కర్ణాటక భాషాభూషణంతోనూ సరిపోల్చి ఎన్నో కొత్త అంశాలు పేర్కొన్నారు. తెలుగు పరిశోధనారంగంలో పేరెన్నికగన్న వేటూరి, మానవల్లి, నిడదవోలు గారల పరిశోధనవ్యాసంగాన్ని వారికతిసన్నిహితంగా ఉంటూ పరిశీలించినవారు కనుక వీరు వారి సాహిత్యకృషిని, పరిశోధన వైశిష్ట్యాన్ని వివరిస్తూ 'మూడు వాఙ్మయశిఖరాలు' అనే గ్రంథాన్ని రచించినారు.

పలువురు సాహితీప్రముఖులను ఇంటర్వ్యూచేసి సరికొత్త పద్ధతిలో రాసిన వ్యాసాల సంకలనం రామచంద్రగారి 'మరపురాని మనీషి'. ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో వ్రాసిన వ్యాసాల సంకలనం. కాశీ కృష్ణాచార్యులు, ఖండవల్లి లక్ష్మీరంజనం, గిడుగు సీతాపతి, గుఱ్ఱం జాషువా మొదలైన మహామనీషుల సాహిత్య కృషిని వివరించడమేకాక వారి వ్యక్తిగతమైన అనేక విషయాలను కూడా ఇందులో పొందుపరచడం జరిగింది. పత్రికలో వారం వారం ఇందులోని వ్యాసాలు ప్రచురింపబడుతున్నప్పుడు ఈ వారం మరపురాని మనీషి ఎవరు అని ప్రజల్లో ఎంతో ఉత్కంఠ కలిగేదట. దీనివల్ల కూడా వారికి మంచి కీర్తి వచ్చిందని వారే చెప్పుకున్నారు.

ఇక రామచంద్రగారు చేసిన గ్రంథ సమీక్షలు కొన్ని వందలే ఉంటాయి. నిర్భీకంగా, నిష్పక్షపాతంగా గ్రంథసమీక్షలు చేసి ఎంతోమందికి దూరమైన సాహితీధీరులు, సత్యవచనులు రామచంద్రగారు.

రామచంద్రగారు విమర్శ, పరిశోధన, సాహితీమూర్తుల చరిత్ర రచన గ్రంథసమీక్ష అనువాదం మొ॥ ప్రక్రియల్లోనేకాక నిఘంటు నిర్మాణంలో కూడా తమ ప్రతిభను చూపినారనడానికి వారు రచించిన త్రిభాషా నిఘంటువు, లలితకళా పదకోశం సాక్ష్యాలు. తెలుగు – తమిళం – కన్నడ నిఘంటువును చల్లా రాధాకృష్ణ శర్మగారితో కలిసి నిర్మించగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురించింది. ఇది రామచంద్ర గారికి ఈ మూడు భాషలపై గల అధికారాన్ని వ్యక్తం చేస్తుంది. భాషావిషయంగా తులనాత్మక పరిశీలన చేసేవారికి ఈ నిఘంటువెంతో ఉపయోగకారి. రెండవది లలితకళా పదకోశం. తమ చిత్రకారమిత్రులు పలువురు తాము లలితకళలపై ఏదైనా వ్రాయదలచుకుంటే పదజాలం దొరకడం లేదనీ, ఒక లలితకళా నిఘంటువు కావాలని కోరగా తాను, పి.టి. రెడ్డి గారు లలితకళా అకాడమి వారిచే దీని నిర్మాణాన్ని ఆమోదింపజేసినారు. రామచంద్రగారు చీమకుర్తి శేషగిరి రావుతోను, వజయిల శ్రీనివాస శర్మగారితో కలిసి ఈ నిఘంటువును సిద్ధం చేయగా తెలుగు విశ్వవిద్యాలయం ముద్రించింది. ఆంగ్లంలోలాగా తెలుగులో శాస్త్ర నిఘంటువులు లేని కొరతను ఈ నిఘంటువు కొంతవరకు తీర్చిందని చెప్పాలి. ఇలా అన్ని కళలకు విషయ నిఘంటువులు రావలసి ఉంది.

1944 నుండి 51 సంవత్సరాలు పత్రికారచయితగా వివిధ శీర్షికలు నిర్వహించి 'పత్రకార శిరోమణి' బిరుదు పొందినారు. పత్రికారచయితగా వారు పొందిన కీర్తిప్రతిష్ఠలకు ఈనాడు అనుభవజ్ఞులైన వరిష్ఠ పత్రికారచయితలు ఏర్పాటు చేసిన ఈ శతజయంత్యుత్సవసభే తార్కాణం.

రామచంద్రగారి రచనాశైలి విలక్షణమైంది. ఎంత శాస్త్రీయమైన అంశానైన్నా అందమైన శైలిలో ఆకర్షణీయంగా హృద్యంగా చెప్పడం వారి కలానికున్న సహజగుణం. "దేశినామమాలలోని మరికొన్ని తెలుగుపదాలు" అనే వ్యాసాన్ని ఎలా ప్రారంభిస్తారో చూడండి. 'నిన్ను చూస్తే తందామనిపిస్తుందోయ్' అన్నారు డా. చిలుకూరి నారాయణరావుగారు ఒకనాడు మద్రాసు సెంట్రల్ స్టేషనులో బండెక్కుతూ నన్ను చూచి. అంతటి అపరాధం ఏమి చేశానండీ! అని ప్రశ్నించాను విధేయతతో. అపరాధమా! మహాపరాధమే చేశావు. సంస్కృత ప్రాకృత సాహిత్యాలకే ద్రోహం తలపెట్టావు. గాథా శప్తశతిలో తెలుగుపదాలు చేరాయని వ్రాశావు. ఈ ప్రతిలోమాన్ని ఎవరు సహిస్తారు అన్నారు ఉద్రేకంతో'. వారి శైలికి ఇదొక ఉదాహరణం.

ఇలా అనేకభాషల్లో అనేకప్రక్రియల్లో అనితరసాధ్యమైన ఉత్తమరచనలను వెలువరించి సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన 'మరపురాని మహామనీషి' శ్రీ తిరుమల రామచంద్రగారికి నా భక్తిపూర్వకప్రణామాలు.

--------

30

# ప్రాతః స్మరణీయులు తిరుమల రామచంద్ర

- భండారు శ్రీనివాసరావు

ఇప్పుడు నా వయస్సు అరవై ఎనిమిది. అంటే నేను పుట్టకమునుపే ఆయన విఖ్యాత పత్రికల్లో ప్రఖ్యాత జర్నలిస్టు. ఒకటి రెండు భాషల్లో అరకొర అభినివేశం నాదయితే అనేక భాషల్లో మంచి పట్టు సాధించిన ప్రజ్ఞాశీలి వారు. ఎక్కడో ఏదో జెర్రి పోతంత అదృష్ట రేఖ కనీ కనబడకుండా వుందేమో. లేకపోతే నేనేమిటి? అంతటి పండిత ప్రకాండుడి శత జయంతి సందర్భంగా జరిగిన ఓ సమావేశానికి అధ్యక్షత వహించడం ఏమిటి? ఏనాడో పెట్టిపుట్టకపోతే ఇలాంటిది సాధ్యమా!

తిరుమల రామచంద్రగారి గురించి చెప్పడం ఆయనకే సాధ్యం అని నా నమ్మకం. తనని గురించి తాను చెప్పుకున్నా అందులో సొంత గొప్పలు కనబడవు. పైగా మానవ బలహీనతలను కూడా ఆయన ఎంతమాత్రం భేషజాలకు పోకుండా నిర్భీతిగా రాసుకున్నారు. ఆయన విలక్షణ వ్యక్తిత్వానికి ఇదే గీటురాయి.

పుట్టిన వందేళ్ళ తరువాత ఆయన్ని గుర్తుంచుకుని వేడుక చేస్తున్న సందర్భం ఇది. ఈ పుణ్యం కట్టుకున్న వాళ్ళు బహుధా అభినందనీయులు. ఎందుకంటే - అక్కిరాజు రమాపతిరావు గారు పేర్కొన్నట్టు రామచంద్రగారు జీవించి వుండగా వారికి 'షష్టిపూర్తి జరగలేదు. సప్తతి లేదు. అశీతి అసలే లేదు. సహస్ర చంద్ర దర్శన ఉత్సవం సమకూడలేదు. పూర్ణ జీవితం అనుభవించి కూడా రామచంద్రగారు త్రిదశుడు' అన్నారు అక్కిరాజువారు. అంటే ఏమిటట. ఎప్పుడూ ముప్పయ్యేళ్ళవాడిగానే జీవించారట. బాల్య, కౌమార, యవ్వన, నిర్మల, నిర్భర, నిరంతర, సమధికోత్సాహ మనస్వితతోనే ఆయన ఎనభై నాలుగేండ్ల జీవితాన్ని యదృచ్ఛాలాభ సంతుష్టంగానే గడిపారని అక్కిరాజువారు అద్భుతమయిన కితాబు ఇచ్చారు.

కొందరు కొన్నిట్లోనే తమ ప్రతిభ కనబరుస్తారు. కానీ రామచంద్రగారో, సహస్ర బాహువు. ఆయన వేలు పెట్టని రంగం లేదు. పత్రికా రచయిత, కవి, గ్రంథకర్త, విమర్శకుడు, బహుభాషాకోవిదుడు. అంతేనా అంటే అంతే కాదు. పదం సరిగా కుదరలేదనిపించవచ్చు. 'దేశదిమ్మరి'కూడా. ఆయనలా వూళ్ళుపట్టుకుని తిరిగిన జర్నలిస్టు మరొకరు కనబడరు. జర్నలిస్టు తిరక్క చెడ్డాడంటారు. కానీ తిరిగి తిరిగి ఆయన బావుకున్నదేమీ లేదు కానీ తెలుగు జర్నలిజం తలరాత మాత్రం ఆయన రాతలతో బాగుపడింది.

జీవిక కోసం ఆయన ఎత్తని అవతారం లేదు. అనంతపురం జిల్లాలో ఓ మారుమూల కుగ్రామం రాఘవంపల్లి (రాగంపల్లి)లో పుట్టి, నాటి బళ్ళారి జిల్లా ఆనెగొందిలో ప్రాథమిక విద్య, తిరుపతి దేవస్థానం కళాశాలలో చదువు, నెల్లూరు ఆయుర్వేద కళాశాల, చెన్నపట్నం మైలాపూర్ కాలేజీ-ఇలా ఇలా సాగి లాహోరు, బెలూచిస్తాన్, క్వెట్టా, చమన్ ప్రాంతాలు తిరిగి, కాన్పూర్‌లో డెయిలీ టెలిగ్రాఫ్ పత్రికలో చేరడం వరకు సాగిపోయింది. అంతటితో ఆగితే ఆయన రామచంద్రగారు యెట్లా అవుతారు. హైదరాబాదులో మీజాన్ పత్రిక, తరువాత ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆంధ్రపత్రిక దినపత్రికల్లో చాలాకాలం తన రచనలతో వాటికి ఒక విశిష్టతను తెచ్చిపెట్టారు.

'హంపీ నుంచి హరప్పా దాక' అనే రచనలో తిరుమల రామచంద్ర గారు తన జీవితానుభవాలను రసరమ్యంగా కూర్చారు. ఇది చదివిన తరువాత ఎవరికయినా కలిగే అభిప్రాయం ఒక్కటే. తిరుమల రామచంద్ర గారు 'తెలుగువాడిగా పుట్టి దురదృష్టవంతులు అయ్యారు. ఆయన తెలుగువాడిగా పుట్టడం వల్ల తెలుగువారు అదృష్టవంతులు అయ్యారు'.

అతిశయోక్తిగా అనిపించవచ్చు కానీ ఒకటి మాత్రం నిజం. 'హంపీ నుంచి హరప్పా దాక' అనే రచన తెలుగులో కాకుండా మరే ఇతరేతర భాషలోనో వచ్చివుంటే 'నోబుల్' పురస్కారం లభించి వుండేదేమో. అనుమానం వుంటే ఓ సారి చదివి చూడండి. ఆ మహానుభావుడికి నా కైమోడ్పు.

--------

32

# తిరుమల రామచంద్ర పాళీ, ప్రాకృతాల పరిశోధన

- ఆచార్య చౌడూరి ఉపేంద్ర రావు

శ్రీ తిరుమల రామచంద్రగారి జీవిత విశేషాలను చదువుతుంటే ఆనందంతో ఒళ్ళు గగుర్పొడుస్తుంది. దేశ స్వాతంత్ర్యోద్యమంలో ఉత్సాహంగా పాల్గొని కారాగారవాసం అనుభవించిన శ్రీరామచంద్రగారు ప్రాకృతం వట్ల ఎలా మక్కువ పెంచుకున్నారనిపిస్తుంది. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఎన్నో గ్రంథాలు చదివి తమ జ్ఞానాన్ని ద్విగుణీకృత పరచుకున్నారు శ్రీ రామచంద్రగారు. అక్కడే వారికి బ్రాహ్మీ, శారదా మొదలైన వివిధ లిపులతో పరిచయం ఏర్పడింది.

వేటూరి ప్రభాకరశాస్త్రి, మానవల్లి రామకృష్ణకవి వంటి మేధావులతో పరిచయం, సహచర్యమూ లభించాయి వీరికి. అందుకేనేమో భాషా సాహిత్యాల విషయంలో గహనమైన పరిశోధనాసక్తి వారిలో పెరిగింది. పూవు పుట్టగానే పరిమళిస్తుంది అన్నట్లుగా శ్రీ రామచంద్రగారు బాల్యంలోనే తమ ప్రతిభను ప్రదర్శించారు. తల్లిదండ్రుల, మిత్రుల మహత్వాకాంక్షలకు గురికాకుండా, మరే ఇతర బంధనాలలో చిక్కుకోకుండా వారు యథేచ్ఛగా జీవితాన్ని కొనసాగించారు. ఏ పని చేసినా దాన్ని ఆసక్తితో హృదయస్ఫూర్తిగా చేశారు. అందుకే వారికి వారి కార్యాలలో సాఫల్యం లభించింది, సౌజన్యం సిద్ధించింది.

భారతీయ భాషాసాహిత్యాలతో తాదాత్మ్యం పొంది వాటిని క్షుణ్ణంగా అర్థం చేసుకున్నవారికి తప్పకుండా ప్రాకృత పాళీ భాషా సాహిత్యాల వైశిష్ట్యం అవగతమౌతుంది. భారతీయ భాషలను అధ్యయనం చేసేవారు కోకొల్లలుగా ఉన్నారు, సంస్కృత విద్వాంసులూ అనంతంగా ఉన్నారు, అయితే వారందరికీ ఈ మార్మికత అర్థం కాదు. దానికి కారణం వారు పెరిగే స్థితి గతులు, వాతావరణం అలాంటివి.

ఈ సమస్త జంబూద్వీపంలో వివిధ ప్రాకృతాలు వాడుకలో ఉండేవి అని శ్రీ తిరుమల రామచంద్రగారు పదేపదే అనేవారు. నిజానికి ఈ ప్రాకృత భాషలే ఇక్కడ పూర్వం వాడుక భాషలుగా ఉండేవి. ఒక్క తెలుగుభాషకే కాదు, అన్ని భారతీయ భాషలకు ఈ ప్రాకృత భాషలే మూలభూతమైనవన్నది వాస్తవిక విషయం. నిజానికి ఇది ప్రాకృతము, ఇది సంస్కృతము, ఇది పాళీ అని మనం భావించడంలో తప్పులేదు. దీనికి కారణం కాలక్రమంలో ఈ భాషా సాహిత్యాల విషయంలో మనకు ఏర్పడిన పృథక్త్వ బుద్ధి అలాంటిది. ఇది సహజం. కాని మానవజీవితంలో భాష అనాదిగా ప్రవహిస్తూనే ఉన్నది. ఈ ప్రవాహం ప్రజల చేతిలోగాని, వ్యాకరణ వేత్తల చేతిలోగాని లేదు. అది నిరంతరంగా ప్రవహించింది, ప్రవహిస్తున్నది కూడా. ఈ ప్రవాహోద్ధృతిలో భాషలు ఎన్నో మలుపులు తిరుగుతాయి. వాటి రూపాలు మారతాయి.

తమ అశేష ప్రజ్ఞాబలంతో శ్రీ రామచంద్రగారీ విషయాన్ని తెలుసుకున్నారు. సత్యసాక్షాత్కారమయ్యాక ఈ విషయాన్ని నలుగురికి తెలపాలని తపించారు. ఈ క్రమంలో వారి కలంనుండి గళం నుండి ఎన్నో విషయాలు ప్రవహించాయి. శ్రీరామచంద్రగారి అభిప్రాయానుసారంగా ప్రజలే ప్రకృతులు వారి భాష ప్రాకృతం. మనదేశంలో సంస్కృత-ప్రాకృతాలు సమాంతరంగా అభివృద్ధి చెందాయి.

శ్రీరామచంద్రగారి కథనానుసారం తెలుగుపై ప్రాకృత భాషా ప్రభావం ఉంది[1]. ఇక గాథా సప్తశతిలో తెలుగు పదాలు, వజ్జాలగ్గంలో తెలుగు పదాలు అనే వ్యాసాలలో ప్రాకృతంలోకి ప్రవేశించిన తెలుగు పదాలను చాలా వాటిని చూపారు వారు. అంటే వారి అభిప్రాయానుసారంగా ప్రాకృత-తెలుగు భాషలు ఒకే సమయంలో వ్యవహృతమయ్యాయి. అందుకే తెలుగు పదాలు ప్రాకృతంలోకి ప్రవేశించాయి. ఈ రెంటిలో ఏది జన్యము, ఏది జనకము అని సందేహం రావడం సహజమే అయినా. భాషా వికాస క్రమాలను ఇదమిత్థంగా చెప్పడం కష్టం. అయితే శ్రీ రామచంద్రగారే చాలాచోట్ల ప్రాకృత భాషా ప్రాచీనతను పేర్కొన్నారు.

"సుసంస్కృతమైన భాష ఉన్నతవర్గాల సొమ్మై, కాలం మారినా ఎంతమాత్రమూ పొల్లుపోక అష్ట దిగ్బంధాలతో రక్షితమవుతూ రాగా, దాని మూలమైన తల్లి వేరైన ప్రకృతుల భాష-ప్రాకృత భాష పిల్ల కాలువలను, ఏళ్ళను కలుపుకుంటూ ఎప్పటికప్పుడు

1. చూ. ప్రా.రా. క. పే. నం.116

విస్తృతమై ప్రవహించే మహా నదివలె కాలంతోపాటు, ప్రజల ఆచారాలు, అనుభవాలతో పాటు మారుతూ విస్తరించింది." అని శ్రీరామచంద్రగారు వ్రాశారు[2].

వారి ఉద్దేశ్యం ప్రకారంగా వేదాలలో కనిపించే వైదిక ఋక్కులు ఒక్కసారిగా ముద్దగా, పిడుగుపాటుగా ఆకాశం నుండి ఊడి పడినవి కావు. వైదిక ఋక్కులు అంత ఛందోబద్ధంగా నిర్మితమైనాయంటే ఆ భాష తప్పక ఆరోజుల్లో వ్యవహృతమై ఉండవచ్చుననే భావించాల్సి వస్తుంది.

వైదిక ఛందస్సు సంస్కృతానికంటే ప్రాకృతానికి దగ్గరగా ఉన్న భాష కాబట్టి దీనికి మూలం ప్రాకృతమేనని లేక ఇది కూడా ఒక విధమైన ప్రాకృతమేనని శ్రీ తిరుమల రామచంద్రగారి అభిప్రాయం. అయితే ఇంత ప్రాచీనమైన భాష ప్రాకృతభాష అని వారు వివరించారంటే ఆ భాషను తెలుగుకు మాతృకగా స్వీకరించారనే చెప్పాలి. మరి ప్రాకృతంలో కనిపించే తెలుగు పదాలన్నీ నిజానికి ప్రాకృతంలోనుంచి తెలుగులోకి వచ్చినవేనని భావించాల్సి వుంటుంది. లేక ప్రాకృతం తెలుగునాట ప్రవేశించే సమయానికి తెలుగుభాష రూపుదిద్దుకొని ఉండాలి. అప్పుడే తెలుగు పదాలు ప్రాకృతంలోకి ప్రవేశించే అవకాశముంది, అదే విధంగా ప్రాకృతపదాలు కూడా తెలుగులోనికి వచ్చి ఉండవచ్చు. ఇలా ఒక భాషలోని పదాలు మరో భాషలోకి ప్రవేశించి ఉండవచ్చు.

ఈ విషయాన్నే వివరిస్తూ శ్రీ రామచంద్రగారు "ఏతావాతా బుద్ధుని కాలంనుండే బౌద్ధం వ్యాపించిన తెలుగు దేశంలో పల్లవుల సామ్రాజ్యం చివరి వరకు ప్రాకృతం శాసనభాషగా ఉన్న తెలుగు దేశంలో తెలుగుపై ప్రాకృత ప్రభావం ఎక్కువగానే పడి ఉంటుంది." అని అన్నారు[3]. అయితే అప్పటికే తెలుగు భాష దేశీపదాల కూర్పుగా ఉండేది. అందుకే శ్రీ రామచంద్రగారు తరువాత వాక్యంలో "అలాగే దేశీయాలయిన తెలుగు పదాలు ప్రాకృతంలో చేరడం సహజం" అన్నారు. ఈ ఆదాన ప్రదానాలు తెలుపడానికే శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారు తెలుగు-పాళీ పదాల పట్టికను తయారు చేసి దాన్ని తెలుగు గోష్ఠిలో పఠించారు. చీమకుర్తి, రాంభట్ల వంటి మేధావుల ప్రేరణతో నేను కూడా తెలుగుగోష్ఠిలో పాళీ-భాషా సాహిత్యాలపై పత్రాలు పఠించాను. తెలుగుగోష్ఠి కృషితో "తెలుగు మఙుగులు", 'తెలుగులో పాళీ పదాలు' వంటి అద్భుతమైన గ్రంథాలు

2. చూ. ప్రా. రా. క. పే. నం.84

3. చూ. ప్రా. రా. క. పే. నం.92

వెలువడ్డాయి. ఇటువంటి మార్మికమైన సంస్థలు ఈనాడు కానరావు. ఇలాంటి వదవట్టికలనెన్నింటినో తయారు చేశారు శ్రీరామచంద్రగారు. వారి అభిప్రాయానుసారంగా ఈ ఆదానప్రదానాలు ఎలా జరిగాయో అర్థం చేసుకోవడం చాలా కష్టం. అయితే ఇలాంటి ఎన్నో దేశీపదాలు మొదట ప్రాకృతంలోకి చేరి తదనంతరం సంస్కృతంలోకి చేరి ఉంటాయని శ్రీరామచంద్రగారు పేర్కొన్నారు(4). ఈ ఆదానప్రదానాలు చూసే డా॥ చిలుకూరు నారాయణరావు గారు తెలుగుకు మూలం ప్రాకృత సంస్కృతాలని అభిప్రాయపడ్డారు.

అయితే శ్రీ రామచంద్రగారేమో తెలుగుకు మూలం పాళీ–పైశాచులనే నమ్మేవారు. ఈ పాళీ–పైశాచులు రెండూ ప్రాకృతాలే. అసలు పాళీ ప్రాకృతమేనా లేక పృథగస్తిత్వం గల భాషా? అన్న విషయంలో పండితులలో తర్జన భర్జనలు కొనసాగాయి. నేనీ ప్రశ్నను శ్రీ రామచంద్రగారితో కొన్నిసార్లు ప్రస్తావించగా వారు పాళీ ప్రాకృతాలు ఒకటేనని చెప్తూండేవారు. వారి అభిప్రాయానుసారంగా వివిధ ప్రాకృతాలలో పాళీ ఒకటి. ఈ విషయంతో మొదట నేను కొంత విభేదించినా తరువాత క్రమేణా ఇదే సత్యమని గ్రహించగలిగాను. శ్రీరామచంద్రగారు తెలుగు పక్షపాతి కావడంవల్ల తెలుగు భాషా పదాలే ప్రాకృతంలో చాలావరకు చేరాయని వాదించేవారు. అందుకే శ్రీ చిలుకూరు నారాయణరావుగారు శ్రీ రామచంద్రగారిని చూసినప్పుడల్లా "ద్రావిడభాషావాద సన్నిపాత జ్వరితుడు" అని హాస్యం చేసేవారు. ఒకసారేదో అవార్డు తీసుకుంటున్న సందర్భంలో డా॥ సి. నారాయణరెడ్డి గారు వీరిని చనువుతో "He is the mad of Prakrit" అని అనడం నాకింకా జ్ఞాపకం ఉంది. అయితే అది వ్యాజనింద మాత్రమే. నిజంగా వారికి ప్రాకృతమంటే చాలా పిచ్చి.

ప్రాకృత విషయంలో శ్రీరామచంద్రగారు అనేక మంది విద్వాంసులతో చర్చలు జరిపేవారు. వీరు శ్రీ చిలుకూరు నారాయణరావుగారితో, మరియు సంస్కృతాంధ్ర ప్రాకృత విద్వాంసులైన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారితోనూ ఈ విషయంపై అనేకమైన చర్చలు జరిపాక ప్రాకృతాంధ్ర భాషల మధ్యనున్న సన్నిహిత సంబంధాన్ని గుర్తించారు. అయితే ప్రాచీన విద్వాంసులు అన్ని పదాలనూ సంస్కృతంలోకి కలుపుకోవడానికి, వాటికి వ్యుత్పత్తులనేర్పరుచుకున్నారు. ఈ విషయంలో శ్రీ చిలుకూరు నారాయణరావు గారు కృషి చేశారు.

---

4. చూ. ప్రా. రా. క. పే. నం.99

కన్నడంలోనూ ఈ విధమైన ప్రయత్నం జరిగింది. 13వ శతాబ్దంలో జీవించిన కర్ణాటక వైయాకరణులు 'శ్రీ చెన్నవీరకవి' కాశకృష్ణ రచితమైన ధాతుపాఠానికి వ్యాఖ్యానం వ్రాస్తూ సంస్కృతేతర భాషలైన కన్నడ, తెలుగు, తమిళ భాషల ఉమ్మడి పదాలకు కాశకృష్ణ ధాతువులతో వ్యుత్పత్తులను సాధించారు. వాటిలో కొన్నింటిని ప్రదర్శిస్తున్నాను.

ఆట:- అట గతౌ, భ్రమతి, క్రీడయతీతి ఆటః, ఆటః = క్రీడనమ్

ఈటె:- ఏటతి-తాడయతి, ఈటగతౌ, ఈటిః= అస్త్రవిశేషః.

చాకలి:- చక తృప్తౌ, శీతీభావే చ చకయతి, చకతి, శీతీభవతి, చాకలః=రజకః, చాకలి=రజకీ

చాప:- చాప సాంత్వనే, చపతి, సంతుష్టో భవతి చాపా=కటమ్.

గూడెం:- గుడు=గూడ-నివాసే, గూడతి, నివసతి, గూడుః, గూడెం=నివాసస్థానమ్

పిల్ల:- పిల్ల చలనే, పిల్లతి నినదతే, పిల్లః=వత్సః, పిల్లా=వత్సా

ఆవు:- అవ రక్షణపాలనే, అవతి=పాలయతి, ఆవుః=గౌః

ముల్లు:- ముల్ల ధారణే, ఘర్షణే చ, ముల్లతే, ముల్లుః=కంటకమ్

పిట్ట:- పిట్ట చలనే, పిట్టతి, చలతి, పిట్టః=పక్షీ.

ఇలా చాలా పదాలకు చెన్నవీరకవి సంస్కృత వ్యుత్పత్తులను సాధించాడు. ఈ విషయమెంతో ఆసక్తికరంగా ఉంటుంది. తెలుగు కన్నడ భాషల్లోకి ప్రవేశించిన తద్భవ పదాలను పరిశీలిస్తే అవన్నీ ప్రాకృత పదాల వలెనే తోస్తాయి. అవి ప్రాకృతసమాలుగానో, ప్రాకృతభవాలుగానో కనిపిస్తాయి గాని సంస్కృతభవాలు కావని చెప్పవచ్చని శ్రీ తిరుమల రామచంద్రగారి సిద్ధాంతం[5].

ఎన్నో ఇతర భాషాపదాలు సంస్కృతలోకి ప్రవేశించాయి. డా.గుండెర్ట్ పండితుడన్నట్టు ఇతర ఆర్య భాషాపదాలను, సంప్రదాయాలను స్వీకరించకపోయి ఉంటే సంస్కృతం ఇంత విశాలమై ఉండేది కాదు.

మీన, పీలు, కుంతల, హేరంభ, పలాండు, పున్నాగ, మరీచ, వ్రీహి, అటవీ, పుత్ర, మందిర, ఖర్జు, కశిపు, పుట్ట, శంకు, బలాకా, ఆది శబ్దాలు దక్షిణ భారత

5. చూ. ప్రా. రా. క. పే. సం.104

భాషల నుండి సంస్కృతంలో చేరినట్టు 'కిట్టెల్' తన కన్నడ నిఘంటువులో సోపపత్తికంగా వివరించాడు. పుత్రశబ్దం పుట్ట శబ్దంనుండి తయారైనది, ఇక "పున్నామ్నో నరకాత్ త్రాయతే ఇతి పుత్రః" అనే వ్యుత్పత్తి సహజంగా అనిపించదు. ఏదో ఒకవిధంగా వ్యుత్పత్తిని కల్పిద్దామనే ఉద్దేశ్యంతో సంస్కృత వైయాకరణులు శబ్దాల మూలస్వరూపం గుర్తించక వాటిని గుర్తించరానంతగా తప్పుదోవ పట్టించారు. కావి + ఏఱు = కావేరు – కావేరి (ఎఱ్ఱని నీరు కలిగినది) అనే స్వరూపం స్పష్టంగా ఉండగా "కవేరస్య అపత్యం స్త్రీ కావేరీ" అని చెప్పి భాషాస్వరూపాన్నే మార్చేశారు సంస్కృత విద్వాంసులు.

అయితే దక్షిణాపథంలో ఉన్న ప్రాచీన భాషలు మరేవో కావు, అవి ఒక విధమైన ప్రాకృతాలే. వాటినే నాట్యశాస్త్రకారుడు 'దాక్షిణాత్యా' అని పేర్కొన్నాడు. ఇలా ప్రాకృతం కూడా ఇతరభాషా పదాలను తనవిగా చేసుకొనకపోలేదు. అయితే ఈ దేశ్యశబ్దాలపై ప్రాకృత వైయాకరణులు ప్రాకృతముద్ర వేయ ప్రయత్నించలేదు. అశోకుడి శాసనాలు ఆంధ్రదేశంలో దొరికిన విషయాన్నాధారం చేసుకొని కొందరు దక్షిణాపథంలో ఆ కాలంలో పాళీ భాషే వాడుకలో ఉండేదని చెప్పడం యుక్తిసంగతం కాదు. క్రీ.శ.మొదటి శతాబ్దానికి ముందున్న పాళీ శాసనాలలో తెలుగు ఊర్ల పేర్లు లభించాయి. కర్ణాటక ప్రాంతంలో లభ్యమైన ప్రాచీన దాక్షిణాత్య భాషా నిబద్ధ శాసనాలు, చీనా యాత్రికుడు హుఎన్‌త్సాంగ్ 7వ శతాబ్దం ప్రారంభంలో కళింగకి వచ్చి అక్కడి భాషలు వేరేనని తెలపడం వంటి ఎన్నో ప్రమాణాల ఆధారంగా దక్షిణాపథంలో (ఆంధ్రతో సహా) పాళీ గాని, సంస్కృతం గాని సామాన్య వ్యవహార భాషలుగా చెలామణి కాలేదనడానికి నిదర్శనం.

రోలంబ, తాలూర లాంటి శబ్దాలు దేశీశబ్దాలే. అవి సంస్కృతంలోకి ప్రవేశించాక మేదినీ వంటి సంస్కృత నిఘంటువులు వాటిపై సంస్కృత ముద్రవేశాయి. ఈ విషయాన్ని హేమచంద్రుడు తనదేశీనామమాలలో పేర్కొన్నాడు. "రోలంబ శబ్దం సంస్కృతేఽపి కేచిద్గతానుగతికతయా ప్రయుంజతే"[(6)].

చెప్పు, చెక్కు, చూచు మొదలైన తెలుగు క్రియలు చవఇ, చఅఇ, చచ్ఛఇ లేక చజ్జఇ మున్నగు రూపాలుగా మారాయి ప్రాకృతంలో. అందుకే హేమచంద్రుడు.

"దేశీ దుస్సందర్భా, ప్రాయస్సందర్భితాఽపి దుర్బోధా తత్తాం సందృభతి,

6. దేశీనామమాలా–7–2 వివృతి

విభజతి చ" అని తన గ్రంథంలో పేర్కొన్నాడు[7] ఇలా దేశీ శబ్దాలను గుర్తించక కొందరు విద్వాంసులు దుర్వ్యాఖ్యానాలు చేసిన విషయాన్ని ఆచార్య హేమచంద్రుడు పేర్కొన్నాడు. "అధునాతన దేశీకారాణాం, తద్వ్యాఖ్యాతౄణాం చ కియంతః సమ్మోహాః పరిగణ్యంతే?" అని చాలా కష్టపడ్డాడు[8]. అందుకే ఆయన తిణిస శబ్ద వ్యాఖ్యానంలో తిణిసం చ వృక్షవిశేషమాచక్షతే, అస్మాభిస్తు సారతర దేశీ దర్శహునేన తిణిసశబ్దో మధుపటలార్థో వ్యాఖ్యాతః. తత్ర యుక్తాయుక్తస్య బహ్వదృశ్వానః ప్రమాణం"[9]. అంటే "తిణిసమనే పదానికి అర్థం ఏదో చెట్టు అని కొందరు చెపుతున్నారు. కాని దేశీసారాన్ని దర్శించిన మేము తిణిస శబ్దానికి తేనెతెట్టు అని వ్యాఖ్యానం చెప్పాము, ఈ విషయంలో మరి ఏది యుక్తమైన అర్థమో విజ్ఞులే ప్రమాణం". అని అర్థం. హేమచంద్రుని వివరణ ఎంతో సముచితంగా ఉంది. తేనె అనే పదం తమిళంలో తేన్ అని కన్నడంలో జేన్ అని అయ్యింది. తిణిస అంటే తేనె అనే అర్థం.

గాథాసప్తశతిలోని ఎన్నో గాథలు ప్రాచీన తెలుగు దేశంలో రచించబడినాయంటే అతిశయోక్తికాదు. క్రీ.శ.ప్రథమ శతాబ్దిలో వెలసిన హాల సాతవాహనుడు తెలుగు దేశాన్ని పరిపాలించాడు. అందుకే అతడి రచనలో తెలుగు పదాలే కాదు, ఇక్కడి సంప్రదాయాలు కూడా వెల్లి విరిసే ఉంటాయి. గాథాసప్తశతిలో కనిపించే అత్త, తుప్ప, మఇల, మడహ, కలించిఅ, పీలుఅ, ఎక్కల, పక్కల మున్నగు పదాలు ప్రాకృతపదాలు కావని అవి తెలుగు పదాలేనని శ్రీకులబాలదేవుడు వంటి వ్యాఖ్యాతలు, హేమచంద్రుని వంటి వైయాకరణులు ప్రమాణం[10].

ప్రస్తుతం మనకు లభిస్తున్న అతి ప్రాచీనమైన తెలుగు పదాలు సాతవాహన చక్రవర్తుల ద్విభాషా నాణేలలోనివి. ఈ నాణేలకు ఒక వైపు ప్రాకృతంలోను మరో వైపు తెలుగు లోనూ చక్రవర్తుల పేర్లున్నాయి. వీటిని ప్రసిద్ధ పురాతత్త్వవేత్త డా. ఇంగువ కార్తికేయ శర్మగారు ఎపిగ్రఫికా ఇండికా అన్న గ్రంథంలోని 4వ సంపుటిలో ప్రచురించారని శ్రీ రామచంద్ర గారు తెలిపారు[11].

---

7. చూ-దేశీనామమాల-1 వ. వివృతి
8. దేశీనామమాల-1-12
9. దేశీనామమాలా-3-12
10. చూ. గా. తె. ప. పే. నం. 3
11. చూ. ప్రా. రా. క. పే. నం.99

ఈ నాణేలు పులమావి, శాతకర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణి చక్రవర్తులవి చెరి ఒకటి. మొదటిది "అరహణకు వాహిట్టీ మాకనకు తిరు పులమావికు". ఇందులోని ప్రాకృత పదభూయిష్టత్వాన్ని చూడవచ్చు. దీని అర్థం అరసుడైన వాసిష్ఠీ కుమారుడైన శ్రీ పులమావి యొక్క అని. ఇక రెండవది "అరహణకు వాహిట్టీ మాకనకు తిరుహాత కణికు" అని, ఇది కూడా ప్రాకృత పదోపేతమైనదే. ఈ రెంటిలోనూ విశేష్యమేలింగ-విభక్తి-వచనాలలో ఉంటుందో విశేషణం కూడా వాటిలోనే ఉండాలనే ప్రాచీన నియమాన్ని చూడవచ్చు. అన్నీ షష్ఠీ విభక్తి లోనే ఉన్నాయి. రెండవ దాని అర్థం "అరసుడైన వాసిష్ఠీ పుత్రుడైన శ్రీ శాతకర్ణియొక్క" అని. ఇక మూడవది "అరహణకు గోతమీ పుతకు తిరు యనహాతకణికు" ఇది కూడా ప్రాకృత పదయుక్తమైనదే. దీని అర్థం "అరసుడైన గౌతమీ పుత్ర శ్రీ యజ్ఞశాత కర్ణి యొక్క" ఈ శాసనాల లోని వాక్యాలలో ప్రాకృతపు తత్సమ, తద్భవ శబ్దాలు దర్శనమిస్తాయి. అయితే ఈ శాసనాలలో ప్రాకృతం తెలుగుభాషగా పరిణమించే క్రమిక దశ కనిపిస్తుంది. తత్సమీకరణం కూడా ఆ కాలం లోనే ప్రారంభమైనదని శ్రీ రామచంద్ర గారి అభిప్రాయం.

ప్రాకృతం కొన్ని శతాబ్దాలు తెలుగునాట శాసనభాష కనుక స్థానికమైన కొన్ని తెలుగుపదాలు కూడా ప్రాకృతంలో చేరి ఉంటాయన్నది శ్రీరామచంద్రగారి వాదన. శాతవాహన చక్రవర్తి అయిన హాలుడు సేకరించిన 700 గాథలలో (గాహాసత్తసయీ కావ్యంలో) ప్రాకృత వేశంలో ఉన్న తెలుగు పదాలు దర్శనమిస్తాయన్నది శ్రీరామచంద్రగారి సిద్ధాంతం. ఇలాంటి దాదాపు 40 దాకా శబ్దాలను తొలిసారిగా వారు 'భారతి' మాసపత్రికలో ప్రచురించారు. తరువాత ఈ దిశగా పరిశోధించి మరొకొన్ని వ్యాసాలు వ్రాశారు. ఈ వ్యాసాలన్నింటినీ కలిపి ఒక పుస్తక రూపంగా కూడా వారు ముద్రించారు. దానిపేరే "గాథాసప్తశతిలో తెలుగు పదాలు". నిజానికి 19వ శతాబ్ది ఉత్తరార్థం లోనూ, 20వ శతాబ్ది లోనూ ప్రాకృతంపై తెలుగువారికి అభిరుచి కలిగింది. బహుగ్రంథ కర్తలైన విద్వత్కవులు, విజయనగర మహారాజావారి కళాశాలలో సంస్కృత పండితులు అయిన శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులు గారు 'ప్రాకృత భాషోత్పత్తి' అనే గ్రంథాన్ని 1921లో వ్రాశారు. దాన్ని ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు ముద్రించారు. ఇంతే కాకుండా వారు ప్రవరసేనుడి 'సేతుబంధం' అనే ప్రాకృత కావ్యాన్ని తెలుగు లోనికి అనువదించారు.

ఇక డా॥ తిరుమల రామచంద్ర గారు 'గాథాసప్తశతిలో తెలుగు పదాలు' అనే పేరుతో ప్రాకృత సాహిత్యానికి సంబంధించిన వివిధ వ్యాసాల సంకలనాలెన్నో

ప్రచురించారు. వారు గాథాసప్తశతిలోని భావాలను కథలుగా అల్లి 'పల్లకి' అనే తెలుగు వార పత్రికలో అనేక వ్యాసాలు వ్రాశారు. ఇవి ఆ పత్రికలో 1985 నుండి 1986 వరకు ఒక సంవత్సరం పాటు ప్రచురితమయ్యాయి. వీటకి మంచి ఆదరణ లభించింది.

మహాయాన బౌద్ధుల బుద్ధుని ప్రామాణిక చరిత్ర 'లలితవిస్తరం' అనేగ్రంథం. ఇదెంతో ఆసక్తికరమైన గ్రంథం. దీన్ని తిరుమల రామచంద్ర గారు, శ్రీ బులుసు వేంకటరమణయ్య గారు కలిసి అనువదించి మొదట 'ఆంధ్రప్రభ' ఆదివారం అనుబంధంలోనూ, తర్వాత పుస్తకరూపం గానూ ప్రచురించారు. లలితవిస్తరం సంస్కృత ప్రాకృత భాషామయం. ఈ భాషను కొందరు విద్వాంసులు మిశ్ర సంస్కృతభాష అని అన్నారు. దీనికి వేరుగా నిఘంటువులు కూడా రచించారు పాశ్చాత్యులు. అయితే అంతవరకు యావద్భారతావనిలో లలితవిస్తరంపై సాధారణ చర్చే జరిగేది. కాని దాన్ని పూర్తిగా ఎవరూ అనువదించ సాహసించ లేదు. వీరి అనువాదమే తొలి భారతీయ భాషానువాదమై ఉండవచ్చు. ఇంతే కాదు డా॥ తిరుమల రామచంద్ర గారు క్షేమేంద్రుడు రచించిన అవధాన కల్పలతను, బృహత్కథామంజరినీ తెలుగు వచనంలో అనువదించారు. ఈ రెండు గ్రంథాలు నిజానికి శుద్ధ సంస్కృత రచనలే అయినా వీటి మూలాలు పాళీ–ప్రాకృతాలలో ఉన్నాయి కాబట్టి ఇది కూడా వారి ప్రాకృత భాషా సేవ క్రిందికే వస్తుంది.

ఇక 'మాహుకుడు' అనే కవి 'హరమేఖల' అనే ఐదు పరిచ్ఛేదాల ప్రాకృత వైద్య గ్రంథాన్ని క్రీ.శ. 920 ప్రాంతంలో రచించాడు. ఇది దేవనాగరిలో ముద్రితమైన తరువాత దాన్ని డా॥ తిరుమల రామచంద్ర గారు, ఆ కాలంనాటి ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు వేటూరి శంకరశాస్త్రి గారు కలిసి అనువదించి ప్రచురించారు.

ఈ భూమండలంలో ఒకప్పుడు ప్రాకృత భాషా ప్రాబల్యముండేది. కాని నేడు భారతీయులీవిషయాన్ని మరచారు. శ్రీ రామచంద్ర గారికి ప్రాకృతమంటే చాలా ఆదరాభిమానాలుండేవి. "ప్రాకృతం అనగానే అటు పశ్చిమోత్తరాన ఉత్తర ధ్రువ సమీపంలోని నార్వే స్వీడన్‌ల నుంచి, ఈశాన్య పూర్వపు దిక్కులో ఉన్న వ్లాదివోస్తోక్ వరకు, ఇటు దక్షిణ పశ్చిమ దిశలో యూరప్ నుంచి ఆసియా దేశాల మీదుగా ఆగ్నేయాసియా లోని ఇండోచైనా, ఇండోనేసియాల వరకు ఒకప్పుడు వ్యాపించిన గొప్ప భాష సాక్షాత్కరిస్తుంది". అని వారు వ్రాశారు[12].

12. చూ.ప్రా.రా.క.పే.సం. 84–85

ఈ భాషలో నేటి స్లావిక్ భాషల పూర్వ స్వరూపాలు మొదటి దశ కాగా, ఆగ్నేయాసియా దేశాల భాషల పూర్వ స్వరూపాలు చివరిదశ. ఇది యావత్ ప్రజలభాష. వారి నిత్య వ్యవహార భాష. ప్రజల ప్రేమభాష, ప్రజల కష్టసుఖాలభాష. ఇదే ప్రకృతుల లేదా ప్రాకృతుల లేదా ప్రజల భాష-ప్రాకృత భాష[13].

ఇక డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు తాము రచించిన "ప్రాకృతభాషా వాఙ్మయచరిత్ర" అనే గ్రంథంలో[14]. ఎంతో ప్రయాసతో సంస్కృతం నుండే ప్రాకృతాది సమస్త భాషలు జన్మించాయని నిరూపించ ప్రయత్నించారు. వైదిక ఛందస్సు కూడా సంస్కృతమే కనుక అదే అన్నింటికీ మాతృక అని వారి సిద్ధాంతం. కాని డా॥ తిరుమల రామచంద్ర గారు ఈ విషయాన్ని చాలా కాలం ముందే చర్చించారు. సంస్కృతం అపభ్రష్టమై ప్రాకృతమైనదని ప్రాచీన భారతీయ విద్వాంసులు పలువురు, ఆధునికులు కొందరు భావించడం అపసిద్ధాంతమని వారు స్పష్టంగా వ్రాశారు[15]. వీరి అభిప్రాయానుసారంగా మానవజాతి-తొలి ఛందోబద్ధ వాక్యాలు (మంత్రాలు) ఋగ్వేదంలో ప్రాకృతభాషా రూపాలు కావడం వల్ల ఋగ్వేద భాష కన్నా నాతిభిన్నము. అపరిష్కృతము అయిన భాష ఒకటి ఉండే ఉంటుందని, అదే ప్రాకృత భాష అని, లేదా తత్సమమైన భాషైనా అయి ఉండవచ్చని డా॥ తిరుమల రామచంద్ర గారి అభిమతం[16].

వైదిక భాషలో నేటి ప్రాకృత భాషా పదాలు కనిపించడం ఎవరికైనా ఆశ్చర్యాన్ని కలిగించక మానదు. ప్రాకృత ప్రత్యయాలు వైదిక భాషలో ఎలా మిగిలిపోయాయో చూస్తే ప్రాకృత భాషలకు వైదిక ఛందస్సుకు మూలమనదగిన భాష ఇంకొకటి ఉండదేమోననిపిస్తుంది. ప్రాకృత భాషలోని ఒక పదం యొక్క ఆదిభాగంలో ఒకవేళ ఋకారం ఉంటే అది సాధారణంగా లోపిస్తుంది. ఉదాహరణకు బృంద-బంద, మృగ-మగ, మిగ, మొగ. కొన్నిసార్లు ఋకారానికి ఉకారం ఆదేశమౌతుంది. ఉదా:- పృథ్వీ-పుహవి. అయితే వేదాలలో కూడా ఇలాంటి ఋలుప్త రూపాలు కనిపిస్తాయి. ఉదా:- కృత-ఖుద[17] ప్రాకృత పదాలలో సంయుక్తాక్షరాల ముందున్న

---

13. చూ-ప్రా.రా.క.పే.నం.85
14. పే. నం.1-21
15. చూ. ప్రా. రా. క. పే. నం.85
16. చూ. ప్రా. రా. క. పే. నం. 85
17. ఋగ్వేదం 1.46.4

అచ్చులు దీర్ఘాలవుతాయి. ఉదా:- దుర్లభ-దూలభ, విశ్రమ-వీశమ, స్పర్శ-పాస. వేదాలలో కూడా ఇలాంటి వైరూప్యం కనిపిస్తుంది. ఉదా:- దుర్లభ-దూలభ[18] దుర్ణాశ-దూణాశ[19] ఇలా ఎన్నో ఉదాహరణలు చూడవచ్చు.

ఈ వివరణను బట్టి ప్రాకృతం ఆరోజుల్లో వ్యాపించి ఉండేదని అదే సంస్కరింపబడి సంస్కృతమైనదని ఊహించడానికి ఆస్కారం ఉంటుంది. ప్రాకృతం భారతదేశం లోని ప్రాచీనభాష అని మనం చదివాము. కాని. డా॥ తిరుమల రామచంద్ర గారి అభిప్రాయానుసారంగా ఇది భారత దేశానికే పరిమితమైనభాష కాదు, విశ్వజనీనమైనది. విశాల ప్రాంతంలో వికసించిన, విస్తరించిన భాష. పశ్చిమాన స్లావ్ భాషలలోనూ, తక్కిన భాషలలోనూ మధ్య ఆసియాలోని భాషలలోనూ చూళికా ప్రాకృత పదాలు ఇప్పటికీ కనిపిస్తాయి. ఈ భాషలకు సంస్కృతంతో కూడా సంబంధం ఉన్నదని డా॥వి.రాఘవన్ గారు తమ పాశ్చాత్య పర్యటనానంతరం వ్రాసిన వ్యాసంలో వివరించారు. వారి అభిప్రాయానుసారంగా స్త్రీలు మాట్లాడుతున్నప్పుడు ప్రాకృతం వింటున్నట్టు ఉంటుంది. కాని డా॥ రామచంద్రగారి అభిప్రాయానుసారంగా ఆధునిక ఇరానీ, ఆఫ్ఘానీ, హిమాలయ పశ్చిమాగ్ర ప్రాంత భాషలు వింటున్నా, జావా, సుమాత్రాది భాషలు వింటున్నా అవి ప్రాకృతాలు గానే తోస్తాయి.

అయితే సంస్కృతం ముందా? లేక ప్రాకృతం ముందా? అన్న విషయం ఎంతో మందిని వేధించింది. ఆయా భాషా సాహిత్యాలను ఏదో ఒక ధర్మానికి ముడిపెట్టి ప్రాకృతం ముందని, కాదు సంస్కృతం ముందని చాలా మంది వాదించారు, వాదిస్తున్నారు కూడా. కాని డా॥ శ్రీ రామచంద్రగారు ఈ విషయాన్ని సులభంగా పరిష్కరించారు. సంస్కృత-ప్రాకృతాలకు ఏ విధంగానూ జన్యజనక భావ సంబంధం లేదు, ఈ రెండూ ఒక పూవు, రెండు రేకులు, లేక ఒక రేకు రెండు పార్శ్వాలు, ఒక కత్తి రెండు పాదరలు అని శ్రీ రామచంద్ర గారు స్పష్టంగా తెలిపారు[20]. వైదిక ఛందస్సు సుందరము, ప్రయత్న సాధ్యమూ కావడంవల్ల అది ఉన్నత మనుజుల భాష. ఇక ప్రాకృతం జనసాధారణ వ్యవహారభాష. ఇది సంస్కృతానికి కొంత భిన్నంగా ఉన్నా దానికి చాలా సన్నిహితంగా ఉండేభాష. ఇలా శిష్టుల భాష సంస్కృతమే. కాని

---

18. ఋగ్వేదం 4.9.8
19. శుక్లయజుర్వేద ప్రాతిశాఖ్య 3.45
20. చూ. ప్రా. రా. క. పే. సం.87

సామాన్య భాష అంటే General Language ప్రాకృతమయ్యింది. ఆచార్య హేమచంద్రుడు తన కావ్యానుశాసనంలో

**శ్లో॥ బాల-స్త్రీ-మంద-మూర్ఖాణాం నృణాం చారిత్రకాంక్షిభిః**
**అనుగ్రహార్థం తత్త్వజ్ఞైః సిద్ధాంతః ప్రాకృతే కృతః**

అనే ఒక ప్రాచీన శ్లోకాన్ని ఉట్టంకించాడు. దీని అర్థం బాల,స్త్రీ, మంద, మూర్ఖులు కూడా సచ్ఛీలురు కావాలనే కోరికతో తత్త్వజ్ఞులైన పెద్దలు తమ సిద్ధాంతాలను ప్రాకృతభాషలో చెప్పారు. ఇది ఎంతో విశిష్టమైన భాష.

మన రాష్ట్రంలో ప్రాకృతం బలపడాలని శ్రీ తిరుమల రామచంద్ర గారు కోరుకునే వారు. ప్రాకృత అకాడమీ అనే పేరు గల ఒక విద్వత్ పరిశోధక సంస్థను స్థాపించి ప్రాకృతంలో కృషి చేసే వారికి సంవత్సరానికొక లక్ష రూపాయల అవార్డు ఇవ్వాలని వారు కాంక్షించే వారు. నేను తెలుగు విశ్వవిద్యాలయ ఛాత్రవృత్తితో పాళీ భాషాధ్యయనానికై కాశీకి వెళ్లిన సమయంలో వారెంతగానో ప్రోత్సాహపరిచేవారు. మీవంటి పాళీవిద్వాంసులు త్రిపిటకాలను తెలుగు భాషలోనికి అనువదించాలని చాలా సార్లు అనేవారు. నేను సిగ్గుతో కుంచించుకుపోయేవాణ్ణి. ఆ వయస్సులో సామర్థ్యమున్నా ఎందుకో ఆ శుభకార్యాన్ని చేయసాహసించలేదు నేను. అయితే ఒకసారి వారితో 'ఒకవేళ నేను అనువదిస్తే ఎవరు ముద్రిస్తారు సార్?' అని అడిగాను. అందుకు వారు - మీరు మొదట అనువదించండి, అవి అపూర్వానువాదాలు కనుక ఎవరో ఒకరు వాటిని ముద్రిస్తారు" అని నాకు ఉత్తరం వ్రాశారు.

'తెలుగు ప్రాకృతాల సంబంధం' అనే వ్యాసాన్ని వ్రాసి, దాన్ని డా॥ తిరుమల రామచంద్ర గారు 1990లో అఖిల భారత తెలుగు రచయితల సభలో బెంగుళూరులో చదివారు. ఈ వ్యాసంలో వారు సుమారు 500 తెలుగు భాషతో సంబంధం ఉన్న ప్రాకృత పదాలను ఏరి చూపారు. హాలుని గాథాసప్తశతిలో, వజ్జాలగ్గం లోనూ ఉన్న తెలుగు పదాలనిందులో చూపారు వారు.

తెలుగు భాషపైనే కాదు. సాహిత్యంపై కూడా పాళీ-ప్రాకృతాల ప్రభావం ఉండేదని శ్రీ తిరుమల రామచంద్రగారి అభిప్రాయం. నిజానికి శ్రీ తిరుమల రామచంద్ర గారికి 18, 19 ఏండ్ల ప్రాయం లోనే ప్రాకృతం పట్ల ఆసక్తి కలిగింది. వారు 1930వ సంవత్సరంలోనే 'ప్రాకృతాపభ్రంశ వాఙ్మయం' అనే ఒక వ్యాసం వ్రాశారు. వారికంటే ముందు ఈ దిశగా ప్రయత్నించిన వారి పేర్లు కూడా వారు సవినయంగా పేర్కొన్నారు.

శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి గారు, సన్నిధానం సూర్యనారాయణగారు, గిడుగు రామ్మూర్తి పంతులుగారు ప్రాకృత విషయంలో కొంత పరిశ్రమించినా 20వ శతాబ్ది రచయితలలో మాత్రం ప్రాకృత పరిశోధనాగ్రేసరి శ్రీ రామచంద్రగారే, మరొకరు లేరు.

1935 లోనే వీరు గాథాసప్తశతిని అధ్యయనం చేశారు. అంటే సుమారు 60 సంవత్సరాలు ప్రాకృత సాహిత్యమథనం చేశారు. గాథాసప్తశతిని కాళిదాస మహాకవి వంటి వారు అనుకరించారని చెప్పారు. అందులోని రమ్య గ్రామీణ జీవన సౌందర్యాన్ని 150 గాథల ద్వారా చక్కగా అభివర్ణించారు వారు.

గాథాసప్తశతిలో ఎన్నో దేశీపదాలు ప్రయోగించబడినాయి ఈ గాథల రచన ఖచ్చితంగా తొలినాటి తెలుగుదేశం లోనే జరిగి ఉంటుంది. అత్త, తుప్ప, మడహ, కిలించిఅ ఇత్యాది పదాలు దేశ్యాలే. వీటిని పాదలిప్తాచార్యుడు మొదలు హేమచంద్రుని వరకు గల ప్రాకృత వైయాకరణులు పేర్కొన్నారు. ఉచ్చారణ సాదృశ్యాన్ని బట్టి అర్థసామ్యాన్ననుసరించి వీనిలోని తెలుగు శబ్దాలను శ్రీ తిరుమల రామచంద్రగారు వింగడించడానికి ప్రయత్నించారు.

శ్వశురః అంటే పిల్లనిచ్చిన మామగారు. ఆ శ్వశురుని భార్య శ్వశ్రూః. దీని సమాన పదం ప్రాకృతంలో సాసూ అని కావాలి. ఈ పదం హిందీలో కనిపిస్తుంది. కాని హాలుని గాథాసప్తశతిలో శ్వశ్రూ శబ్దానికి 'అత్తా' శబ్దాన్ని ప్రయోగించారు నాటి గాథా రచయితలు. ఈ అత్తాశబ్దమే గాథాసప్తశతిలో 12సార్లు ప్రయోగించబడింది ఇది తెలుగు పదము.

1. అత్తా తహ రమణిజ్జం (1-8)
2. గ్రామణి ఘరమ్మి అత్తా (5-69)
3. మహ మహిఇ మల అదాఓ, అత్తా వారేఇ (5-97)
4. అత్తా ణ వాఇ మల అగంధవహో (6-42)
5. అత్తా మత్తా పఈవి అణ్ణత్థో (6-49)
6. పంజర సారిం అత్తా (6-52)
7. చింతిజ్జంతో మణవల్లహో అత్తా (7-57)
8. వాహేణ రుఆవిఆ అత్తా (7-63)
9. భణిఏ భణామి అత్తా (7-74)
10. ఏత్థ ణిమజ్జఇ అత్తా (7-67)

వీటిలో చివరిపదం 7వశతకంలోని 67వ గాథలో ప్రయోగించబడింది. ఇదెంతో రమణీయార్థాన్ని ప్రతిపాదిస్తుంది.

**ఏత్థ ణిమజ్జఇ అత్తా ఏత్థ అహం ఏత్థ పరియణో సఅలో**
**పంథిఅ రత్తీ అంధఅ మా మహ సఅణే ణిమజ్జిహిసి.**

దీనికి శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి యోగ్యరసోపేతానువాదాన్ని తొలిసారిగా శ్రీరామచంద్రగారు తమ గ్రంథంలో పొందుపరిచారు.

**ఇచట నేబరుందు నిచ్చట నత్తగా**
**రిచట పరిజనంబు; లెఱిగికొనుము**
**రాత్రి నీకు గానరాదు నాశయ్యపై**
**తప్పి పడెదవేమొ! దారికాడ**

శర్మగారి అనువాదం మొదటి ముద్రణ ఇదే. ఈ గాథలో 'అత్తా ఏత్థ ణిమజ్జఇ' అనగా ఇక్కడ (మా) అత్త పడుకుంటుంది. అని అర్థం. అయితే ఇక్కడ శ్వశ్రూ శబ్దపు అపభ్రంశ రూపం 'సాసూ' అనే శబ్దానికి మారుగా కవి అత్త అనే దేశ్యపదాన్ని ప్రయోగించాడు.

ఇలాగే తుప్ప శబ్దానికర్థం నెయ్యి. ఈ పదం ఈక్రింది గాథలో ఎలా ప్రయోగించబడిందో చూడండి.

**తుప్పాణనా కిణో చిట్ఠసిత్తి పడిపుచ్ఛిఆఏ బహుఆఏ,**
**విఉణావేఢ్ఠిఅ జహణత్థలాఇ లజ్జోణఅం హసిఅం.**

దీనికి సంస్కృతచ్ఛాయ ఈ క్రింది విధంగా వుంది.

**శ్లో॥ ఘృతలిప్తాననా కిమితి తిష్ఠసీతి పరిపృష్టయా వధ్వా,**
**ద్విగుణితావేష్టిత జఘనస్థలయా లజ్జావనతం హసితం.**

ముఖానికి నెయ్యిపూసుకొని ఎందుకు నిలబడ్డావు? అని అడుగగా కోడలు సిగ్గుపడి చీరను మరొక మారు ఒంటిచుట్టూ చుట్టుకొని నవ్వింది. ఇక్కడ శ్రీరామచంద్ర గారి వ్యాఖ్యానం ఎప్పటిలాగే ఆసక్తిదాయకంగా ఉంటుంది. "ఆ కాలంలో రజస్వలలు గుర్తుగా మొగానికి వన్నె కలిపిన నేయి పూసుకొనడం దేశాచారమని 1-22వ గాథా వ్యాఖ్యానంలో వివరించబడింది. ఈ ఆచారం నేటికీ కర్ణాటక ప్రాంతంలోనూ, దానినంటుకొనున్న రాయలసీమ ప్రాంతంలోనూ లాంఛన ప్రాయంగా వున్నది. ప్రథమ రజస్వలకు 16నాళ్ళ పండుగ వరకు నూనె-పసుపుగాని, నేయి-పసుపుగాని రాయడం

కలదు. ప్రథమ రజస్వల ఆరోగ్యాన్ని రక్షించడం కోసం రజదోషం కలుగకుండా జరిపే వైద్యశాస్త్ర ప్రక్రియ ఇది. రజోగంధం నుంచి విషక్రిములు ఆకర్షింపబడకుండా తొలగిపోవడం కూడా ఈ పసుపు నేయిపూత ఉద్దేశమట. 2000 ఏండ్ల నాటి ఈ ఆచారం లాంఛన ప్రాయంగా మాత్రమే నేడు నిలిచింది.

ఈ గాథలో 'తుప్పాణనా' పదానికి ఘృతలిప్తాననా అని, రెండవ గాథ లోని 'వణ్ణఘిఅతుప్ప' శబ్దానికి "హరిత్రాది వర్ణ ప్రధానం ఘృతం" అని వ్యాఖ్యానం.

ఈ గాథలలో ప్రయోగించిన తుప్ప శబ్దం నేయికి ప్రాచీన తెలుగు పర్యాయపదం, కాని నన్నయ కాలానికే వ్యవహారచ్యుతమయింది. తుప్ప శబ్దం తుఱువు అంటే ఆవు శబ్దం నుండి వచ్చింది. తుఱువు-తుఱప్పు-త్రుప్పు-తుప్ప అయి ఉండొచ్చని శ్రీరామచంద్ర గారి అభిప్రాయం. తుప్ప అంటే ఆవునేయి అని అర్థం. ఈ తుఱవుశబ్దాన్ని శ్రీరామచంద్ర గారు ఊహించి చెప్పినది కాదు. ఇది రాష్ట్రకూట ధ్రువరాజు శాసనంలో క్రీ.శ. 790 లో ప్రయోగించబడంది. తమిళంలో ఆలమందకు తొఱువు అని పేరు. ధ్రువరాజు శాసనంలోని తుఱువు శబ్దానికి, తఱువుకూ మూలం తొఱు అయి ఉంటుందని ఎపిగ్రాఫికా ఇండికాలో చర్చించబడింది[21]. తొఱ్ఱుపట్టు-గోష్ఠము, "ఘనబుజుండు నరుడు దనతొఱ్ఱు పట్టుల విశ్రమించి"[22]. ఋష్యశృంగు దొఱ్ఱు పట్ల విశ్రమించుచు[23]. తొఱ్ఱువులు అంటే ఆవులు. భాగవతంలో ఈ శబ్దం ప్రయుక్తమైనది. "తొఱ్ఱులు గాచిన నందుని"[24]. త్రువ్వు అంటే ఎద్దు, ఆవు అని కూడా అర్థాలుండేవి. తృవ్వట బాబా, తలపై పువ్వట". తువ్వాయి అంటే దూడ. ఇలా త్రువ్వు, తుఱువులకు సంబంధించిన వస్తువులన్నీ 'లాక్షణికంగా' 'తుఱ్ఱువు' అయి ఉ ంటాయి. తుఱువే తుప్పగామారి ఉంటుంది. అయితే హేమచంద్రుడు "తుప్పో స్నిగ్ధః" అని తన దేశీనామమాలలో పేర్కొన్నాడు[25].[26].

ఇలా శ్రీరామచంద్రగారు ఒక్కో శబ్దాన్ని చాలా విస్తృతంగా చర్చించి దాని నిగ్గుదీయ ప్రయత్నించారు.

---

21. ఎపిగ్రాఫికా ఇండికా-సంపుటం-3
22. భారతంలో, ఆదిపర్వం-8.210
23. భారతం-అరణ్యపర్వం-3-118
24. భాగవతం, పూర్వ 10-633
25. 5-22
26. గాథాసప్తశతిలో తెలుగు పదాలు-పే.నం. 10

ఇలాగే పొట్ట శబ్దప్రయోగం కూడా ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది. గాథాసప్తశతి లోని మూడవ శతకంలో ఈ శబ్ద ప్రయోగం జరిగింది.

**పోట్టం భరంతి సఉణా పమాఉఅ అప్పణో అణువ్విగ్గా,**
**విహలుద్ధరణ-సహావా హువంతి జఇకేవి సప్పురిసా.**

ఈ గాథలో 'పోట్టం భరంతి' అంటే పొట్ట పోసుకుంటాయి అని అర్థం. ఈ గాథకి సంస్కృతచ్ఛాయ ఇలా ఉంది. **శ్లో॥ ఉదరం భరంతి శకునా అపి హే మాతరః ఆత్మన్యోనుద్విగ్నాః** విహ్వలోద్ధరణ స్వభావా భవంతి యది కేంపి సత్పురుషాః

పక్షులు కూడా ఏదో ఒక విధంగా పొట్టపోసుకుంటాయి. దుఃఖాల నుంచి దీనులను గట్టెక్కించే స్వభావం గల సత్పురుషులు కొందరే సుమా! అని ఈ గాథ అర్థం. పొట్టని ఉదరం, అని అనువాదం చెయ్యవచ్చు. అది ఛాయ కాలేదు. ఎందుకంటే 'పొట్ట'కి సమానమైన శబ్దం సంస్కృతంలో లేదు, ఉంటే అనువాద కర్త దాన్నే ప్రయోగించే వాడు. కాగా తెలుగులో ఈ శబ్దం (పొట్టశబ్దం) ఇప్పటికీ జీవిస్తున్నది. ఈ శబ్దమెంత ప్రాచీనమైనదో అంతే శక్తివంతమైనది కూడా. ఈ శబ్దం 'గాథాసప్తశతి'లో మరో రెండు చోట్ల కూడా ప్రయుక్తమైనది.

సంస్కృతంలో హ్రస్వ ఒ కారం లేదు. ఓకారం ఎల్లప్పుడూ దీర్ఘమే. అందుకే పొట్ట శబ్దమే గ్రహించి దాని ఆ భాషానుగుణంగా 'పోట్ట' అని ప్రయోగించాడు కవి. శ్రీరామచంద్ర గారి వివరణ తర్వాత పోట్టం పొట్ట కాదు, పోట్టం అంటే పృష్ఠం అని వ్యాఖ్యానించ సాహసించ లేదు ఏ విద్వాంసుడు కూడా. ఇలా విశ్లేశిస్తూ పోతే ఈ వ్యాసం ఒక చిన్న గ్రంథమే అవుతుంది. అయితే 'గాథాసప్తశతి'లో అనేకమైన తెలుగు పదాలు కనిపిస్తాయి. కాని వీటిని వివరించి, విశ్లేశించి పలువురుకి చెప్పేవాళ్ళెవరు? భాషాశాస్త్రాధ్యయనంలో సూక్ష్మేక్షికగల ఏ కొద్దిమందో ఇలాంటి కార్యాన్ని చేపట్టగలరు. ఇలాంటివారిలో అగ్రగణ్యులు శ్రీ తిరుమల రామచంద్ర గారు.

అవ్వో! అనేపదం ప్రాకృతంలో పలుచోట్ల ప్రయోగించబడింది. ఈ పదం తెలుగు భాషలో కూడా కొంత మారి దర్శనమిస్తుంది. దుఃఖ-ఆశ్చర్యాదులను వ్యక్తపరచడానికి తెలుగువారు అవ్వ! లేదా అవ్వో!, అమ్మో! అనే శబ్దాలు ప్రయోగిస్తారు. అమ్మ శబ్దానికి అవ్వ శబ్దం ప్రాచీనరూపం. అవ్వో దుక్కర ఆరఅ! (గాథాసప్తశతి 3.73) దీని సంస్కృతానువాదం "అవ్వో దుష్కర కారక" అని అవుతుంది. దీనికి రామచంద్ర గారు చేసిన అనువాదం. "అమ్మో ఎంత సాహసివి?" ఇక్కడ తెలుగులో వలెనే అవ్వోశబ్దం సంభ్రమాశ్చర్యాలను సూచిస్తుంది ప్రాకృతంలో.

ఇక "అవ్వో అణుణఅనుఖిసంఖరీఅ! అంటే "అమ్మో ప్రియునితో అనునయింపజేసుకొందామనే కాంక్షతో ఎంతపనిచేసింది!" ఇక్కడ 'అవ్వో' అంటే కష్టం. ఇంకా చాలా అర్థాలతో ఈ అవ్వోశబ్దం ప్రయోగించబడింది ప్రాకృతంలో. ఆశ్చర్యార్థంలో మరో గాథలో ఈ అవ్వో శబ్దం ఎలా ప్రయోగించబడిందో చూడండి

గాథ:– హత్థీహత్థిం అహమమిఆఇ వాసాగమమ్మి అవ్వో! కింది రహస్యం ఛణ్ణంపి ణహంగణం గలి (గాథాసప్తశతి 6.80)

ఈ గాథకి శ్రీ రామచంద్ర గారి యోగ్యానువాదం ఇది "వర్షాకాలం రాగానే మేఘాలు నేను ముందుంటే నేను ముందుంటూ ఆకాశాన్ని కప్పాయి కదా! ఇదేమిటి రహస్యం! అమ్మో! ఇంకా కారుతూనే ఉంది! కప్పితే కారడమేమిటి?" తెలుగులోని అమ్మ శబ్దానికి ప్రాచీనరూపం అవ్వశబ్దం. మహాభారతాల్లో ఈ శబ్ద ప్రయోగాన్ని దర్శించవచ్చు. ప్రస్తుతమీశబ్దం కర్ణాటక ప్రాంతంలో తెలంగాణ ప్రాంతంలోనూ వాడుకలో ఉన్నది. అందుకే దేశీనామమాలా గ్రంథంలో ఇది స్థానం సంపాదించింది. (దేశీనామమాలా –1–5)

శ్రీ తిరుమల రామచంద్ర గారి వంటి నిస్వార్థ దేశభక్తి పరాయణుడు, నిరాడంబరుడు విద్వత్తల్లజుడు నేడు లేరనే విషయం జ్ఞప్తికి వస్తే మనస్సు దహించుకు పోతుంది. "బోద్ధారో మత్సరగ్రస్తాః" అని భర్తృహరి కవి చెప్పినట్లు నేడు విద్వాంసులకేమీ కొదవలేదుకాని, బాల, స్త్రీ, మంద, మూర్ఖులను సైతం ప్రోత్సాహపరిచే అటువంటి నిరాడంబర వ్యక్తి మళ్ళీ మనకు లభిస్తారా? ప్రజలలో కలిసిపోయి ప్రజల భాషైన ప్రాకృతాన్ని ఆదరించి, అధ్యయనం చేసే విద్వాంసులేరి? తెలుగు భాషకు ప్రాచీనత్వాన్ని కట్టబెట్టి, ప్రాకృతారణ్యంలో పరిభ్రమించే రామచంద్ర గారి వంటి విద్వత్శార్దూలాలు నేడు కానరారు. నిజంగా ఇది మన దురదృష్టం. "దూరస్థోపి సమీపస్థః యో యస్య హృదయే స్థితః" అని ఒకానొక సంస్కృతకవి అన్నట్లు శ్రీరామచంద్ర గారు మనందరి హృదయాలలో ఇప్పటికీ జీవిస్తున్నారు. వారి స్మృతులే మనకు ప్రేరణ. ప్రాకృతానికై జీవితం ధారపోసిన శ్రీరామచంద్ర గారు నిజంగా

ఇతి శమ్

సంకేతపద సూచిక:

ప్రా. రా. క. =ప్రాకృత వాఙ్మయంలో రామకథ

గా. తె. ప=గాథా సప్తశతిలో తెలుగు పదాలు

--------

# లిపి : పుట్టుపూర్వోత్తరాలు, నుడి : నానుడి పర్యాలోకనం

- ఎం. నారాయణ శర్మ

ఒక జాతి భాషా, సాంస్కృతిక వైభవాలు ఒక ఉదాత్త దిశలో పరిశీలింపబడి, పరిష్కరింపబడి, పరిశోధింపబడిన ఒక నూరు సంవత్సరాలు ఈ నేల వైభవానికి ఒక గొప్ప ప్రాకారాన్ని నిర్మించాయి. ఆ ప్రాకార నిర్మాతల్లో వేటూరి ప్రభాకర శాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మ మొదలైన వారినుండి అనేక మంది కనిపిస్తారు. అలాంటివారిలో ఒక మేలురత్నం డా॥ తిరుమల రామచంద్ర గారు.

ప్రధానంగా ఆయన భాష, లిపి, సాహిత్యాంశాలపై వెలువరించిన అనేక అభిప్రాయాలు, గ్రంథాలు భవిష్యత్ తరాలకు మార్గదర్శకాలయ్యాయి. "మన లిపి - పుట్టుపూర్వోత్తరాలు" తెలుగులో ఇప్పటికీ లిపి పాదుర్భావ వికాసాలను గూర్చి సమగ్రంగా చర్చించిన గ్రంథం. లిపిగురించి డా॥ పి.వి. శాస్త్రి, డా॥ఎన్.ఎస్. రామచంద్ర మూర్తి రచించిన మరో కొత్త పుస్తకం లభిస్తున్నా, డా॥అమ్మంగి వేణుగోపాల్ దానికి అందించిన తెలుగు అనువాదం కూడా అందుబాటులో ఉన్నా రామచంద్ర గారి పుస్తకమే తెలుగు లిపి మూలాలను వెతకడానికి ప్రాథమికంగా కనిపించే అత్యంత ప్రామాణిక గ్రంథంగా కనిపిస్తుంది.

భాషా సంబంధంగా తెలుగు లిపి నుంచి పదం, పదబంధం వైపు మళ్ళిన రామచంద్రగారి మేధ ఈ జాతికి అనుగ్రహించిన మరో రెండు అనర్ఘ రత్నాలు 'నుడి-నానుడి', 'గాథాసప్తశతిలో తెలుగు పదాలు'. ఒక పుస్తకం గాథాసప్తశతిలో ఉన్న తెలుగు పదాల ఉనికిని వివరిస్తే మరోపుస్తకం తెలుగు పదాల ఉత్పత్తి వికాసాలను, వాటి మాతృకలను పట్టుకునే ప్రయత్నం చేసింది. 'నుడి - నానుడి'లో సుమారు 58 పదాలు, జంటలకు వ్యుత్పత్తులను అన్వేషించే ప్రయత్నం కనిపిస్తుంది.

ఈ విశ్లేషణ నిండా రామచంద్ర గారు ఇతర ద్రవిడ భాషలతోపాటు సంస్కృత, ప్రాకృత విజ్ఞానాన్ని మేళవించినట్టు కనిపిస్తుంది. కాని, ప్రధానంగా ద్రవిడ జాతుల నుంచి, అందులోనూ తమిళ, కన్నడ మాతృకలనుంచే ఎక్కువగా చర్చించడం కనిపిస్తుంది. నార్ల వెంకటేశ్వర రావు గారి ప్రేరణతో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో సుమారు రెండేళ్ళపాటు జరిగిన చర్చా ఫలితం ఈ పుస్తకం. నిజానికి రామచంద్రగారి మాటల ప్రకారం ఇది ఆ పత్రికలో వచ్చిన కొన్నింటి సంకలనం మాత్రమే. దీనిని ఆయన "పద వ్యుత్పత్తి జిజ్ఞాసోద్యమం" అన్నారు. నిజానికి రామచంద్రగారి మిగతా శ్రమ కూడా పుస్తకంగా రావలసింది. 1963లో మొదటి ముద్రణగా వచ్చిన ఈ పుస్తకం 1995 నాటికి నాలుగు ముద్రణలు పొందింది.

తెలుగు విషయంలో ప్రధానంగా పద ప్రత్యయ సంబంధంగా సంస్కృత ప్రభావాన్ని గూర్చిన చర్చ ఎక్కువగా కనిపిస్తుంది. మన ప్రాచీన నిఘంటువుల చర్చ ఈ క్రమంలోనే ముగిసింది. దానికి కారణం సంస్కృతంలో పద, పదార్థ వ్యుత్పత్తి చర్చ అధికంగా సాగటమే. ఆ స్థాయిలో ఏ ఇతర భాషలోనూ సాగలేదనడం పొరపాటు కాదు.

ఆధునిక భాషావేత్తలు ఇతర ద్రావిడ కుటుంబాల్లో సరూపాలను తెలుపడానికే పరిమితమవడం వల్ల పద, పదార్థాలని తులనాత్మకంగా పరిశీలించే అవకాశం కలుగలేదు. తెలుగులో సాహిత్య సంబంధంగా తత్సమీకరణలో సంస్కృత ప్రభావాన్ని కాదనలేం గాని, సాధారణ వ్యవహారాన్ని కూడా సంస్కృత మాధ్యమంలో చూడడం సరికాదన్నది రామచంద్ర గారి అభిప్రాయం. చాలాచోట్ల ఆయన సంస్కృత పండితులని తిరస్కరించినట్టు కనిపిస్తుంది కాని, ఈ పని "వాద బలం కోసం విసిరినవే కాని అవజ్ఞత" కాదని ఆయనగా చెప్పటం గమనించదగిన విషయం.

ఈ వివేచన నిండా గమనించాల్సిన అంశాలు కొన్ని ఉన్నాయి.

1. ప్రధానంగా ద్రవిడ జాతుల మూలాల నుండే పద పదార్థాల వ్యుత్పత్తిని పట్టుకునే ప్రయత్నం చేయడం.
2. ఇంకా సూక్ష్మంగా చెప్పుకుంటే ద్రవిడ జాతులలో కూడా తమిళ, కన్నడ మాతృకలకు దగ్గరిదాన్నే పోల్చడం.
3. సంస్కృతంలో సామీప్యాలున్నా దాన్ని చరిత్ర దృష్టితో పరిశీలించడం. ద్రవిడ, సంస్కృత మూలాల్లో ఏది దేనికి మూలమనే వివేచన నిజానికి ఈ చారిత్రక దృష్టితో అర్థవివేచన పూర్తి శాస్త్రీయ వివేచనలోనే ఒక కొత్త మార్గం.

4. రూపాంతరాలు ఏర్పడడానికి ఉచ్చారణ, లక్ష్యాలు ప్రధానం. ఈ ఉచ్చారణా వైరుధ్యాలు భిన్న వర్గాల వలన ఏర్పడతాయి. ఈ వివేచనలో ఒక మూలభాషలోని పదానికి అనేక రూపాంతరాలని గూర్చి వివేచించడం కనిపిస్తుంది.

5. ప్రధానంగా సామాజిక, చారిత్రక నియతిని పదానికి అన్వయించి పరిశీలించే ప్రయత్నం ఇందులో ఉంది.

6. ప్రయోగ పరిశీలన ద్వారా ఆద్యుచ్చారణను ఉపయోగించి ఆ పదాల అర్థాలను రూపాంతరాలను వివేచించినట్టు ముందుమాటలో చెప్పారు.

ఈ వివేచనలో ఆయన ఎన్నుకున్న పదాలు కూడా సాధారణ వ్యవహారంలోనివి. వీటికి సాహిత్యాంశ ఉందని అనిపించదు. కొన్ని జంటపదాలైతే మరికొన్ని నానుడులు. నిజానికి ఈ విశ్లేషణ ద్వారా ఆయన స్వప్నించిన 'పద వ్యుత్పత్తి జిజ్ఞాసోద్యమానికి' ఆయన మార్గాలేర్పరిచారు. దురదృష్టవశాత్తు ఆయన తర్వాత ఇలాంటి విశ్లేషణలు ఎక్కువగా కనిపించవు. చాలాకాలం క్రితం చే.రా. మాష్టారు, బూదరాజు రాధాకృష్ణ మొదలైనవారు కొంత చర్చించినట్టు కనిపిస్తుంది కాని అది సంపూర్ణంగా రామచంద్ర గారు సూచించిన మార్గంలో జరిగిందని చెప్పలేం.

రామచంద్ర గారు ప్రధానంగా లోకవ్యవహారాన్ని ఊనిక చేసుకొని అర్థవశాత్తు ఏర్పడే రూపం మీద శోధించారు. లిఖితముఖంగా ఉండే పదాలకి నిర్ణీత రూపం ఉంటుంది. పండిత వ్యవహారం వల్ల దీనికి ఒక సిద్ధరూపం (Proved form) ఏర్పడుతుంది. కాని అది లౌకిక వ్యవహారంలో పడ్డప్పుడు మౌఖికంగా (Oral tradition) భిన్న రూపాలు పొందుతుంది. అయితే ఇవి అధిక శాతం మూలసంప్రదాయంలోని ప్రధాన రూపానికి దగ్గరగానే జరుగుతాయి.

తెలుగు పదాల ఉనికి ఎక్కువగా ద్రవిడజాతుల నుంచే ననే నమ్మకం రామచంద్ర గారిలో కనిపిస్తుంది. అనేక పదాలను తమిళ, కన్నడ మాతృకలను విశ్లేషిస్తూ ద్రవిడ భాషలన్నింటికి కలిసి ఒక సమూహ పదాన్ని రామచంద్రగారు ఏర్పరిచారు. దానిని దాక్షిణాత్య భాషలు (Southern Languages) అని వ్యవహరించారు. ఈ దాక్షిణాత్య భాషల్లో ఆయా భాషలననుసరించి ఉన్నప్పటికి పదాల్లో సారూప్యతని గుర్తించారు. ఈ పదాలను చారిత్రకంగా సంస్కృతంలో మొదటిదా? దాక్షిణాత్య భాషల్లో మొదటిదా అనే చర్చను చేశారు.

నీరు–అనే పదం సంస్కృతంలోంచి (నీరం – నీయతే అనేన) చేరిందని పండితుల వాదం. కాని ఇది దాక్షిణాత్య భాషల నుంచే సంస్కృతంలోకి చేరిందని నీర శబ్దం వేదంలో లేదని 'నీయతే' తీసుకువెళ్ళడం నాగరికత అభివృద్ధిలో వచ్చిందని, అందువల్ల ఇది సంస్కృతం నాటి ఆదిమకాలానికి సంబంధించినది కాదని అన్నారు. (పే. 7)

ఈ వివేచనలో శబ్దగతంగా, అర్థగతంగా శోధించి నిర్ణయానికి రాకుండా చారిత్రకంగా పరిశీలించడం కనిపిస్తుంది. వీటికి సమాంతరంగా దాక్షిణాత్య భాషల్లో ఉపయోగాన్ని గూర్చి తులనాత్మకంగా చర్చించి పుట్టుపూర్వోత్తరాలని విశదం చేస్తారు. తమిళం నుండి నీర్ – శబ్దానికి నీళ్ళు, సముద్రం, రసం, పన్నీరు, మూత్రం, ముత్యాలు, రత్నాల్లో కనిపించే నిగనిగ, తళుకు, గుణం, పరిస్థితి అనే అర్థాలున్నాయి. కన్నడ, తుళు, మలయాళ భాషల్లో నీరు జలవాచకమే. (పే. 7)

ఈ క్రమంలో అర్థవశాత్తు భాషా శాస్త్రంలో కనిపించే అర్థక్షేత్రం (Semetic Feild) పరిధిలోని పదాలన్నింటినీ పరిశీలిస్తారు. కిట్టెల్ నిగనిగలాడేది గనుక 'నీర్' అనడానికి వీళ్ళేదన్నారని చెప్పి వ్యవహారంలో ఉన్న పదాలను బట్టి అన్వేషణ చేస్తారు. ఈ క్రమంలో వెల్లువ అనే పదం కూడా నిగనిగను వివేచించడానికి ఒక సాధనంగా చెప్పారు. దాన్నుంచి వెల్లువ > వేణి > వెణ్ణా > కృష్ణవేణి > పెన్నా > పెన్గంగా దాకా రూపాలను వెతుకుతారు. అవకాశం ఉన్నమేరకు పదవైశాల్యం దాని అర్థ, శబ్ద వైశాల్యాలు ఎంతమేరకు విస్తరించాయో రామచంద్రగారి అన్వేషణ అంతదూరం వెళ్ళి వచ్చింది. కొన్నిసార్లు ఇండో–యూరోపియన్ భాషలదాకా, లాటిన్ భాషదాకా కూడా వెళ్ళటం కనిపిస్తుంది. యూరోపియన్ భాషలు కొన్నింటిలో జెన్, డెన్ దక్షిణ దిగ్వాచకాలుగా ఉండటం వల్ల ద్రవిడ భాషలలోని తెన్‌కు, జెన్, డెన్ లకు మూలపదం మరోటి కావచ్చునని బహుభాషావేత్తలు అంటున్నారు. (పే. 15)

పై వాక్యాన్ని శివలెంక రాధాకృష్ణ గారిదిగా చెప్పారు. అనేకచోట్ల సంభాషణలు, చర్చల ద్వారా తేల్చుకున్న అంశాన్ని చెప్పటం కనిపిస్తుంది. 'పస్తు' అనే పదాన్ని విశ్లేషించుకుంటూ 'పసి' అనేదాన్ని గూర్చి సుమేరియన్ భాషలలో ఆహారం ఆహార వాంఛలనే అనే అర్థాలున్నాయని చెప్పి ఆ పదాన్నించి పసిగట్టడం, దాన్నించి పశు వు, దాన్నించి భూతేశుడుదాకా వెళ్ళి ఈ పదానికి మూలాలు సుమేరియన్ నాగరికత నుంచి వెతుకుతారు.

ఈ నిజనిర్ధారణలో శైలి కూడా గమనించాల్సిన అవసరం ఉంది. కొన్నిసార్లు విఫలమైన వ్యాఖ్యలాగా, కొన్నిసార్లు తులనాత్మక చర్చలాగా, కొన్నిసార్లు

సంభాషణాత్మకంగా, కొన్నిసార్లు రూపకాలుగా వాటితోనే మాట్లాడించటం చేస్తారు. ఇవన్నీ పఠితలను ఆకర్షించడానికే అని అనిపిస్తుంది. క్రోడీకరణలోనూ సాధారణ సంభాషణలని, సాహిత్యాంశాలని చేర్చి ఆకర్షణీయమైన వచనాన్ని రాశారు. ప్రయత్నం నిండా ప్రశ్నలను కూడదీసుకొని వెళ్ళే నైజం, బుద్ధినిండా పరిశోధించి, అనుభవించి పొందినదాన్ని చేజిక్కించుకునే గుణం, విసుగులేకుండా ఏ మూలకైనా వెళ్ళి విషయాన్ని పట్టుకోగలిగే జ్ఞానం ఈ పుస్తకాన్ని మహోన్నతంగా నిలబెట్టింది. ప్రధానంగా ద్రావిడ భాషల సంబంధాలను గూర్చి, వ్యుత్పత్తి వికాసాలను గూర్చి ఇంత విపులంగా చర్చించిన ఇలాంటి పుస్తకం మరోటి లేదనడం (ఈ నాలుగు భాషల్లోనూ) అతిశయోక్తి కాదు.

రామచంద్రగారు ఈ పుస్తకం ముందుమాటలో పత్రికలో రాసిన కొన్నింటి భాగాలుగా చెప్పారు. నిజానికి మిగతా భాగం కూడా ముద్రణ ముఖంగా చూసే అదృష్టం తెలుగు వారికి కలగాలని కోరుకుందాం. పదాన్ని ఆమూలాగ్రం శోధించడంలో రామచంద్ర గారి నైశిత్యం ప్రతివారిని ఆశ్చర్యానికో, అసూయకో గురి చేయడమే కాదు. జిజ్ఞాసువులను ప్రేరేపించగలిగితే అది శ్రేయోదాయకమే.

– – –

తెలుగు లిపి పుట్టుపూర్వోత్తరాలను గూర్చి ఒక సమగ్రమైన గ్రంథం తిరుమల రామచంద్ర గారి "మన లిపి – పుట్టుపూర్వోత్తరాలు". ఏ సంప్రదాయమైనా ఆ పళంగా పుట్టదు. కొంత చారిత్రక గమనాన్ని పెనవేసుకొని కొన్ని మూలాలని పెకిలించుకొని నడుస్తుంది. ఈ క్రమంలోనే వచ్చే మార్పులని, ఆకారంలో వచ్చే పరిణామాలని ఈ గ్రంథం సూక్ష్మాంతర పరిశీలన చేసి చూపింది.

ఈ రచనా క్రమంలో ఒక ప్రణాళికని మనం గమనించవచ్చు. ప్రధానోద్దేశ్యం లిపిసంబంధమైనదే అయినా, లేఖన సంప్రదాయానికి ముందు – వెనుకలను చర్చించడం కనిపిస్తుంది.

ఈ గ్రంథంలో నిజానికి లిపిసంబంధమైన ప్రధాన చర్చ సుమారు డెబ్బయి పేజీలదే. ఆ తర్వాతల్లో అంకెలు, లిపి గురించి వచ్చిన చర్చలు, పరిణామాలు ఆ కాలానికి చేరిన మేరకు చర్చించారు. ఈ గమనంలో ఒక అక్షరానికి ముందు 'చిత్రం', ఆ చిత్రానికి ఉనికి అయిన వస్తువు, పదార్థం దాని ఆకారం, దాన్నించి పుట్టిన రూపం ఇవన్నింటినీ చర్చించారు. మూడు భాగాలుగా గ్రంథాన్ని విభజించుకుని ఒక్కో భాగంలో కనిష్ఠంగా ఆరు, గరిష్టంగా తొమ్మిది ప్రకరణాలుగా గ్రంథరచనలో విషయాన్ని క్రోడీకరించారు.

" "ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం" అన్నాడు నారాయణ పండితుడు. రామచంద్ర గారిలోనూ ఈ స్వభావం స్పష్టంగా కనిపిస్తుంది. మొదట గ్రంథంగా మనిషిని అభివర్ణిస్తూ 'మౌఖిక వాఙ్మయం' కు ప్రతినిధులుగా ఉన్న 'గమకి గాయకుడి' గురించి చెబుతూ, 'గ్రీకు'ల గురించి ప్రస్తావిస్తూ 'ఈకోసు' గురించి చెప్తారు. ఇలాంటి వాటిలో జ్ఞాపకశక్తి ప్రధానం. ఇలాంటి గ్రంథాలయ నిర్మాణం మానవరూపంలో ఎలా జరిగిందనేదానికి 'ఇల్లీయసు' కథ చెబుతారు. ఒక అంశాన్ని గుర్తుంచుకోవడానికి లిపికన్నా ముందు ఇలాంటి మౌఖిక వాఙ్మయమే ప్రాతిపదిక.

దీని తర్వాత వచ్చిన పరిణామం ముడుల లిపి. జ్ఞాపకానికి గుర్తుల గురించి చెబుతూ ముడుల లిపిని గురించి చెప్పడంతో లిపికి సంబంధించిన చరిత్ర ప్రారంభమౌతుంది. (బహుశః 'మా' ముడి లాంటివాటిని ఇప్పటికీ మనం ఉపయోగించడానికి ఇదొక కారణం కావచ్చు.) చీనా, ప్రాచీన పారశీ, మెక్సికో, దక్షిణ అమెరికా వాసులు ముడుల లిపిని వాడారని ప్రస్తావిస్తారు.

ముడులు వేసిన పద్ధతి, అందుకు ఉపయోగించిన దారాల పరిమాణం, వాటి రంగుల నుంచి అవి మోసుకొచ్చే సమాచారాన్ని చెప్పడం ఈ దశలోని అంశం. ఈ గ్రంథి వర్ణమాలను 'క్వీపా' అనేవారు. దీన్నించి సమాచారాన్ని తెలుసుకునేవారు. పతాకాలు, అందులోని చిహ్నాలు ఇతిహాసాల్లోనే కాదు, ఇప్పటి పతాకాల వరకు కూడా ఈ సంప్రదాయం కనిపిస్తుంది. ఈ దశ తర్వాతి దశ 'వామ్పమ్' అనే పూసల లిపి. అటునించి ప్రతీకలుగా వస్తువులను పంపడం గూర్చి ప్రస్తావిస్తూ అప్పటి సమాచార వ్యవస్థను గూర్చి చెబుతారు. సమాధానం (ఒడంబడిక) చేసుకోదలుచుకుంటే వక్కలూ, తమలపాకులూ, సోంపు పంపే అలవాటు ఆదిమ జాతులకుండేదని, ఇది ప్రపంచవ్యాప్తంగా అన్ని జాతులలోనూ ఉంటుందని అంటారు. ఇప్పటికీ సంబంధాలు కుదుర్చుకున్నప్పుడు ఈ తాంబూలాలు ఇవ్వడం అలవాటులో ఉంది. రాణి కర్ణావతి అక్బర్ పాదుషాకు రాఖీ పంపింది. ఈ రాఖీ ఇప్పటికీ మనకో ఉత్సవం.

దీని తర్వాత వచ్చిన పరిణామం వస్తువులకు బదులుగా బొమ్మలను చిత్రించి పంపడంతో లిపికి ఒక బీజం పడింది. ఇలాంటి లేఖను రామచంద్రగారు అమెరికాలోని 'లేక్ సుపీరియర్'లో ఉందని అంటారు. ఆ తర్వాత నాగరికతలో వచ్చిన పచ్చబొట్ల నుండి ఇప్పటి టాటూల వరకు ఈ సంప్రదాయం ఉంది. వాకిట్లో పెట్టుకునే ముగ్గులు కూడా దీనికి దూరం కాదు.

ఈ బొమ్మల లిపిని గురించి 'షాంపోలియన్' అనే ఫ్రెంచి పండితుడు చెప్పాడు. ఇలాంటి వాటిని కొన్నింటిని రామచంద్రగారు కూడా చూపిస్తారు. పారశీకుల బాణ లిపి మనం రాసే లిపికి మూలాలు చిత్రలిపివని, దానికి మూలాలు పై చర్చలోని రూపాలనేది రామచంద్రగారి మతం. ఈ గ్రంథంలో (పే.60) కొన్ని బొమ్మలు అక్షరాలు ఎలా మాతృకలయ్యాయో (ఈజిప్టు భాషలో) చర్చిస్తారు. గ్రీకులో బొమ్మల నుంచి అక్షరాలు రూపొందిన పద్ధతిని (పే.71) చేర్చారు.

ఈ చర్చలను బట్టి ఏడువేల ఏళ్ళ క్రితమే మనవాళ్ళకు లిపి తెలుసునని అంటారు. అంతేకాదు, భారతీయ యానులకు ఉండే సంఖ్యాజ్ఞానం, సమయజ్ఞానం వేదాలలో అక్షరం, వర్ణం అనే పదాల చర్చలో పూర్వుల అభిప్రాయాలని రామచంద్ర తిరస్కరించారు. ఇవి ధ్వనులే కాని, లిపి కాదన్న పూర్వుల అభిప్రాయాన్ని 'ఇవి మొదట ధ్వనుల్ని, వాటి సంబంధంతో బొమ్మలకు, ఆ తర్వాత లిపికి వ్యవహరించాలని అంటారు. పద వ్యుత్పత్తిని బట్టి స్వభావగతంగా చర్చించే గుణమున్న రామచంద్రగారు 'లిపి' అనే పదం, 'లేపనం' అనే పదం నుండి పుట్టిందని పూర్వం తాళపత్రాలు, భూర్జపత్రాలు, పటాల మీద రాసేవాటికి రంగుపూసేవారని, అలాంటివాటినే లిపిగా అన్నారని అంటారు.

'లేఖనం' అనే పదాన్ని జాతక కథలనుంచి పరిచయం చేస్తూ, జాతక కథలలోని 'అసదిశ జాతకం'లో బాణంపై చెక్కిన అక్షరాలు గూర్చి ప్రస్తావిస్తారు. 'లేఖం చిందతి' అనే ప్రయోగాన్ని బట్టి చెక్కడం అనే పదం కనిపిస్తుంది.

బుద్ధుడు తన చిన్నతనంలో గురువు (విశ్వామిత్రుడు) ఏ లిపి నేర్పిస్తున్నారని అడగడానికి 64 లిపిలను ప్రస్తావించాడు. ఇది 'లలితవిస్తర' అనే గ్రంథంలోని కథాంశం. కర్తృత్వం అజ్ఞాతం. కాని, ఇవన్నీ ప్రాంతాల పేర్లు భాగాల పేర్లతో ఉన్నాయి. మనకు బాగా పరిచయం ఉన్న పేర్లు 'బ్రాహ్మి', 'ఖరోష్టి'లు కూడా కనిపిస్తాయి.

బహుశ: ఈ సమయంలో జాతక కథలను ప్రాచీన ప్రమాణాలుగా రామచంద్ర భావించారని అనిపిస్తుంది. ఆయన రాసిన ఒక వాక్యం గమనించదగింది. బుద్ధుని వివాహ సందర్భాన్ని గూర్చి చెప్పాక 'బుద్ధుని కాలపు పుస్తకాలే కాక, శాసనాల వంటి శాశ్వత ప్రమాణాలు కూడా మనకు బాగా దొరికాయి' (పే.88) అంటారు.

శాసనాధారాలలో లిపి అంశాలను గూర్చి ఒక అంశం ఇక్కడ ప్రస్తావించుకోవాలి. రామచంద్రగారు క్రీ.పూ. 487 కాలం నాటిదిగా నేపాల్ అడివారం లోని పిప్రోవాలో స్థూపంపైన ఒక శాసనం లభించిందని, అది ప్రథమమని అన్నారు. ఆ తర్వాత అదే

కాలానికి చెందిన (సుమారు క్రీ.పూ. 443) స్థూపం పైన శాసనం ఒకటి కనిపించిందని అన్నారు. ఇవి రెండు బుద్ధ, జైన తీర్థంకరుల పవిత్రాస్థులు నిక్షిప్తం చేసి కట్టారన్నారు. (1972 కాలంలో కరీంనగర్ జిల్లా కోటిలింగాలలో కూడా ఒక బౌద్ధ స్థూపం శాసన లిపితో బయటపడింది.)

ప్రాచీన లిపుల గూర్చి మాట్లాడుతూ పశ్చిమ వాయువ్య భాగంలో రెండు లిపులు ప్రాచుర్యంలో ఉండేవని ఒకటి బ్రాహ్మి, రెండవది ఖరోష్ఠి అని చెప్పారు. ప్రతిమల నుంచి అక్షరాల రూపాలు పుట్టాయన్న అంశం నుంచి రామచంద్ర బ్రాహ్మిలోని కొన్ని అంశాలని, అక్షరాలని సాధించే ప్రయత్నం చేశారు. (పే. 107). ఇవి ఆయా మాతృకారూపాలనుంచి వచ్చాయని నిరూపించారు. దానికి పూర్వం బ్రాహ్మి లిపి, ఫినిషియా, గ్రీకు మొదలైన లిపుల నుండి పుట్టిందనే వాదాన్ని త్రోసివేసి దీని స్వతంత్రతని చెబుతారు.

లిపి ఏర్పడ్డ కారణాలు, మార్పు చెందిన కారణాలను గూర్చి విశ్లేషిస్తున్నప్పుడు కొన్ని అంశాలు గమనించాలి.

1) వ్రాత పద్ధతిలోని వైరుధ్యాలు మొదటి ఇతిహాసకాలంనాటి భిన్న సంస్కృతులు, వాటిననుసరించే వర్గాల వల్ల ఏర్పడ్డాయి.

2) ఈజిప్టు నుండి చిత్రలిపి, ఫెనిషియా నుంచి చేరిందని అనటం సరికాదని, మానవ జాతి భిన్న జాతులుగా విడిపోకముందే ప్రాచీన కాలంలోనే పుట్టి పెరిగిందని అన్నారు.

3) సర్వసామాన్యం కాకపోవడానికి సర్వమైన, సరళమైన, సులభమైన పద్ధతి లేకపోవడం. మనగలిగే సామగ్రి లేకపోవటం. సామాన్య వ్యవహారాల్లా కాకుండా 'గుప్తజ్ఞానాన్ని' దాచుకునే అంశాలకు ఉపయోగించేదవటం వల్ల వైరుధ్యాలేర్పడ్డాయని అంటారు.

ఈ క్రమంలో లిపి మూలాలని వెతుక్కోవడానికి పై చర్చ తర్వాత బ్రాహ్మి లిపి మూలమని నిర్ధారించుకున్నాక నిర్దిష్టమైన తెలుగు అక్షరానికి దగ్గరగా ఉన్న కాలాన్ని 'వేంగి' లిపి (క్రీ.శ. 5) గా గుర్తించి, దాన్నించి క్రీ.శ. 14వ శతాబ్దం దాకా తొమ్మిది పరిణామాలుగా గుర్తించారు. అది వేంగిలో రెండు భేదాలు, శాలంకాయనుల కాలం (క్రీ.శ. 5వ శతాబ్దం), విష్ణుకుండినుల కాలం (క్రీ.శ. 6వ శతాబ్దం), చాళుక్యుల కాలంలో మూడు లిపులు బాదామి చాళుక్యులు (క్రీ.శ. 7వ శతాబ్దం), వేంగి చాళుక్య

లిపి (సర్వలోకాశ్రయుని కాలం, క్రీ.శ. 8వ శతాబ్దం), వేంగి చాళుక్య లిపి (క్రీ.శ. 11వ శతాబ్ధం, చాళుక్య భీముని కాలం). తర్వాతది సంధికాలపు లిపి (క్రీ.శ. 11వ శతాబ్ధం, రాజరాజనరేంద్రుని కాలం), తర్వాత మూడింటిని తెలుగు లిపులుగా కాకతీయ (క్రీ.శ. 13వ శతాబ్ధి), నామనాయక (క్రీ.శ. 14వ శతాబ్ధి), పంటమైలారుని కాలం (క్రీ.శ. 15వ శతాబ్ధి). పంటమైలారుని కాలానికి, ఇప్పటికి 'క', 'ట', 'శ', 'ఝ'లలో మినహా మార్పులు లేవు. (ఈ పట్టిక ప్రత్యేకంగా వేరొక పేజీలో చూపారు.)

దీనిక పూర్వం బ్రాహ్మీ లిపి నుంచి పరిణామాలకు గతం నుంచి కనిపిస్తున్న నాలుగు లిపులు కనిపిస్తాయి. మౌర్య బ్రాహ్మి (క్రీ.పూ. 3వ శతాబ్ధి), బటిప్రోలు (క్రీ.పూ. 3వ శతాబ్ధి), సాతవాహన (క్రీ.శ. 1వ శతాబ్ధి), ఇక్ష్వాకు (క్రీ.శ. 3వ శతాబ్ధి), గుప్తుల కాలపు లిపి (క్రీ.శ. 4వ శతాబ్ధి). తర్వాత లిపులు కూడా పల్లవుల కాలం (క్రీ.శ. 7వ శతాబ్ధి), తెలుగు, కన్నడ లిపి (క్రీ.శ. 7వ శతాబ్ధి), పూర్వ చాళుక్య (క్రీ.శ. 10వ శతాబ్ధి), రాజరాజనరేంద్ర (క్రీ.శ. 11వ శతాబ్ధి), కాకతీయ (క్రీ.శ. 13వ శతాబ్ధి), ప్రోలయ వేమారెడ్డి (క్రీ.శ. 14వ శతాబ్ధి), పెదకోమటి వేమారెడ్డి (క్రీ.శ. 15వ శతాబ్ధి), కృష్ణదేవరాయల కాలం (క్రీ.శ. 16వ శతాబ్ధి).

ఈ విశ్లేషణలోని కొన్ని అంశాలని ఇలా గమనించవచ్చు.

1) ఏలూరు సమీపంలోని వేంగి నగరం శాలంకాయనుల రాజధాని. అందువల్ల దానికి వేంగి లిపి అన్నే పేరు వచ్చింది. 3వ శతాబ్ధం నాటికే బలవంతులై సుమారు నూటయాభై సంవత్సరాలు పాలించారు. బౌద్ధ మతం క్షీణించడంవల్ల, భాష, సంఘాలలో మార్పువల్ల దక్షిణ బ్రాహ్మిలో మార్పులు కన్పిస్తాయి.

2) ఈ కాలంలోనే అక్షరాల తలపై చిన్న అడ్డగీత మొదలైంది. ఇది మన ఇప్పటి తలకట్టుకు మూలం.

3) ఆ తర్వాత విష్ణుకుండిణులు సుమారు రెండు వందల సంవత్సరాలు పరిపాలించారు. వినుకొండ వీరి ప్రధాన నగరం. వినుకొండే సంస్కృతీకరింపబడి విష్ణుకుండినగా మారిందని పండితుల అభిప్రాయం. వీరి తర్వాత (5 నుంచి 7 కాలం) చాళుక్య వంశానికి రాజ్యాలు పరమయ్యాయి. విష్ణుకుండిణుల కాలం లిపి నిర్ధిష్ట స్థాయినందుకుంది. ఇందులో 'ళ్ష' అనే అక్షరం వింతది. (ఇది తమిళంలో ప్రచురంగా

వాడబడింది. దీని ఉచ్చారణ ఇతర ద్రావిడ భాషలలో డ, ర, ల, ళ, ఱ గా మారింది.)

4) చాళుక్యులు దేశీయాభిమానాన్ని చాటారు. కర్ణాటక, మహారాష్ట్రతో పాటు తెలుగు ప్రాంతాలను పాలించారు. (ఈ కాలంలో పశ్చిమాంధ్రని చోళులు పాలించారు.)

5) చాళుక్యుల సంబంధించిన విభాగాలు. వేంగి, కళింగలు తూర్పున ఉండటం వల్ల వేంగి, తూర్పు చాళుక్యులని, బాదామి చాళుక్యులు పశ్చిమాన ఉండటం వల్ల బాదామి, పశ్చిమ చాళుక్యులని వ్యవహరించారు. ఈ క్రమంలోనే తూర్పు చాళుక్య లిపి - వేంగి చాళుక్యలిపి, బాదామి చాళుక్య లిపి - పశ్చిమ చాళుక్య లిపి అని వ్యవహరించారు. నన్నయ భారతాన్ని వేంగి చాళుక్య లిపిలోనే రాశారు.

6) నన్నయకు ఈవల 150, 200 సంవత్సరాలకు తెలుగు, కన్నడ లిపులు వేరయ్యాయి. చాళుక్యుల కాలంలో పశ్చిమ ప్రాంతాన్ని తెలుగు చోళులు పాలించారు. ఎక్కువ ప్రాంతాన్ని మహారాష్ట్రలోని మరఠ్వాడాతో కలుపుకొని 11వ శతాబ్ది నుండి 300 సంవత్సరాలపాటు కాకతీయులు పరిపాలించారు. ఆ తర్వాత కొంత భాగం రాచకొండ, దేవరకొండ రాజధానిగా పద్మనాయకులు, మరికొంత భాగం కోరుకొండ, కొండవీడు, రాజమహేంద్రవరం రెడ్డిరాజులు పరిపాలించారు. 15 నుంచి 16 వరకు విజయనగర రాజులు. ఈ కాలాల లిపులను కాకతీయ, రెడ్డిరాజుల, విజయనగర రాజుల లిపులుగా వ్యవహరించారు.

7) రామచంద్ర కాకతీయ లిపిని తిక్కన లిపి, రెడ్డి కాలపు లిపిని శ్రీనాథ లిపి అని వ్యవహరించారు. అన్ని అక్షరాలకు తలకట్లు ఇక్కడే సమకూరాయి.

8) విజయనగర రాజులు శాసనం ఏ భాషలో ఉన్నప్పటికీ, తెలుగు లిపిలో వేయించి లిపిని ఉద్ధరించారు.

ఈ అన్ని కాలాలలకు సంబంధించిన గుణింతాలు కూడా రామచంద్ర చర్చించారు. తర్వాత అంకెలు, కాగితం పుట్టుక, అచ్చులోకి తెలుగు రావటం దాకా చర్చించిన తర్వాత ఒక ప్రధాన ప్రకరణం కనిపిస్తుంది. అది తెలుగు, కన్నడ భాషల

ఉమ్మడి లిపి. శాసన కాలం నుంచి తెలుగు, కన్నడ లిపులు సమానమైన రూపాల్లో ఉన్నాయి. అంతేకాక, భారతదేశానికి ఉత్తరభాగాన హిమాచల్ ప్రదేశ్, హర్యానా, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, గోవా రాష్ట్రాలు ఉమ్మడిగా దేవనాగరిని వాడుతున్నారు. అందువల్ల ఆ ప్రాంతాలు పుస్తక ప్రచురణలో ముందుకు వెళ్ళాయి.

అప్పటి కర్ణాటక గవర్నర్ శ్రీ పెండెకంటి వెంకటసుబ్బయ్య గారి ఆలోచన మేరకు బెంగుళూర్ విశ్వవిద్యాలయ వైస్-ఛాన్సెలర్, కొంతమంది లిపివేత్తలు భాషా అధ్యయనపరులతో ఒక కమిటీని వేశారు. శ్రీ రామచంద్ర కూడా అందులో ఒకరు. ఈ కమిటీ పన్నెండు సమావేశాల తర్వాత క్రీ.శ. 5 నుండి క్రీ.శ. 16 వరకు ఉన్న లిపులను పరిశోధించి ఒక ఉమ్మడి లిపిని ప్రస్తావించారు. ఈ ఉమ్మడి లిపికి ఇప్పుడు మనం వాడుతున్న రెండు లిపులకు 5 అక్షరాల్లో మాత్రమే భేదాలున్నాయి. గుణింతాలలో కూడా కేవలం 3 భేదాలున్నాయి. దురదృష్టవశాత్తు ఈ లిపుల ఉమ్మడితనాన్ని నిలుపుకోవాలనే ఆకాంక్ష అక్కడితోనే ఆగిపోయింది.

రామచంద్ర గారి తర్వాత తెలుగులో శాసన పరిశోధన మరింత ముందుకు వెళ్ళింది. ఐ.కె.శర్మ గారు మొదలైనవారు మరింత ముందుకు వెళ్ళి గుణింతాలు మొదలైనవాటిపై పరిశోధించారు. ఈ మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ ప్రాచ్య లిఖిత పరిశోధనా సంస్థ డా॥ పి.వి. పరబ్రహ్మ శాస్త్రి, డా॥ ఎన్.ఎస్. రామచంద్రమూర్తి రాసిన "Telugu script origin and evolution (3 B.C to 6 A.D)" ప్రచురింపబడింది. ఇది ప్రధానంగా శాసనాధారాలను బట్టుకుని బ్రాహ్మీ మూలాన్ని పరిణామాన్ని శోధించింది. ఈ పుస్తకం రామచంద్ర గారికి, ఈ పుస్తక ముద్రణ కాలం (2009) కి మధ్య వచ్చిన ఇతర శాసన ఆధారాలను కూడా పరిశీలించింది. దీన్ని తెలుగులో డా॥ అమ్మంగి వేణుగోపాల్ అనువాదం చేశారు.

కేవలం తెలుగు ప్రాంతమే కాక, భారతదేశమే కాక సంపూర్తిగా ప్రపంచ లిపి పరిణామాన్ని పిడికిట పట్టుకున్న పుస్తకం రామచంద్రగారి "మన లిపి - పుట్టుపూర్వోత్తరాలు" ఈ మార్గాన్ని అందిపుచ్చుకొని ఇప్పుడున్న అకాడెమీలు ముందుకు సాగితే-

*"యత్ర భవతి విశ్వ మత్యద్భుత మేకనీడమ్"*- అన్న ప్రాచీనుల కాంక్షలు నిజమౌతాయి.

--------

# తిరుమల రామచంద్ర కలం చిత్రాలు - అవలోకనం

- డా॥ ఎ.బి.కె. ప్రసాద్

మన ప్రాచీన వాఙ్మయంలో ఒక సూక్తి ఉంది. "విద్వాంసుల ముఖంనుంచి త్వరగా మాటలు బయటికిరావు, కాని వాటిని బయటకు వెళ్లగక్కినప్పుడు మాత్రం అవి ఏనుగు దంతాల్లా మళ్లీ వెనక్కిపోనేపోవ"ట! అంటే, మనిషిలో నిర్మలత్వం, మనస్సులో నిర్భీకత, గుండెదిటవు, ముక్కుసూటితనం ఉన్నవాళ్ళు ఏ రంగంలో ఉన్నా విన్నాణంతో రాణింపునకు రావటానికి అనంతమైన అవకాశాలుంటాయి. విద్వాంసులైనవారికి, పండితులైనవారికి ప్రజాసేవలో ప్రజాబాహుళ్యం దృష్టినీ, గౌరవ ప్రవత్తులను చూరగొన్న రాజకీయ వేత్తలకూ, సాహితీసమరాగణంలో, విద్వద్గోష్ఠులలో, లలితకళాది రంగాలలో శేముషీ దురంధరులయిన వారికి ప్రజాదరణకు లోటు ఉండదు. ఇందుకు అడ్డదారులు లేవు. ఆయా రంగాలలో వీరందరి కృషినీ అంచనా గట్టే 'తులాదండం' వారికి విద్వత్ సంపదలో తులతూగగల సరిజోడుల వద్దనే ఉంటుంది. అయితే ఇందుకు కేవలం పాండిత్యమే చాలదు. ఆయా రంగాలలో మేరునగధీరులయినవారి బహుముఖీన కృషిని సామాన్య పాఠకలోకానికి చేర్చగల వ్యావహారిక భాషాచణులయిన పాత్రికేయుల చేయూత అవసరం. అప్పుడే వివిధ రంగాలలోని ఉద్దండుల కృషిని ప్రజల వద్దకు, భావితరాలకు సాంస్కృతిక లిఖిత. అలిఖిత వారసత్వాన్ని భద్రంగా బట్వాడా చేయగల నవతరాన్ని తయారు చేసుకోగలం! అటువంటి రచనా పాటవంగల పండిత-పాత్రికేయ తరంలో కొసమెరుపుగా, ధృవతారగా వెలుగొందిన స్మృతిబింబం మన తిరుమల రామచంద్ర! ప్రతి జాతికీ వికాసదశలుంటాయి, ఉత్థాన పతనాలూ ఉంటాయి. వాటిలో ఒకటి సాంస్కృతిక పునర్వికాసనోద్యమదశ. అది యూరప్‌లోని కొన్ని దేశాలకు పరిమితమైన 14-15 శతాబ్దాలనాటి పునర్వికాసదశ మాత్రమే కాదు. అనంతర

కాలంలో భారత దేశంలోనూ, అందులో భాగంగా తెలుగునాట కూడా 19-20 శతాబ్దులలో ప్రభవిల్లిన పునర్వికాసదశలున్నాయి. ఈ దశలో స్వాతంత్ర్య సిద్ధికోసం సాగిన పోరాటాలు, సాంస్కృతిక, సారస్వత రంగాలలో పుచ్చపువ్వులా విరియబూసిన శాఖోపశాఖలూ అంతర్భాగాలే. ఈ రంగాలలో ఒక్కొక్క ఉద్దండుడూ గిరిశిఖరంగా అసమాన వ్యక్తిగా అవతరించిన దశలవి! వీరితో సాన్నిహిత్యం ఒక ఎత్తుకాగా, అలాంటి వారిని పాఠకలోకానికి మరపురానిమనీషులుగా కలం చిత్రాలలో మూర్తికట్టి నేటి తరానికి, భావితరాలకూ అందించగల సరిసమానమైన రాయసగాడు కావాలి. యుగలక్షణాలను అతడి నిశిత పరిశీలనతో తన కాలానికి అనుసంధించి కమనీయ వాఖ్యానంతో అందించగల రసజ్ఞుడైఉండాలి. తెనాలివాడన్నట్టు “తన వ్రాయు గంటంబు మొనవాడి విశ్వంభరా ప్రజలకు ప్రాణరక్ష”గా ఉండగలగాలి! ఆ పనిని పలుభాషలకు నెలవైన పండిత పాత్రికేయుడు రామచంద్ర “మరపురాని మనీషి” పేరిట, “తెలుగు వెలుగులు” పేరిట కలం చిత్రాలుగా పాఠకులకు చివరి శ్వాస వరకూ పంచాడు! ఈ భాషా సేవకుని కార్యరంగం ఒకటీ, అరాకాదు, అదొక పాదోధి. ఆ సాగరాన్ని మథించిన వారికిగాని ఆయన లోతుపాతులు అంతుచిక్కవు. తనకాలంనాటి వారూ, అంతకుముందున్న సారస్వతేయులు పెక్కుమంది భాషావేత్తలు మాత్రవేకాదు, షడ్దర్శనాలు, ఛందోవ్యాకరణాది శాస్త్రాలలో నిష్ణాతులు, నిఘంటునిర్మాణంలో, ప్రాచీన అర్వాచీన సాహిత్య కళాది రంగాలకు చెందిన విషయ సంకలనాల కూర్పులో, విజ్ఞాన సర్వస్వాల సంకలనంలో నెలకొల్పిన సంప్రదాయాలకు రామచంద్రుడు తగిన వారసుడు. పదాల పుట్టుపూర్వాల గుట్టుమట్టులు లాగినవాడు. పదప్రయోగాల వినియోగ రహస్యాలు తెలిసినవాడు, ఈ రెండు ప్రయోగాలు తెలిసి ఉండటం పాత్రికేయ వృతిని ఎంచుకునే వర్థిష్ణువులకు పత్రికా నిర్వహణలో ఉన్నవారికి ఎంతటి మార్గదర్శకాలో నిరూపించిన వాడూ! బహుముఖ గ్రంథకర్త అయిన రామచంద్ర ధారణశక్తి అపారం, అది అసాధారణ వ్యాప్తిలోని యుక్తి వైచిత్రికి నిదర్శనం. సత్యాన్వేషణలో దేశదిమ్మరి, అలుపెరుగని జిజ్ఞాసువు. ఈ సందర్భంగా ఒక ముచ్చట చెప్పుకొని, రామచంద్రుని కలం చిందులను పరామర్శిద్దాం. 18వ శతాబ్దంలో మహా చరిత్ర కారుడైన ఎడ్వర్డ్ గిబ్బన్ రాసిన రోమన్ సామ్రాజ్య ఉత్థాన పతనాల సుప్రసిద్ధ చరిత్ర (“ది డిక్లయిన్ అండ్ ఫాల్ ఆఫ్ ది రోమన్ ఎంపైర్”) గురించి అనేక కోణాలలో అంచనా కడుతూ ఆనాటి చారిత్రక సారస్వత విలక్షణ్యాన్ని హ్యూ ట్రెవర్-రోపర్ అనే చరిత్రకారుడు యిలా పేర్కొన్నాడు:

"ఆయుగం (18వ శతాబ్ది) అనేకమంది అఖండ శేముషీ సంపన్నులను, వారి పాండితీ గరిమను పుష్కలంగా ఆవిష్కరించింది. అందుకనే అది మహాయుగం, మహోన్నత శతాబ్దం. ఒక్కొక్క పండితుడూ తనకు తానై ఎవరికివారుగానే ఒక్క చేతిమీదుగానే బండ్లకొద్దీ చారిత్రక పత్రాలను, శాసనాలను, పురావైభవ సాక్ష్యాధారాలను తవ్వితీసి సంపుటాలకు సంపుటాలనే సంస్కరించి, పరిష్కరించిన మహోన్నతులు. చారిత్రక సత్యాలకు యిది పరసీమ, కనుక ఇంతకన్నా ఇక చెప్పగలిగిందీ, చాటగలిగిందీ లేదని భావించరాదనీ, ఎప్పటికప్పుడు సరికొత్త ఆవిష్కరణలు అనివార్యం కాబట్టి, ఆఖరిమాటగా స్థిరమైన భాష్యం చెప్పటం అసాధ్యమనీ ప్రకటించి భావి పరిశోధకులకు అవకాశం కల్పించిన మహోన్నతయుగం అది" ("దిగ్రేట్ ఐడియాస్" 1981)!

అలాగే, తిరుమల రామచంద్ర కూడా తెలుగునాట 19-20 శతాబ్దులలో వివిధ రంగాలలో దూసుకువచ్చిన చారిత్రక పరిశోధన, సారస్వత రంగాలలో, సంఘసంస్కరణ, కళాదిరంగాలలోని మహావ్యక్తుల్ని స్వయంగా దర్శించి, వారిని కలిసి, కలివిడిగానూ, నిష్కర్షగానూ వారితో గంటల తరబడి సంభాషించి ఇంటర్వ్యూహాలలో నిగ్గుతేల్చిన ఆ నవనీతాన్ని దిన, వార మాసపత్రికల ద్వారా పాఠకులకు అందించి, వైజ్ఞానిక రంగంలో వారిని ఓలలాడించిన సుప్రసిద్ధ పండిత పాత్రికేయుడు రామచంద్ర. రామచంద్రుని ఈ విలక్షణమైన ప్రక్రియకు తుల్యమైన ప్రక్రియను (ఇలాంటి లేఖినీచిత్రాలే) 1953లోనే యువ అమెరికన్ రచయితలు కొందరు "పారిస్ రివ్యూస్" సంస్థ ఆధ్వర్యంలో ప్రారంభించి సజీవులైన ప్రముఖ ఆంగ్ల రచయితలను (వివిధ రంగాలకు చెందినవారిని) కలిసి, వారితో సుమారు రెండు మూడు రోజులు లేదా పెక్కుగంటలు గడిపి, వివిధ కోణాల నుంచి వారు వెలిబుచ్చిన అభిప్రాయాలను క్రోడీకరించుకుని 7 సంపుటాలుగా "పారిస్ రివ్యూ ఇంటర్వ్యూస్" పేరిట "రైటర్స్ ఎట్ వర్క్" మకుటం క్రింద ప్రచురించారు! ఆ సమీక్షలలో వారనుసరించిన పద్ధతిలోనే రామచంద్ర ఇక్కడ తెలుగులో మన ప్రముఖుల గురించి రాసిన లేఖినీ చిత్రాలు "మరపురాని మనీషులు" "తెలుగు వెలుగులు", "అహంభో అభివాదయే" మకుటంతో గ్రంథరూపంలో వెలువడ్డాయి! "రచనా వ్యాసంగంలో రచయితలు" అన్న మకుటం కింద వెలువడ్డ పారిస్ ఇంటర్వ్యూలు ప్రశ్నోత్తరాల రూపంలోనూ, రచయితలు, పండిత ప్రముఖుల వైయక్తిక దృష్టినీ వారి వ్యక్తిగత అభిరుచులనూ వారి జిజ్ఞాసారంగాలను సన్నిహితంగా తెలుసుకొని వెలువరించినవి! కాగా, రామచంద్ర స్వయంగా స్వాతంత్ర్య సమరయోధుని

హోదాలో స్వయం సాధనలో ప్రసిద్ధ సారస్వతేయుడుగా ఎదిగిన అనుభవంతో తన తరానికి ముందుండి, తనకాలంలో కూడా కొనసాగుతున్న ప్రసిద్ధులతోనూ, తన తరంలోని సమకాలీన ఉద్దండులతోనూ ఉన్న పరిచయాలు ఆధారంగా 75 మంది విశిష్ట మూర్తుల గురించిన కలం చిత్రాలుగా, లేదా లేఖినీ చిత్రాలుగా తన పరిశీలనానులోచనాల సాయంతో అందించాడు. 19-20 శతాబ్దుల తెలుగుతేజోమూర్తుల గురించి. సౌశీల్యం, సౌహార్దం, సౌమనస్యం, సౌజన్యం, నిరాడంబరం, నిస్వార్థం పునాదులుగా మూర్తీభవించిన రామచంద్రుని కలం చిందులలో నాటి తెలుగుదేశంలో ఎందరో కవి పండితులు, చరిత్రకారులు, సంగీతజ్ఞులు, పురావస్తు పరిశోధకులు, నాటకరంగం ప్రసిద్ధులూ కలగలిసిపోయినవారే! విశ్వనాథ తన గురువు చెళ్లపిళ్లను స్తుతించుకుంటూ "వానలో తడియనివారు మద్గురు వధాన మృదూక్తి మరందధారలో/కడుగనివారు మాకెచట కానగరారిలన్" అన్నాడు. కాని, ఆ స్ఫూర్తి రామచంద్రుడి కలం సిరాచుక్కలలో వెలుగు రిక్కలై, తెలుగు సరస్వతికి రెక్కలు తొడిగిన ప్రతిభామూర్తులకూ దక్కింది!

రామచంద్రుడి కలం చిత్రాలలో/లేఖినీ విచిత్రాలలో దర్శనమిచ్చే ప్రతి ఒక్క మహామనీషి పలుభాషలలోనూ, దార్శనిక దృష్టిలోనూ తనకు తానే సాటి; పద్యాలు, గద్యాలు, శ్లోక పాకాలు-అన్నీ 'ఓం'కార స్వరూపాలేనని చాటిన కాశీ కృష్ణాచార్యులనుంచి బహుముఖీన వాఙ్మయ పాండితికి, సహృదయతకు, కమ్మని కవితకు, గాన గరిమకు శిఖరాయమానమైన రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ వరకు, ప్రాచ్యకవితా కోకిల సరోజినీదేవి నుంచి సంగీత సమ్రాట్ ఎం. ఎస్.సుబ్బులక్ష్మి, ఇల్లిందల సరస్వతీ దేవి వరకు, మానవల్లి కవి నుంచి మారేమండ రామారావు వరకూ ఆంధ్రోద్యమ నాయకులైన గాడిచర్ల, తెలంగాణా వైతాళికులు సురవరం ప్రతాపరెడ్డి, బూర్గుల, మాడపాటి హనుమంతరావు ప్రభృతులనుంచి యుగకవి పుట్టపర్తి, విశ్వనాథల వరకూ, ఆదర్శ పత్రికా సంపాదకులు అడవి బాపిరాజు నుంచి నార్లవరకూ - యిలా ఎందరెందరో మహామనీషుల కృషిని తలస్పర్శగా మధురమైన వర్ణనాభావ చిత్రాలలో బంధించాడు! ఇలా ఒకరా, యిద్దరా- చిత్రకళలో, చలనచిత్రకళలో, దర్శక-నిర్మాతల దార్శనికశక్తినీ, నాదస్వర సుధాలహరిలో శ్రోతల్ని తన్మయుల్ని చేసిన దాలిపర్తి పిచ్చిహరినుంచి వాయులీన కళలో ఆనందలోకాలకు ద్వారాలు తెరిచిన ద్వారం వెంకటస్వామి నాయుడిదాకా, సంగీత సమ్రాట్ ఉస్తాద్ బడే గులామ్ ఆలీఖాన్ నుంచి నాదస్వర బ్రహ్మ షేక్ చినమౌలా వరకూ రామచంద్రుడి కలం కదంతొక్కింది!

సంగీతం, సాహిత్యం సరితూచిన హరికథాపితామహుడు ఆదిభట్ల నారాయణ దాసు నుంచి మహాకవి జాషువా వరకూ రామచంద్ర కలం చిత్రాలు అందించాడు. ఆయన కలం క్రమంగా లేఖినీ చిత్రాలలో చిందులేసుకుంటూ స్త్రీమూర్తివర్ణనలో, శ్రమజీవన సౌందర్యానికి శ్రామికజన విజయానికి అద్భుత శిల్పాకృతి కల్పించిన దేవీప్రసాద్‌రాయ్ చౌదరి కుంచె సొబగులలో విలీనమైపోయింది! శాసనపరిశోధనలో కాళ్లకు బలపాలుకట్టుకుని ఊరూరా గాలించి చారిత్రక విభాతసంధ్యలలో తెలుగువాడి చరిత్రను తవ్వితీసిన మల్లంపల్లి వారినుంచి బి.ఎన్.శాస్త్రిదాకా జరిగిన కృషి తెలిసినవాడు. రామచంద్రుడి ప్రతిభా లేఖిని అంత శక్తిమంతంగా చిందులు తొక్కడానికి వెనక ప్రజాస్వామిక రచనా దృక్పథం, తనదైన ప్రత్యేక తాత్విక చింతన, తీసుకున్న అంశంపైన సాధికారత, బలమైన అభివ్యక్తి ఉండటమే కారణం. అంతేగాని కీర్తి, కాంచనాలకోసం, పాండితీ ప్రకర్షకోసం కాకుండా పరిశోధనాంశాల ద్వారా ప్రజలకు వాస్తవాలు తెలియచేస్తూ వారిని చైతన్యవంతుల్ని చేయడమే లక్ష్యంగా పెట్టుకున్న బాధ్యతగల పండితపాత్రికేయుడు తిరుమల రామచంద్ర. అందుకే, గ్రాంధిక భాషావాదాన్ని విడనాడి "పాతపాళీ" నుంచి, వ్యవహారిక భాషా వ్యాప్తికోసం "కొత్తపాళీ" చేపట్టిన 'ఆంధ్రవిశారద'తాపీ ధర్మారావును "పాతకొత్తలకు పూవుల వంతెన"గా రామచంద్ర అభివర్ణించాడు! పదవిన్యాసాలలోనే కాదు, పాదద్వయవిన్యాసాలలో (పర్యాటకుడుగా) పేరెన్నికగన్న రామచంద్ర మనందరినీ తనతోపాటు "హంపీ నుంచి హరప్పాదాక" పాఠకమిత్రులుగా పఠన ప్రక్రియలో తనవెంట తిప్పినవాడు! ఒక కవిగా ఆయన స్వాతంత్ర్య సమయస్ఫూర్తితో, ఒకనాటి జాతీయ కాంగ్రెస్ కార్యకర్తగా దేశభక్తి ఉరవడిలో వడివడిగా పాటలూ, గేయాలూ రాశాడు." "తెలుగులో పద్యాలు చెప్పేవాడినేకాని, మొగ్గమాత్రం సంస్కృతంపైననే" అని చెప్పిన రామచంద్ర నాటి దేశ స్వాతంత్ర్యోద్యమానికి ఊతగా అనేక శ్లోకాలు రాశాడు, సంస్కృత గేయాలూ రాశాడు, నాటి "సేవాదళ్" పరిక్రమానికి పాటలు కట్టాడు, స్కాట్ మార్చింగ్ సాంగ్‌తో పరిచయం ఉన్నవాడు గనుక దానికీ పాటకట్టి మట్లు కట్టించాడు. ఇందుకు ఉదాహరణ:

"ప్రేమపూతా మాతా సుచరిత" పల్లవిగా–

చరణం: 'సకల చరాచర నికరాకారే
వికసిత సురుచిత ఘనవనవారే
అకలంకే విమలోదకపూరే ॥ ప్రేమ ॥

మార్చింగ్ సాంగ్: "భిందె భిందె భారతీయ
మాతృదాస్య శృంఖలం
మందహసన విదురమద్య
కలయ మాతురాననమ్
మనసికలయ భారతీయ
ఆంగ్లచోర మారణమ్
కనకరత్న విభవ సుభగ
మాతృభూమి తారణమ్"

రాదనుకున్న శశి రానట్టే, వస్తుందనుకున్న స్వరాజ్యం అనుకున్న వ్యవధిలో రాకపోతే, కొందరిలా రామచంద్ర కుంగిపోయినవాడు కాడు! విప్లవ సంప్రదాయంలో కూడా కొన్నాళ్లు ఈదులాడిన రామచంద్రకు నైరాశ్యం ఏకోశానా దరి చేరలేదు! కారణం, ఆయన "గ్రామైక రాత్రంగా ఆసేతుశీతనగం చుట్టి వచ్చిన" మరపురాని మహా మహామనీషి అయినందుననే సుమా! కుట్రకేసులూ ఎదుర్కొన్న వాడు. కుటిల స్వభావుల్నీ తార్కిక శక్తితో ఎదిరించాడు! విశ్వకవి రవీంద్రుడి సంకల్పమే బహుశా రామచంద్రుని సంకల్పమై ఉండాలి. ఎందుకంటే, "ప్రపంచమంతా నీతో మాట్లాడకపోయినా సరే, నిన్ను భయపెడుతూ నీకు ప్రతికూలంగా ఉన్నా సరే - బెదరని గుండెతోనే ఒంటరిగానే అలా ("ఏకాకీ చరరే...") ముందుకుసాగి పొమ్మన్నది రవీంద్రుడినీతి. అందుకు తిరుమల రామచంద్ర భిన్నంకాదు! కనుకనే ఆయన ఒక సందర్భంలో "మావురాయుడ"నే ఒక ప్రాకృతకవి వాక్కుల్ని స్థిత ప్రజ్ఞతతో తలచుకున్నాడు: "మానస్వి మనస్సు మరణం ఆసన్నమైనప్పుడు కూడా ఉన్నంతగానే ఉంటుంది, అస్తమిస్తున్నప్పుడు సూర్యకిరణాలు కూడా నేలకేసి చూడవు, నింగికేసే దిలాసాగా ప్రసరిస్తాయి" అలాంటి ధిషణ ఉన్న పండితుడే గాని, విలాస పురుషుడు కాదు, మన తిరుమల రామచంద్ర!!

--------

# హంపి నుంచి హరప్పా దాక - ఆత్మకథాంశాలు

- ఆర్వీ రామారావ్

మనుషులందరికీ జీవితాలు ఉంటాయి. అనుభవాలూ ఉంటాయి. కానీ జీవితానుభవాలు మాత్రం కొందరికే ఉంటాయి. జీవితానుభవాలు నలుగురికీ ఉపయోగపడేవైతే వాటిని గ్రంథస్థం చేస్తారు. జీవిత చరిత్రలుగా మలచ దగ్గ జీవితాలు బహు కొద్ది మందికే ఉంటాయి. ఆ సౌలభ్యమూ అందరికీ దక్కకపోవచ్చు. అలాంటి అవకాశం, అవసరం ఉన్న వారి జీవిత చరిత్రలు కూడా ఆత్మ కథలుగా గ్రంథస్థం చేస్తే వాటిలో ఆ వ్యక్తుల సంపూర్ణ జీవితం ప్రతి ఫలించదు. వారు గ్రంథస్థం చేసిన దశ మేరకే మనకు అందుతుంది.

మహాత్మాగాంధీ జీవిత చరిత్ర" సత్యశోధన"లో 1920 దాకానే తన జీవిత చరిత్ర అందించారు. అంటే గాంధీ జీవితంలో ఆయనకు 51 ఏళ్ళ దాకానే అందులో ఉంటుంది. ఆ తర్వాత తన జీవితంలో జనానికి తెలియనిది పెద్దగా లేవు కనక వాటిని రాయలేదని ఆయనే చెప్పుకున్నారు. నెహ్రూ ఆత్మ కథ 1935 వరకే గ్రంథస్థమైంది. అంటే నెహ్రూ జీవితంలో దాదాపు నాలుగున్నర దశాబ్దాల వివరాలే ఉన్నాయి. కాని ఈ నాయకులిద్దరూ స్వాతంత్ర్య పోరాటంలో నిర్వహించిన కీలకపాత్రలో ముఖ్యఘట్టాలు వారి ఆత్మకథల్లో దొరకవు.

84 ఏళ్ళ నిండు జీవితం గడిపిన తిరుమల రామచంద్ర "హంపీ నుంచి హరప్పా దాక"లో కూడా ఆయన జీవితంలో మూడో వంతు మాత్రమే రికార్డు అయింది. నిజానికి రామచంద్ర జీవితంలో చేసిన పరిశోధనలు, రచనలు, పత్రికా రచయితగా ఆయన కృషి, ఎదుర్కొన్న ఒడిదుడుకులు మిగతా మూడింట రెండు వంతుల జీవితంలోనే ఎక్కువగా ఉన్నాయి.

ఈ గ్రంథం 1997లో రామచంద్ర మరణానంతరం ప్రచురితమైంది. కానీ 17 ఏళ్ళ కాలంలో మూడో ముద్రణ వెలువడింది. జీవితం గొప్పదైనప్పుడు పుస్తకాలు కొనే అలవాటు తెలుగువారికి అంతగా లేని స్థితిలోనూ రచయిత మరణానంతరం మూడు ముద్రణలు వెలువడడమే దాని గొప్పతనానికి నిదర్శనం. నెహ్రూ జీవిత చరిత్ర వెలువడిన మొదటి సంవత్సరంలోనే తొమ్మిది ముద్రణలు వెలువడ్డాయి.

ఆత్మకథలు సాధారణంగా ఆ వ్యక్తి జీవిత విశేషాలను వ్యక్తం చేయడానికి ఉపకరిస్తాయి. అయితే కేవలం తమ కథ మాత్రమే చెప్పే ఆత్మకథల ప్రయోజనం ఎప్పుడూ పరిమితంగానే ఉంటుంది. సమకాలీన సమాజ స్థితిగతులను తమ దృక్కోణం నుంచి చెప్పడానికి తమ జీవిత విశేషాలను చెప్పడానికి ఆలంబనగా చేసుకుంటే అవి సర్వజనామోదంగా తయారు కావడమే కాక సార్వకాలీనంగానూ ఉంటాయి. హంపి నుంచి హరప్పా దాక అందుకే రామచంద్ర ఆత్మ కథలాగా కంటే తెలుగు జాతి ఆత్మ కథలా నిలిచింది.

తిరుమల రామచంద్ర జీవితం వడ్డించిన విస్తరీ కాదు, పూల పానుపూ కాదు. ఆయన జీవితం అక్షరాలా జీవన సమరమే. ఆ సమరాన్ని ఆయన ముళ్ల బాట అనుకోలేదు. ఆయన కర్మవాది. ఫలితం గురించి ఎన్నడూ పట్టించుకోలేదు. సత్ఫలితాల కోసమే పాకులాడే వారు అయి ఉంటే ఆయన ఆత్మకథ గురించి మాట్లాడుకోవాల్సిన అవసరమే ఉండేది కాదు.

హంపి నుంచి హరప్పా దాకలో ఆయన స్వోత్కర్ష దోషప్రకరణగానైనా చేరలేదు. తన గురించి ఏమాత్రం గొప్పలు చెప్పుకోకుండా ఆ గ్రంథాన్ని గొప్పగా దిద్ది తీర్చారు. ఆత్మకథలు, జీవిత చరిత్రలు కల్పనా సాహిత్యంలాగా హాయిగొల్పకపోవచ్చు. కాలక్షేపానికి ఉపకరించవు. అయితే కల్పనా సాహిత్యంలో ఉండే కథనాత్మక శైలి ఉంటే చదివించే గుణం ఇనుమడిస్తుంది. రామచంద్ర ఆత్మకథ హాయిగా చదువుకోవడానికే గాక ఆలోచించడానికీ ప్రేరేపిస్తుంది. హంపీ నుంచి హరప్పా దాక తెలుగువారి చిర సంచిత వాస్తవికతా నిధినిక్షేపంలో అంతర్భాగం.

తిరుమల రామచంద్ర మాట వరసకు మాత్రమే ప్రాచీన అర్వాచీనతలకు మధ్య వారధి కారు. సంస్కృత, ప్రాకృతాలతోబాటు కన్నడం, తమిళం, తెలుగు, హిందీ, ఇంగ్లీష్ భాషల్లో నిష్ణాతుడైన రామచంద్ర ప్రాచీన అర్వాచీన లాక్షణికులు చెప్పిన కావ్యాదర్శాలను ఆపోశన పట్టి వాటిలో మేలెంతో తాలెంతో వింగడించి

సమన్వయపరిచిన ధీశాలి. సాహిత్య నిర్వచనాల విషయంలో ఆయనకు ప్రాచీనుల నిర్వచనాలు ఎంత బాగా తెలుసో సాహిత్య ప్రయోజనం గురించి ఆధునికుల భావనలపైన అంతే అవగాహన ఉంది. ప్రాచీన సాహిత్య పరిజ్ఞానాన్ని ఆయన తన సృజనకు పునాదిగానే తీసుకుని ఆధునిక ప్రయోజన దృష్టితో సాహితీ సౌధాన్ని నిర్మించారు. అందుకే ఆయన తన ఆత్మ కథలోని 61 ప్రకరణాల ఆద్యంతాల్లో సంస్కృత ప్రాకృత శ్లోకాలను ఆధునిక కాలంలో తన జీవిత గమనాన్ని వివరించడానికి సందర్భోచితంగా మాత్రమే ఉదాహరించారు తప్ప తన పాండితీ ప్రదర్శనకు ఎక్కడా వాడుకోలేదు.

తిరుమల రామచంద్రది కొట్టొచ్చినట్టు కనిపించే శరీరాకృతి కాదు. ముతక ఖద్దరు వేషధారణలో ఊర్ధ్వ పుండ్రాలతో చాలా సాదా సీదాగా కనిపించేవారు. ఆయనది మహా పండితుడన్న అనుమానమైనా కలగనివ్వని నిరాడంబర స్వరూపం. ఆయన ఆత్మ కథ ఆయన నిజ జీవితానికి ఏ మాత్రం సవరణలు లేని నకలు మాత్రమే. ఆయన ఎప్పుడూ ఊర్ధ్వ పుండ్రాలతోనే కనిపించేవారు. అయితే చిన్నప్పుడు తప్ప ఎప్పుడూ దేవుడికి మొక్కిన పాపాన పోలేదు. అలాగని ఆయన నిరీశ్వర వాది కాదు. దైవ భక్తి ఆయనకు ప్రదర్శించదగిన ఉపకరణం కాలేదు. బౌద్ధం మీద అభిమానం ఉండేది. సంప్రదాయాన్ని ఉల్లంఘించిన సందర్భాలు ఆయన జీవితంలో కనిపించకపోయినా హేతుబద్ధమైన ఆలోచనా సరళి ఆత్మ కథలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

ఆయన జీవితంలో వైరుధ్యాలూ ఉన్నా అది చాలా వైవిధ్యభరితమైంది. వారాలు చేసుకుని చదువుకున్నారు. ఈ ఆత్మకథలో ఆయన ప్రసంగవశాత్తు కనిపించాల్సిందే. తాను సంచరించిన ప్రదేశాల సంస్కృతి, సంప్రదాయాలతో పాటు తానెరిగిన మనుషుల స్వభావాలు, వారి వ్యక్తిత్వాల్లోని ఉదాత్తత మాత్రం అడుగడుగునా ప్రతిఫలిస్తాయి.

ఆత్మకథ చెప్పడానికి ఆయన ఎన్నుకున్న పద్ధతి కథన శైలి. ప్రతి అంశాన్నీ అందమైన రీతిలో కథ చెప్పినట్టుగా చెప్తారు. ఆ కథన రీతి పాఠకుడిని చివరిదాకా లాక్కెళుతుంది. ఈ రచన మొదట ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ధారావాహికగా వెలువడింది. వార పత్రికల్లో వెలువడే సీరియల్ నవలలకు ఆయువు పట్టు ముందు ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠ రేపడం. అయితే రామచంద్ర ఆత్మకథ ఉత్కంఠను మించిన జిజ్ఞాసను ప్రేరేపిస్తుంది. ధారావాహికంగా వెలువడినప్పుడు చదివిన వారి

జిజ్ఞాసకూ, గ్రంథ రూపంలో వెలువడిన హంపీ నుంచి హరప్పా దాక కలిగించే జిజ్ఞాసకూ అంతరం లేదు.

విద్యార్జన కోసం, జ్ఞాన పిపాస తీర్చుకోవడానికి, జీవిక కోసం రామచంద్ర అనేక ప్రాంతాలలో సంచరించారు, నివసించారు. అయితే ఆ ప్రాంతాలలోని జన జీవన సరళిని జీవన వైవిధ్యాన్ని, వైరుధ్యాలను, అలవాట్లను, సంప్రదాయాలను అవగతం చేసుకుని వాటిని జనరంజక రీతిలో వివరించారు. ఈ క్రమంలో మనకు తెలియని అనేక విషయాలు తెలియడంతోపాటు మన సంస్కృతిలో లుప్తమైన అనేక అంశాలు గ్రహించ గలుగుతాం. తెలుగువారు కాయగూరలు విరివిగానే వాడతారు. అయితే కొన్నింటిని మనం కొన్ని పద్ధతుల్లోనే వినియోగిస్తాం. మనం ఆవాలు విరివిగానే వాడినా అది తాళింపుకే పరిమితం. ఉత్తరాది వారు ఆవ మొక్కలను కూర వండుకుంటారు. దాన్ని సర్సోంకా సాగ్ అంటారు. అలాగే మనం మరిచిపోయిన అనేక వంటకాల పేర్లు ఈ ఆత్మ కథలో కనిపిస్తాయి.

శిష్య సంచారం వెళ్లడం రామచంద్ర కుటుంబ సంప్రదాయంలో భాగం. చిన్న నాట ఆయనకు ఈ అనుభవం దక్కింది. ఆ సమయంలో వంటలను వర్ణించిన తీరు చూస్తే మనం తినడం మానేసిన తిళ్లు, వదలించుకున్న సంప్రదాయాల వివరం తెలుస్తుంది. "బొబ్బట్లు, పూర్ణం కుడుములు, వడలు, అతి రసాలు, పులిహోర, చక్కెర పొంగలి, ఉప్పు పొంగలి, దధ్యోదనం" మొదలైనవి శిష్య సంచారంలో భాగంగా తన తల్లి వండేదని రాశారు. వీటిలో అన్నీ ఇప్పుడు అందరికీ తెలియక పోవచ్చు. కొన్ని పూర్తిగా అంతర్థానం అయిపోయి ఉండొచ్చు. మరికొన్ని నిర్దిష్ట సామాజిక వర్గాలలో ఇప్పటికీ మిగిలి వుండొచ్చు. ఇలాంటి పిండి వంటల్ని మనలో చాలా మందిమి స్వగృహా ఫుడ్స్‌కు అప్పగించేశాం.

మొదటి ప్రకరణకు ఆయన పెట్టిన 'గుండ్రాయి చెప్పిన గాథ'. వాళ్లింట్లో ఒక సగం విరిగిన ఇనుపగుండు ఉండేదట. దాన్ని ఏదైనా పిండి కొట్టడానికి వాడేవారు. ఆ గుండు సగం ఎలా విరిగింది, ఇనుప గుండును అందరూ వాడతారా, ఇది మా ఇంట్లోనేనా అన్న ప్రశ్నలు రామచంద్ర మనసును తొలుస్తూ ఉంటే ఆ వివరం తల్లిని అడిగితే ఆ వివరణ ఆయనకు సంతృప్తి కలిగించకపోతే ఆమె తాతగారిని అడుగు అని చెప్పారట. తాత గారు గుండ్రాయి గాథను వివరించారు. అదే రామచంద్ర కుటుంబ గాథ. ఇలా ఒక అల్పమైన విషయాన్ని ఆధారంగా చేసుకుని గుండ్రాయిని

ఎందుకు వాడే వారో వివరించడంతో పాటు దాని ఆధారంగానే తమ కుటుంబ చరిత్రను వివరించడం ఆయన కథనాత్మక పద్ధతికి మచ్చుతునక.

“విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నమైన తర్వాత మా పూర్వులను విజయసాగర సార్వభౌములకు సైనికులుగా ఒదిగించే తాడిమర్రి పాలకుల ఆదరించి, గురువులుగా గౌరవించారు. తాడిమర్రి అనంతపురం జిల్లాలో ఉన్న రాజ్యం. పాలకులు‘వ్యాధులు’. “వ్యాధులు మహావీరులు” అని ప్రారంభించి వ్యధ శబ్దం వ్యామ, వాయ, బాయ, బోయ అయి, తెలుగులో బోయ అని స్థిరపడిన వైనాన్ని వివరించారు. వీరు తెలుగునాడులోని బళ్ళారి, అనంతపురం, కర్నూలు, చిత్తూరు, కర్నాటకలోని గుల్బర్గా, రాయచూరు, కోలారు, చిత్రదుర్గ, తుముకూరు, తమిళనాడులోని ఉత్తర ఆర్కాట్, చెంగల్పట్టు జిల్లాల్లో ఉంటారనీ రాజ్యాలు కనుమరుగైన తర్వాత వీర జాతికి చెందిన వీరు చిన్న చిన్న పాలెగారులుగా మిగిలిన వైనాన్ని చెప్పారు. ఈ బోయలు ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం కన్నా ముందే బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించారని తెలుగునాట స్వాతంత్ర్య పోరాట చరిత్ర మూలాలను రూపుకట్టించారు. ఈ రకంగా రామచంద్ర తన కథ చెప్పే సాకుతో మన కథే వివరించారు. ఇలాంటి సందర్భాలు ఈ గ్రంథంలో అడుగడుగునా కనిపిస్తాయి.

గొప్పవారి జన్మ వృత్తాంతాలు వివరించేటప్పుడు సాధారణంగా “పూవు పుట్టగానే పరిమళించినట్టు” లాంటి అతిశయోక్తులను వాడడం పరిపాటి. ఆత్మ కథల్లో ఇలాంటి వర్ణనలే స్వోత్కర్ష కింద కొట్టి పారేయదగిన జాబితాలో చేరుతాయి. రామచంద్రకు ఎంతటి ధీశక్తి ఉందో దానికి అనేక రెట్లు ఎక్కువ అణకువ ఉంది. తాను జన్మించిన తీరును ఎలా చెప్పారో చూడండి. “నేను మా మాతామహుల ఇంట్లో పుట్టాను. నేను పుట్టినప్పుడు దేవ దుందుభులు మోగలేదు. పుష్ప వర్షాలు కురియలేదు. ప్రసన్న సుగంధ గంధవాహాలు వీయలేదు. అట్లని భయంకరంగా పిడుగులు పడలేదు. భూమి కంపించలేదు. గిరులు దుల్లలేదు. ఉల్కలు రాలలేదు. తోకచుక్క అసలే కనిపించలేదు.” అని చెప్పడంతో తన జన్మ అత్యంత సహజమైందేనన్న అణకువతో పాటు అతిశయోక్తుల మీద ఆయనకున్న ఒళ్లుమంట తీవ్రత కూడా వ్యక్తం అవుతుంది.

మూఢ నమ్మకాలను పరాస్తం చేయడానికి ఒక్కొక్క సారి ఎంతటి హేతువాదమైనా వీగిపోవచ్చు. అరిష్టం అనుకునే సంఘటనలు యాదృచ్ఛికంగా జరిగినప్పుడు మూఢ నమ్మకాలు లేనివారికి కూడా ఆ సంఘటనలను హేతుబద్ధంగా వివరించడం అసాధ్యం

కావచ్చు. ఆ దశలోనే పిడివాదం రంగ ప్రవేశం చేసి హేతువును బలిగొంటుంది. ఈ సంకట స్థితి నుంచి బయట పడడానికి రామచంద్ర అనుసరించిన వ్యూహం ఆశ్చర్యకరం. "మా మాతా మహుడు ఏదో జబ్బుతో ఉన్నట్టున్నారు. బయటి వసారాలో ఆయన పడక, ఆయన లోపలికి రాబోయారట. నేను తుమ్మానటా. నా వయస్సు ఆరు నెలలట. "తాడిమర్రి సంస్థాన గురువు తుమ్మాడు. నేను లోపలికి రాగూడదు" అని అలాగే వుండిపోయారట. జబ్బు ముదిరింది. ఆయన లోపలికి అడుగు పెట్టకనే పరమపదించారట. జ్యేష్ఠ నక్షత్రంలో జననం ఇంటి పెద్దను బలి తీసుకుంటుంది అని మా అమ్మ అనేది. నేను త్రిజ్యేష్ఠం అందులోను, జ్యేష్ఠ పుత్రుణ్ణి, జ్యేష్ఠ నక్షత్రం, జ్యేష్ఠ మాసం". అంతే రామచంద్ర చెప్పిన వివరం. మూఢనమ్మకం ఏమిటో చెప్తూనే దాన్ని పరాస్తం చేయడానికి కావాల్సిన సరంజామా తన దగ్గర లేనప్పుడు ఏ పక్షాన పిడివాదం ప్రదర్శించకుండా వ్యాఖ్యాన రహితంగా తన అభిప్రాయంగా, అన్యాపదేశంగా వ్యక్తపరచడానికి ఎంత గుండె దిటవుండాలో!

అనంతపురం జిల్లా కమలాపురం తిరుమల రామచంద్ర సొంత ఊరు. ఆ ఊరి పేరు కమలాపురమైన కడప జిల్లాలోనూ అదే పేరున మరో ఊరు ఉన్నందు వల్ల తమ గ్రామాన్ని కామలాపురం అని వ్యవహరించే వారని ఆ గ్రామాన్నీ వర్ణించారు.

అనేగొంది, నెల్లూరు, తిరుపతిలో చదువుకున్నారు. ఈ ప్రాంతాలలో ఉన్న విశేషాలన్నింటినీ, మరీ ముఖ్యంగా ఆ ప్రాంతవాసులైన వారు కూడా ఎన్నడూ పట్టించుకోని వివరాలను తన విషయసేకరణా సామర్థ్యాన్ని వినియోగించి చెప్పారు.

మద్రాసు, అలహాబాద్, లాక్నో, లాహోర్ లాంటి చోట్ల రకరకాల ఉద్యోగాలు చేసి డెయిలీ టెలిగ్రాఫ్‌తో మొదలుపెట్టి అనేక పత్రికలలో పని చేశారు. చివరకు హైదరాబాద్ చేరారు. కానీ ఆయన ఆత్మకథ రచన డెయిలీ టెలిగ్రాఫ్ ఉద్యోగంతోనే ముగిసినందువల్ల ఆ తర్వాతి వివరాలేవి ఈ గ్రంథంలో చేరలేదు.

ఆయన గాంధేయవాది. కానీ విప్లవకార్యక్రమాల్లో భాగస్వామి. గాంధీ సారథ్యంలో సాగిన జాతీయోద్యమం సంపూర్ణంగా అహింసాయుతమైంది కాదు అని రామచంద్ర లాంటి వారి విప్లవ కార్యక్రమాలు నిరూపిస్తాయి. 1923లో కాకినాడలో కాంగ్రెస్ మహాసభకు తన పిన తండ్రితో పాటు రామచంద్ర కూడా వెళ్ళారు. ఆ మహాసభల్లో సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా కొనసాగించాలని తీర్మానించారు. ఆ నిర్ణయం ఆయన మనసుకు హత్తుకు పోవడమే కాక 1926-27 నాటికి మహా

వటవృక్షమయింది. విదేశీ వస్త్ర దహనం లాంటి వాటిలో చురుగ్గా పాల్గొన్నారు. ఖద్దరు అమ్మారు. తిరుపతిలో గోవిందరాజుస్వామి మహాద్వార గోపురంపై త్రివర్ణ పతాకం ఎగుర వేయడానికి విఫలయత్నం చేశారు. చివరకు కళాశాల ఉన్న నమ్మాళ్వార్ సన్నిధి గోపురం పైన త్రివర్ణ పతాకాన్ని ఎగురవేశారు. కరపత్రాలు పోలీసు స్టేషన్‌లో కూడా పంచి అరెస్టయి ఏడాది పాటు కారాగార శిక్ష అనుభవించారు. తన లోపాలనూ రామచంద్ర దాచుకోకుండా రాశారు. చిన్న చిన్న దొంగతనాలు ఎలా చేసిందీ ఏయే సందర్భాలలో బుద్ధి ఎలా వక్రమార్గం పట్టిందో కూడా రాశారు. తన గురువులు ఎంత గొప్పవారో చెప్పారు. రైట్ ఆనరబుల్ కోలాచలం వెంకట్రావ్, డాక్టర్ రఘువీర, రూపనగుడి నారాయణ రావు, వావిలకొలను సుబ్బారావు, మానవల్లి రామకృష్ణ కవి, డాక్టర్ వాసూరావ్, వేటూరి ప్రభాకర శాస్త్రి, కాశీనాథుని నాగేశ్వర రావు గురించి ఆయన రాసిన తీరు వారి అసాధారణ వ్యక్తిత్వాలు ఎంత మహత్తరమైనవో తెలియజేస్తుంది.

తిరుమల రామచంద్ర ఏం రాసినా తన పేరు కింద భాషాసేవకుడు అని రాసుకునే వారు. ఇది తనకు తాను తగిలించుకున్న భుజకీర్తి కాదు. ఆచరించి చూపిన ఆదర్శం. హంపి నుంచి హరప్పా దాకలో మనం మరిచిపోయిన బోలెడు తెలుగుమాటలు తారసపడతాయి. ఇంగ్లీషు పదాల బదులు తెలుగే వాడాలన్న నియమమున్న వారికి చప్పున తెలుగు మాటలు తట్టకపోవచ్చు. ఈ గ్రంథంలో వారందరికీ మార్గ దర్శకాలు వెతక్కుండానే దొరుకుతాయి. ప్రిన్స్‌పాల్‌ను ప్రాంశు పాలుడు అనీ శాడిజంను పరబాధాకరణ అనీ అబ్రీవియేషన్‌ను పుటాక్షరాలు అనీ అన్నారు. నిక్కర్‌కు తెలుగేమిటో తట్టక తల్లడిల్లే వారికి ఆయన వాడిన తెలుగు మాట చల్లడం. తిరుపగూడలు,ముంజుగడ్డి, హరిగోలు, పడసాల, ధావళీ, ఉగ్రాణం గది, వీరగల్లు, అడపం, దుద్దుకంబళి, గవనులు, బచ్చన బొమ్మలు, చుబ్బన చూరలు, ఓడిక లాంటి తెలుగు పద సంపద అపారంగా దొరుకుతుంది. లడ్డూల్లో గుంజా లడ్డు, సుర్మా లడ్డు, బూందీ లడ్డు, రవ్వ లడ్డు అని డజన్ రకాలున్నాయని జాబితా ఇచ్చారు.

హంపీ నుంచి హరప్పా దాక కేవలం ఆత్మకథ కాదు. అది ఆ నాటి సామాజిక, రాజకీయ పరిస్థితుల చిట్టా. విద్యా వ్యవస్థకు ఆనవాలు. వ్యక్తుల ఔన్నత్య వ్యక్తీకరణ సంపుటి. సాహిత్య రంగానికి దర్పణం. మనం కోల్పోయిన తెలుగుదనాన్ని, తెలుగు ప్రాంతాలను పట్టి చూపించే కాగడా.

ఆయన కారాగారవాసం అనుభవించినప్పుడు ఎందరో మహామహుల సాహచర్యమూ లభించింది. కామరాజ్ నాడార్, ఏ.కె. గోపాలన్, నారాయణ నంబియార్, స్వామీ నిత్యానంద, మద్దూరి అన్నపూర్ణయ్య లాంటి వారితో జైలులో సహజీవనం సాగించారు. రామచంద్ర కూటి కోసం కోటి విద్యలు అభ్యసించాల్సి వచ్చింది. సైన్యంలో హవల్దార్ క్లర్క్‌గా బలూచిస్తాన్, క్వెట్టా, యెమన్ లాంటి చోట్ల పని చేశారు. ఒరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో కాపీయిస్టుగా, తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో పండితునిగా, లాహోర్ విశ్వవిద్యాలయంలో తాళ పత్రాల సూచీకర్తగా, అక్కడే ఒక రోల్డ్ గోల్డ్ కంపెనీలో గుమాస్తాగా, హైస్కూల్‌లో హిందీ ఉపాధ్యాయుడిగా, మద్రాస్ లో హోటళ్లలో కార్మికునిగా రకరకాల ఉద్యోగాలు చేశారు. మిత్రుడు అచ్చన్ సింఘ్‌కు సహాయం చేయబోయి కోర్ట్ మార్షల్‌కు గురయ్యారు. సనాతన రూపంలో కనిపించే రామచంద్ర స్వభావ రీత్యా ఆధునికుడు. స్వతహాగా హేతువాది, నాస్తికుడు అయినా దేవాలయాల్లో పూజలూ చేయాల్సి వచ్చింది. ఉన్నవ లక్ష్మీనారాయణ వద్ద సహాయకునిగా పౌరోహిత్యమూ చేశారు. ఈ ప్రభావాలన్నీ ఆయన జీవితాన్ని అంతులేని నిమ్నోన్నతాలకు తీసుకెళ్లినా ఆ ప్రభావం ఆయన జీవితాన్ని సుసంపన్నం చేసింది. ఒక రకంగా ఆయన దేశదిమ్మరే. ఆ కష్టాలు పడ్డది ఆయనే. ఫలితం మాత్రం మన జాతికి అందింది.

ఈ ఆత్మ కథలో 1917 నుంచి 1944 వరకు రామచంద్ర జీవితం మాత్రమే ప్రతి ఫలిస్తుంది. ఆ తర్వాత అర్ధ శతాబ్ది వివరాలు గ్రంథస్థం కానే లేదు. ఆ సుదీర్ఘ ప్రయాణ వివరాలూ క్రోడికరించగలిగితే తెలుగు జీవితంలో ఒక పార్శ్వానికి అద్దంపట్టినట్టే.

--------

# తిరుమల రామచంద్ర సాహిత్య వ్యాసాలు

- భాస్కరం కల్లూరి

తిరుమల రామచంద్రగారు భౌతికంగా నూరేళ్ళు జీవించిఉండకపోవచ్చు. ఒక రసపిపాసిగా, జిజ్ఞాసిగా, పండితునిగా, సాహితీ సుగతునిగా, పరిశోధకునిగా నిండు నూరేళ్ళ జీవితాన్ని ఆయన అనుభవించి ఆస్వాదించారు. ఆయన రచనలు నుంచే కాక వారితో నాకున్న స్వల్ప వ్యక్తిగత పరిచయం నుంచి కూడా నేను ఈ మాట అంటున్నాను. ఎనభై దశకంలో నేను ఆంధ్రప్రభ దినపత్రికలో పనిచేస్తున్నప్పుడు ఆయన తరచు కార్యాలయానికి వస్తుండేవారు. పత్రికకు సాహిత్య, సాంస్కృతిక విషయాలను రిపోర్ట్ చేస్తూ ఉండేవారని జ్ఞాపకం. ఆయన అప్పటికి "హంపీ నుంచి హరప్పా దాక"... రాసినట్టు లేదు. కానీ ఎప్పుడు కనిపించినా, ఒక నిత్య సంచారి. కాసేపు ఒక చెట్టు కింద ఆగినట్టుగానే తోచేవారు. కాకతాళీయం కావచ్చు, అప్పుడు మా ఆంధ్రప్రభ కార్యాలయం ఆవరణలో ఒక పెద్ద చెట్టు కూడా ఉండేది. రామచంద్రగారి ఆహార్యం చాలా సాదాసీదాగా ఉండేది. కానీ ఆయన చూపుల్లో గొప్ప జిజ్ఞాస పొంగిపొర్లుతూ ఉండేది. నేను వారిని అంతకుముందే చూశాను. తనకంటే పెద్ద అయిన మా నాన్నగారు, సుప్రసిద్ధ కవి పండితులు, అష్టాదశపురాణాల ఆంధ్రీకర్త కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు గారిని కలుసుకోడానికి ఆయన మా ఇంటికి కొన్నిసార్లు వచ్చారు. మొదటిసారి వచ్చినప్పుడు ఒక సెలెబ్రిటీ మన ఇంటికి వచ్చినప్పుడు కలిగే సంభ్రమాశ్చర్యాలను నేను అనుభవించాను. తిరుమల రామచంద్రగారి పేరు, ఆయన రచనల పేర్లు భారతి తదితర పత్రికల ద్వారా నాకు చిన్నప్పటి నుంచీ తెలుసు. నా దృష్టిలో ఆయన ఒక సాహితీ సెలెబ్రిటీ. మొదటిసారి చూసినప్పుడే ఆయన వ్యక్తిత్వంలోని కొన్ని పార్శ్వాలు నాకు అర్థమయ్యాయి. తనకంటే పెద్దగా మా

నాన్నగారి పట్ల ఆయన అమితమైన గౌరవాన్ని చాటుకునే వారు. ప్రత్యేకించి మా నాన్నగారు ఆ వయసులో కూడా సంపూర్ణమైన ఆరోగ్యంతో ఉండడం, సారస్వత వ్యాసంగంలో నిమగ్నులై ఉండడం ఆయనలో ఎంతో ఆసక్తినీ, ఆశ్చర్యాన్నీ రేకెత్తిస్తూ ఉండేవి. వాటిని ఆయన మెరిసే చూపులతో పదేపదే ప్రకటించుకునే వారు. విశేషమేమిటంటే, రామచంద్రగారు కూడా నాకు అలాగే కనిపించేవారు. "సాహితీ సుగతుని స్వగతం" అనే వారి వ్యాససంపుటిలో దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు గారి గురించి రాస్తూ, ఆయనను తను కలుసుకోవడం, ఆయనతో మాట్లాడడం ఎంతో అపురూపంగా, అద్భుత ఘటనగా రామచంద్రగారు చిత్రించుకున్నారు. రామచంద్రగారిని వ్యక్తిగతంగా ఎరిగి వారితో మాట్లాడగలగడం నాకూ అంతటి అపురూపమూ, అద్భుతమే.

నిజానికి తన కాలం నాటి పండిత దిగ్గజాలు అందరి పట్ల రామచంద్రగారిలో విశేష గౌరవాభిమానాలు, వారితో మాట్లాడడంలో ఒక మెరుపు, మైమరపు ఉండేవని 'సాహితీ సుగతుని స్వగతం' లోని వ్యాసాలు అనేకం వెల్లడిస్తాయి. అందులో వేటూరి ప్రభాకర శాస్త్రి గారి గురించి పలుసార్లు వచ్చిన ప్రస్తావనలో అదే కనిపిస్తుంది. సమకాలీన పండిత ప్రముఖుల అభిప్రాయాలతో తను విభేదించేటప్పుడు కూడా వారిపై గౌరవాభిమానాలు ఏ కొంచెం చెక్కు చెదరక పోవడం ఆయన వ్యక్తిత్వంలో ప్రత్యేకించి మనల్ని ఆకట్టుకునే కోణం. ఈ సందర్భంలో చిలుకూరి నారాయణరావు గారితో ఆయన జరిపిన సంభాషణే కాక, దానిని ఆయన చిత్రించిన తీరు కూడా ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటుంది. "నిన్ను చూస్తే తందామనిపిస్తోందోయ్" అని రామచంద్రగారితో చిలుకూరి వారు అన్న మాటతో ఈ వ్యాసం ప్రారంభమవుతుంది. అప్పుడు చిలుకూరివారు మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో రైలు ఎక్కబోతున్నారు. 'అంతటి అపరాధం నేనేం చేశానండీ? అని రామచంద్రగారు ప్రశ్నించారు. 'సంస్కృత ప్రాకృత సాహిత్యాలకే ద్రోహం తలపెట్టావు. గాథాసప్తశతిలో తెలుగు పదాలు చేరాయని రాశావు. ఈ ప్రతిలోమాన్ని ఎవరు సహిస్తారు? అని చిలుకూరివారు ఉద్రేకపడ్డారు. రామచంద్రగారు తన వాదాన్ని వినిపించడం ప్రారంభించేసరికి, 'ఉండవయ్యా, బండెక్కి కూర్చుని మాట్లాడుకుందాం, బండి కదిలే సరికి దిగుదువు కాని' అని చిలుకూరి వారు రామచంద్రగారిని బండి ఎక్కించారు.

తెలుగు సంస్కృత భాషాజన్యమని సిద్ధాంతీకరించే చిలుకూరివారు కొన్ని దేశిపదాలు ప్రాకృతం నుంచి సంస్కృతంలోకి వెళ్ళాయనే వాదాన్ని సహించలేకపోయారు.

రైల్లో కూర్చున్న తర్వాత ద్రావిడ భాషా శాస్త్రజ్ఞులపై ఒక్క ఊపున విరుచుకుపడ్డారు. అప్పుడు రామచంద్రగారు ఆచార్య హేమచంద్రుడు ప్రాకృతంలోకి చేరినవిగా తన దేశినామమాలలో దండగుచ్చిన దేశి పదాలను ఒక్కొక్కటే ఏకరవు పెడుతూ వెళ్ళారు. బండి అరక్కోణం స్టేషన్‌లో ఆగినప్పుడు కానీ తెలియలేదు, ఎంతసేపు అయిందో! "అయ్యో కొంప మునిగింది నేను టిక్కెట్టు లేకుండా రైలెక్కాను" అన్నారు రామచంద్రగారు. చూశావా? నీకిదే శిక్ష. తెల్లవారుజాము బండి ఎక్కి మద్రాసు చేరుకో, మరోసారి పోట్లాడుకుందాం" అని చిలుకూరివారు ముక్తాయించారు.

మౌలికంగా రామచంద్రగారు సంస్కృతాంధ్రప్రాకృతాది భాషాలలో ధిషణ, శబ్దార్థ పరిశీలన, సాధుత్వ అసాధుత్వాల చర్చ, పాఠ విమర్శ, వ్యాఖ్యాన సంప్రదాయాలకు చెందిన పండిత వారసత్వం నుంచి వచ్చినవారు. స్థలకాలాలను కూడా మరచిపోయి హోరాహోరీ పండిత చర్చలు సాగిన బంగారు కాలానికి చెందిన వారు. సాహితీ సుగతుని స్వగతంలోని అనేక వ్యాసాలు అందుకు సాక్ష్యమిస్తాయి. ముద్రణ సౌకర్యం వెలుగులో అనేక ప్రాచీన కృతులను తాళపత్ర పుస్తక భాండాగారం నుంచి వెలికి తీసి, పరిష్కరించి, శుద్ధ ప్రతులు తయారు చేసి ప్రచురణయోగ్యం చేసే పని పెద్ద ఎత్తున సాగిన కాలం అది. సంస్కృతాంధ్రాలలో విద్వత్తు మాత్రమే కాక, ప్రాకృతం, హిందీ, తమిళం, కన్నడాలలో కూడా గాఢమైన పరిచయం ఉన్న రామచంద్రగారు స్వయంగా మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలోనూ, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలోనూ పండితునిగా పని చేశారు. మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి గార్ల వద్ద ప్రాకృతాంధ్ర భాషా పరిశోధకులుగా శిష్యరికం చేశారు. ఆ తర్వాత పత్రికా రచయితగానూ జీవనం సాగించారు. పండితునిగా, పరిశోధకునిగా ఆయన లోతును పట్టి చూపే ఉదాహరణలలో వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి గారి అభిప్రాయాన్ని ఖండించిన సందర్భం ఒకటి. ద్విపదలో ఇతరులెవరూ పాటించని ప్రాసయతిని పాల్కురికి సోమనాథుడు పాటించాడనీ; రంగనాథరామాయణంలో కానీ, గౌరన హరిశ్చంద్ర చరిత్రలో కానీ ప్రాసయతీ ఎక్కడా కనబడదనీ బసవపురాణ పీఠికలో వేటూరి ప్రభాకరశాస్త్రి గారు అనడాన్ని వజ్ఝలవారు పూర్వ పక్షం చేశారు. రంగనాథ రామాయణంలో కూడా ప్రాసయతిని వాడారంటూ కొన్ని ఉదాహరణలు ఇచ్చారు. దానిపై రామచంద్రగారు స్పందిస్తూ, ఏడువేల ద్విపదలున్న సోమనాథుని గ్రంథంలో ప్రాసయతులు వేలకొలదిగా ఉండగా; పదహారువేల ద్విపదలున్న రంగానాథ రామాయణంలో వేళ్ళతో లెక్కించదగిన చోట్లలోనే ప్రాసయతి కనిపిస్తోందని; అవి కూడా లేఖక ప్రమాదం వల్ల కావచ్చుననీ సోదాహరణంగా నిరూపించారు.

వేదం వెంకటరాయశాస్త్రిగారిని పూర్వ పక్షం చేసిన ఉదాహరణ రామచంద్రగారి బహుముఖీన పాండిత్యానికి మరో మచ్చుతునక. శ్రీనాథుని శృంగార నైషధంలోని ఒక పద్యంలో "నూటిడి" అనే ప్రయోగాన్ని వేదం వారు "నూబిడి" అని సవరించారు. ఆ సవరణ వల్ల "నూబిడి కాదు; నూటిడి"యే నని ప్రతిభావంతంగా నిరూపించారు. నూటిడి అంటే చిమ్మిలి లాంటి తినుబండారమనీ, అందులోని "ఇడి" అంటే పిండి అనీ, తమిళంలోని ఇడియప్పం, ఇడియాప్పం, ఇడ్డిలి మొదలైనవి దీని నుంచి వచ్చినవేననీ, కుడుముల్లోనూ, కజ్జికాయల్లోనూ పెట్టే పూర్ణాన్ని కన్నడంలో ఇడి అంటారనీ ఆయన ఉదహరించారు.

కేతన తన ఆంధ్ర భాషాభూషణం రచించడంలో నాగవర్మ రచించిన కర్ణాటక భాషా భూషణాన్ని అనుసరించాడని సోదాహరణంగా రామచంద్రగారు నిరూపించడం ఆయన కన్నడ భాషా పాండిత్యాన్ని వెల్లడిస్తుంది. ఈ సందర్భంలో ఆయన తెలుగు, కన్నడాల చుట్టరికం ఈనాటిది కాదంటూ, మన ప్రాచీనులందరూ కన్నడాది భాషలు వచ్చినవారే" నన్న వేటూరి వారి మాటను ఉదహరిస్తారు. విద్వత్తుతోపాటు లోకజ్ఞతను చాటుతూ ఆయా పలుకుబడుల చారిత్రక మూలాలను తడిమి చూడడంలో రామచంద్రగారి ఆసక్తిని పట్టి చూపే మరో వ్యాసం "నూరు, నూట ఎనిమిది,నూట పదహారు". నూట పదహారు అనే ప్రయోగం ఎందువల్ల ప్రాచుర్యంలోకి వచ్చిందో వివిధ కోణాల నుంచి ఆయన చర్చిస్తూ; ఈ మాట వేల ఏళ్ళ నాటిదేనని స్పష్టమవుతుందనీ, మొహంజదారో తవ్వకాలలో దొరికిన ప్రాచీన జాతి వారి గృహోపకరణాలలో దువ్వెన కూడా ఒకటి ఉందనీ, దాని పళ్ళు నూట పదహారు ఉన్నట్లు ఇండియన్ యాంటిక్వెరీలో ఒక పండితుడు రాశారనీ అంటారు. అలాగే, ఛాందోగ్యోపనిషత్తులో నూట పదహారు సంవత్సరాల అయుస్సుకోసం పలుపాట్లు పడినట్లు చెప్పే మంత్రాలు ఉన్నాయంటూ వాటిని ఉదహరించారు. సాధారణంగా ఆకాలపు పండితులలో కనిపించని విషయ వైవిధ్యమూ, ఆలోచనా వైశాల్యమూ రామచంద్రగారిలో కనిపించి ఆశ్చర్యచకితం చేస్తాయి. ఎంతో మంది సంప్రదాయ పండితులకు భిన్నంగా ఆయన నూతన ఆలోచనాధారకు దగ్గరగా ఉంటారు. ఆధునిక సాహిత్య ప్రక్రియలపై సహృదయతను చాటుతూ వాటిని విశ్లేషించడం ఒకటైతే; "సమాజశ్రేయస్సు- తృతీయపురుషార్థం" అనే వ్యాసంలో లైంగిక విజ్ఞానాన్ని ఒక శాస్త్రదృష్టితో, ఏమాత్రం బిడియం లేకుండా ఆయన చర్చిస్తారు. అదే సమయంలో లైంగిక నిగ్రహం, కట్టుబాటు ఎంత అవసరమో కూడా నొక్కి చెబుతారు, లైంగిక

క్రియలో దంపతులిద్దరికీ సమానమైన సుఖం కావాలనీ; వయసు వస్తున్న దశలోనే సెక్స్ విజ్ఞానం అందించాలనీ అంటారు. మధ్యయుగాలకు ముందు కామప్రవృత్తి నిషిద్ధమేమీ కాదనీ, సెక్స్ సమస్యే కాదనీ, సెక్స్‌ను సభ్యంగా, సహజంగా చూసిన గాథలు పురాణేతిహాసాలలో ఎన్నో ఉన్నాయనే ఒక ఆలోచనీయమైన వ్యాఖ్యను మెరుపులా మెరిపిస్తారు. దేవాలయాలపై బూతు బొమ్మలు, పండుగ పబ్బాలలో శృంగార చేష్టలే కాక; కొన్ని గర్భాదాన మంత్రాలు కూడా సెక్స్ విజ్ఞానానికి ఉద్దేశించినవేనని ఆయన సోదాహరణంగా పేర్కొంటారు. అలాగు, నేటి కుటుంబ నియంత్రణ పద్ధతులకు సమర్థనగా, వేదంలోనూ, ఆయుర్వేదంలోను గర్భ నిరోధాన్ని చెప్పారని ససాక్ష్యంగా ఆయన వివరిస్తారు. రామచంద్రగారిలోని విషయవైవిధ్యానికి మరో ఉదాహరణ, బుద్ధునికి ముందునుంచే ధూమపానం వుందని తెలిపే వ్యాసం. అయితే అది గంజాయి దమ్మే తప్ప ధూమపానం కాదని చివరికి తేల్చారు. సంస్కృతంలో పొగాకుకు 'కలంజం' అనే మాట ఉపయోగించినా, దాని అసలు అర్థం గంజాయి అనే అంటారు.

సంగీత, నాటకాది కళారూపాలపై ఆయన రాసిన వ్యాసాలు చదివితే, వాటిపై ఆయనకు గల ఆసక్తి, అభినివేశాలు, అర్థమవుతాయి. "పద్యాలకు రాగాల నిర్దేశం' అనే వ్యాసంతో, "గ్రామైకరాత్రంగా దేశమంతా తిరిగాను, చాలా వరకూ ప్రతి రాష్ట్రంలోనూ దేశీ నాటకాలు, సంస్కృత నాటకాలు, నృత్యకలాపాలు చూశాను" అని చెప్పుకోవడంలో, ఆయన లోకసంచార జీవితమే కాక, సమకాలీన కళారూపాలను అన్నిటినీ రెండు కళ్లతోనూ, చెవులతోనూ తనివితీరా జుర్రుకున్న పూర్ణ రసమయ జీవితం కూడా కళ్ళ ముందు సాక్షాత్కరిస్తుంది. పద్యకవిత్వాన్ని చదువుకోవడమే కానీ వాటి రాగనిర్దేశం గురించిన ఊహ మనకు రాదు. రామచంద్రగారు ఏ పద్యాన్ని ఏరాగంలో, ఏ కాలంలో పాడాలో పూర్వకవులను ఉటంకిస్తూ విద్వత్పూర్వకంగా చర్చిస్తారు. తెలుగు జాతి ప్రాచీన సంగీత రూపకం-బుర్రకథ' అనే వ్యాసంలో మహారాష్ట్రలోని 'పవాడా'తో కానీ, కన్నడ 'లావణీ' తో కానీ పోలిక లేని తెలుగువారి ప్రత్యేక రూపక సంప్రదాయం బుర్రకథ అని నిరూపిస్తారు. 'ఏకాంకిక' గురించి రాస్తూ, తెలుగు నాట నాటకం రెండు వేల సంవత్సరాల క్రితమే ఉందని గాథాసప్తశతిని ప్రమాణంగా చూపుతారు. ఇంకా వెనక్కి వెడితే పండితుల ఉద్దేశంలో వేదంలోని యమ-యమీ సంవాదం నాటకమేనంటారు. రామచంద్రగారి పరిశీలనలు అనేక చరిత్ర, పురాచరిత్రలను స్పృశిస్తూ ఉంటాయి. వాటిపై ఆసక్తి ఉండి, ఎంతో కొంత అధ్యయనం ఉన్న వాళ్ళకు అవి ఎంతో ఉత్సాహాన్ని , ఉత్తేజాన్ని ఇస్తాయి. వారి

లాంటి పండితుల సంఖ్య నేడు తగ్గిపోతున్న లోటు నాకు ఈ మధ్య ఒక సందర్భంలో కొట్టొచ్చినట్టు కనిపించింది. సుప్రసిద్ధ పురాచరిత్రకారులు రాంభట్ల కృష్ణమూర్తి గారు తన జనకథ అనే వ్యాస సంపుటిలో 'ఆలు' అనే మాటకు పనివారు, బానిస అనే అర్థాలు ఉన్నాయని రాశారు. అయితే , అందుకు ఆధారం చూపించలేదు. ఆ అర్థాలను నేను ఒక వ్యాసంలో ప్రస్తావించినప్పుడు; 'ఆలు' కు స్త్రీ, భార్య అనే అర్థం తప్ప పనివారు,బానిస అనే అర్థం నిఘంటువులో లేదని ఒకరు అభ్యంతరం చెప్పారు. దాంతో నేను ఆధారాల అన్వేషణలో పడ్డాను. రామచంద్రగారి సాహితీ సుగతుని స్వగతం పరిశీలిస్తుంటే అందులోని "ఆంధ్రసాహిత్యంలో స్త్రీ పర్యాయపదాలు" అనే వ్యాసంలో ఒక ఆధారం కనిపించింది. 'ఆణ్', 'ఆళ్' అనే శబ్దాల గురించి రామచంద్రగారు వివరిస్తూ ఇవి తమిళ, కన్నడ, మలయాళ, తుళు భాషల మనుష్య సామాన్య వాచకాలనీ, ఉభయలింగాలనీ; మనిషి అనే పూర్వం ప్రయోగంలో ఉండేవని అన్నారు. ఆలు అనే మాట ఆళ్ నుంచి నిష్పన్నమైందనీ, "ఇల్లాలు" అనే మాటకు "ఇంటి మనిషి"- అంటే ఇంటిని చక్కబెట్టే వ్యక్తి- అనే అర్థం మొదట్లో ఉండేదనీ అన్నారు. ఇల్లాలు లోని ఇల్ అనే శబ్దం క్రమంగా వాడుకలో లోపించి, ఆలు అనే శబ్దం మిగిలి గృహిణి అనే అర్థంలో రూఢమయిందని ఆయన వివరణ. నాకు వెంటనే మహాభారతం, అరణ్యపర్వంలోని అవక్రీతుని కథ గుర్తొచ్చింది. "శూద్రుడు" గృహపాలకుడిగా ఉండేవాడని ఆ కథ చెబుతోంది. ఇంటిని చక్కబెట్టే వ్యక్తి అనే అర్థంలో ప్రయోగించిన ఇల్లాలు అనే మాట ఉభయలింగం కనుక ఆనాడు శూద్రుని కూడా ఇల్లాలు అనడానికి అవకాశం ఉందన్నమాట. ఆ విధంగా చూసినపుడు, సేవకత్వ, దాసత్వాలలో స్త్రీకి శూద్రునితో సామ్యం ఉంది కనుక, ఆలు అనే మాటకు పనివారు, బానిస అనే రాంభట్ల వారి అర్థాలు సరిపోతున్నాయి.

సంప్రదాయేతర, పాశ్చాత్య విజ్ఞానప్రసారం రామచంద్ర గారి పరిశీలనకు ఎంతో కొంత నవీనత్వపు తళుకులద్దిన సంగతి తెలిసిపోతూనే ఉంటుంది. ఇంకా విశేషం ఏమిటంటే, ' మాతృలీన సమాజం' అనే మాటతో ఒకనాటి మాతృస్వామ్య సమాజం గురించిన ప్రస్తావన ఆయన కొన్నిచోట్ల చేశారు. "మాతృలీన సంఘంలో స్త్రీ తన సహజ శారీరక పరివర్తనంతో సాలీడులాగా తన చుట్టూ మోహజాలం అల్లుకుని, పురుషులను ఆకర్షించి, దగ్గర చేరినవారిని బిగువుగా పట్టుకుని గుప్పిట్లో పెట్టుకునేది. అప్పుడామె దేవత; శక్తి; కాళి; సృష్టి స్థితి లయకారిణి అయింది. కానీ పురుషుడు తన కాయబలం గుర్తించి ప్రజనన కర్మలో తనకూ ప్రధాన భాగం ఉంది, తను లేనిదే

సుఖం, సృష్టి కలగవు– అని పదిలపరచుకున్న తరువాత పరిస్థితి తారమారైంది; మాతృస్వామ్య వ్యవస్థ ముక్కచెక్కలయింది. అని "సమాజ శ్రేయస్సు–తృతీయ పురుషార్థం' అనే వ్యాసంలో అంటారు. అయితే, జార్జి థాంప్సన్, లూయీ హెన్రీ మోర్గాన్, జోసఫ్ క్యాంప్ బెల్ తదితరులతో ఆయనకు తగినంత పరిచయం ఉండి ఉంటే, ఆయన పరిశీలనలకు మరింత సమగ్రత, వైశాల్యం సిద్ధించి ఉండేవనిపిస్తుంది. ఉదాహరణకు, ప్రకృతిని అర్థం చేసుకుని, వశపరచుకునే క్రమంలో మాంత్రిక వాస్తవికత ఎలా భౌతిక ప్రయోజనాలకు సాధనమయిందో; కవిత్వ రూపంలో అది ఎలా వ్యక్తమవుతూ వచ్చిందో; కవిత్వం నుంచి నాటకాది కళారూపాలు ఎలా అభివృద్ధి చెందాయో జార్జి థాంప్సన్ చర్చిస్తాడు. దాదాపు అన్ని పురాసమాజాలలో ఈ ప్రక్రియ ఒకేలా జరిగినట్టు ఆయన పరిశీలన వెల్లడిస్తుంది. కనుక ఏ కళారూపాన్ని అయినా ఒక దేశానికో, ప్రాంతానికో, జాతికో పరిమితం చేసేటప్పుడు ఒకటికి రెండుసార్లు ఆలోచించుకోవలసి వస్తుంది. జార్జి థాంప్సనే కాక, లూయీ హెన్రీ మోర్గాన్, జోసఫ్ క్యాంప్ బెల్ తదితర పండితులు కూడా మాతృస్వామ్య సమాజం గురించి ప్రామాణిక అధ్యయనాలు అందించారు. స్త్రీ సాలీడు లాగా తన చుట్టూ మోహజాలం అల్లుకుని పురుషుల్ని ఆకర్షించేదని రామచంద్రగారు అనడం క్యాంప్ బెల్‌ను, కోశాంబీని చటుక్కున గుర్తుకు తెస్తుంది. రామచంద్రగారి 'చేతబళ్ళు', తలనీలాలు' అనే వ్యాసంలో కూడా మూఢనమ్మకాలను హేతుదృష్టితో పరిశీలించడంతోపాటు, పురాచరిత్ర శోధనకు చెందిన ఆనవాళ్ళు స్పష్టంగా కనిపిస్తాయి. అయితే, కాలికమైన పరిమితులను దృష్టిలో ఉంచుకుని ఆయన పరిశీలనను బేరీజు వేయవలసి వుంటుంది. రామచంద్రగారు మౌలికంగా సంప్రదాయ విద్యలలో లోతైన విద్వత్తు ఉన్న పండితులు, వ్యక్తిగానే కాక, ఒక సహృదయుడిగా కూడా ఆయన విరివినీ, వైశాల్యాన్ని పెంచుకుంటూ ఆధునికతవైపు పయనిస్తున్నట్లు రూపుకడతారు. సంప్రదాయ, ఆధునికతల సంధి కాలానికి ఆయన ప్రాతినిధ్యం వహిస్తున్నారు. తను పుట్టి పెరిగిన స్వాతంత్ర్యోద్యమ కాలానికి చెందిన దేశభక్తి, ఆదర్శవాద, జాతీయ వాద ప్రభావాలు ఆయనపై పూరాగా ఉన్నాయి. వైవిధ్యాన్ని గుర్తించి హర్షించే ఒక సహృదయుడిగానే కాక, పురోగమనశీలిగా కూడా ఆయన నవ్యసాహిత్యాన్ని విలువ కడతారు. నేటి తెలుగు కవితలో కల్పనా కమనీయకం, 'నవకవులలో పాశ్చాత్యుల భావచిత్రణ', 'నాయనివారి ప్రణయసూక్తం' 'కొన్ని సమకాలిక నవలలు' మొదలైన వ్యాసాలు వారి నవ్యసాహిత్యాభిరుచిని వెల్లడిస్తాయి. నేటి సాహిత్య విమర్శలో పాత పరిశీలన అపురూపంగానూ,

అభిలషణీయంగానూ కనిపిస్తుంది. చివరగా చెప్పాలంటే, సంప్రదాయ గాఢత ఉన్న రామచంద్రగారు ఆధునికతను అందుకోడానికి ఉత్సాహం చూపించవచ్చు. కానీ ఇప్పుడు చూస్తే, ఆయన పండితపార్శ్వమే నాకు ఎక్కువ విలువైనదిగా కనిపిస్తోంది. మరీ ముఖ్యంగా వివిధ ఆకారాల నుంచి పురాచరిత్రను పరిశీలించడానికి ఆసక్తి చూపించే వాళ్ళకు రామచంద్రగారి వంటి పండితులు కరువవుతున్న వెలితి భూతద్దంలో కనిపిస్తుంది.

--------

82

# పాత్రికేయుల రచనలు : 'పలుకుబడి' : అన్వీక్షణం

- టి.ఉదయవర్లు

పదాలు భావగర్భితాలు. అవి దట్టించిన ఫిరంగిలాంటివి. గురితప్పకుండా ప్రయోగిస్తే లక్ష్యాన్ని ఛేదించవచ్చు. లేదా ఆ ప్రయోగం నిష్ప్రయోజనమవుతుంది.

ప్రయోగించే మందుగుండు సామగ్రి స్థానికంగా లభిస్తే మంచిదే. లేదా సరైన సామగ్రి విదేశీయమైనదైనా ఫరవాలేదు. లక్ష్యాన్ని సాధించడమే దాని పరమార్థం.

మన తెలుగు తేనెలొలుకుతుంది. సందేహం లేదు. అంతేకాదు అజంతమైంది కాబట్టి తెలుగు చెవులకింపయి వింటే చెవులు కోసుకోబుద్ధవుతుంది.

ఏ విషయమైనా ఇట్టే మొత్తం వ్యాపించిపోయే పల్లెలా ప్రపంచం అయిపోయిన ఈ శతాబ్దంలో శాస్త్రవిజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందుతూ, కొత్తకొత్త ఆవిష్కరణలు జరుగుతున్నాయి. వాటికి సంబంధించిన పదజాలం కుప్పలు తెప్పలుగా వస్తున్నది. ప్రతిదానికి సమానార్థకమైన తెలుగుపదం సృష్టించుకోవాలనుకోవడం చాదస్తం. అవసరమైన వాటిని సందర్భానుసారంగా వాడుకోవడం, తెనిగించుకోవడం తెలివైనపని. ఇతరభాషాపదాలను వాడకూడదని మడికట్టుకుని కూర్చోవడం మూర్ఖత్వం.

ఎందుచేతనంటే - ఇంగ్లీషు ఇవ్వాళ అంతర్జాతీయ భాషగా పెరిగిందంటే ప్రధానకారణం అది అన్య భాషాపదాలను తనలో ఇముడ్చుకోవడమే. లోగడ సంస్కృతం కూడా ఇతర భాషా పదాలను స్వీకరించి తన ముద్రవేసుకుంది.

బహుభాషావేత్త తిరుమల రామచంద్ర అభివర్ణించినట్టు భాష ప్రవాహిని. ఏ నదిలోనైనా ప్రవాహమార్గంలో ఎన్నెన్నో ఉపనదులు, వాగులు వంకలు వచ్చి చేరిపోతాయి. అవి ఎన్ని ఎక్కువ సంఖ్యలో చేరితే అది అంత మహానది అవుతుంది.

ఇలాగే ఏ భాషాప్రాంతంలోనైనా, దాని ఇరుగుపొరుగుతో, ఇతర ప్రాంతాలనుంచి చుట్టపుచూపుగా వచ్చే వారితో కళకళలాడుతూ, పరస్పరం ఇచ్చిపుచ్చుకునే సందర్భాలలో కొన్ని కొత్త పదాలు చేరిపోతాయి. ఇంతకుముందు ఉన్న పదాలలో కొన్నింటికి కొత్త అర్థచ్ఛాయలు పొడచూపుతాయి. ఇది క్రమంగా ఓ పూవు పూసినట్టు జరిగే భాషావికాసం.

ఇట్లా అని ప్రతి పరభాషా పదాన్ని తెలుగులో వాడమని కాదు. తెలుగులో లేని, తర్జుమా చేసినా భావప్రసారం చేయలేని పదాలను యథాతథంగా వాడుకోవచ్చు. ఉదాహరణకు “Dredger” అనే ఒక తరహా ఓడను రాష్ట్రంలోని సముద్రతీరవాసులు, చదువుసంధ్యలులేని వారైనా, దాని తీరుతెన్నులు చూసి– “తవ్వోడ” అన్నారు. అది తగినట్టుగా ఉంది. భావగర్భితమైన ఇలాంటి పదాలను మక్కీకి మక్కీగా వాడుకోవచ్చు. కాని అర్థచ్ఛాయ లేకుండా రంగు, రుచి, వాసనలేని మాటకు మాట తర్జుమాచేసే పద్ధతి ఎంతమాత్రం సరైంది కాదు.

బ్రిటన్‌లో “పందికొక్కులు” లేవట. అందుచేత దానికి ఇంగ్లీషుపదం లేదు. వారికి పందులు ఉన్నాయి. ఎలుకలు ఉన్నాయి. కాబట్టి “పిగ్–లైక్–ర్యాట్” అనికూడా అనవచ్చు. కాని తెలుగు పందికొక్కును స్పష్టతకోసం “బ్యాండీకూట్” అన్నారు ఇంగ్లీషులో. ఇలాగే గ్రీక్, లాటిన్, హిబ్రూ, అరబ్, పర్ష్యన్, జర్మన్, జపనీస్, మాలే, డచ్, ఫ్రెంచి, సంస్కృతం ఇత్యాది ఎన్నో భాషల పదాలు ప్రవేశించి – ఇంగ్లీషు భాష సుసంపన్నమైంది. నిజానికి “కన్‌సైజ్ ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ’ చూస్తే అందులో అసలు సిసలైన ‘ఆంగ్లో – శాక్సన్’ పదాలు ఒక శాతమైనా ఉండవు.

తెలుగులో సంస్కృతపదాలు ఎక్కువ. సంస్కృత పదాలు రాకుండా తెలుగు మాట్లాడాలంటే, ఇంగ్లీషు పదాలు రాకుండా తెలుగు మాట్లాడడమంత సులభం కాదు. మనభాషలో కలిసిపోయిన సంస్కృత పదాలు తెలుగు భాషావికాసానికి, నూతన భావాలను సుస్పష్టంగా తెలపడానికి ఎంతగానో ఉపకరిస్తున్నాయి.

ఇవ్వాళ తెలుగు కేవలం నిత్య వ్యవహారంలో, సాహిత్యంలో మాత్రమే కాకుండా విద్యారంగంలో స్నాతకోత్తర స్థాయి దాకా ప్రవేశపెట్టిన కారణంగా అన్ని శాస్త్రాలు తెలుగులో బోధిస్తున్నారు. లోగడ ఎక్కువ సంఖ్యలో దిన, వార, మాసపత్రికలు, ఇటీవల తెలుగు టి.వి. ఛానళ్ళు పుట్టుకొని రావడంతో తెలుగు వాడకం బాగా పెరిగిపోయింది.

ఈ దృష్ట్యా – యథాతథంగా సంస్కృతపదం తెలుగు వాడుకలోకి రావడంలో పేచీ ఏమీ లేదు. అయితే వాటిని తత్సమాలుగా వాడుకున్న సందర్భంలో మాత్రం

సంస్కృత భాషా నియమాలను పాటించడం అవసరం. అంటే మనం స్వీకరించిన పదం నామవాచకమా? విశేషణమా? మరి ఏమిటి? అన్నది గమనించి విచక్షణతో ప్రయోగించవలసి ఉంటుంది. సమాసం చేయవలసి వచ్చినప్పుడు అన్ని సంస్కృత పదాలేనా? లేదా సమాసం సంకరమైందా? ఒకవేళ సంధి ఏర్పడితే సంస్కృత వ్యాకరణ సూత్రప్రకారమే జరిగిందా? అన్నది ప్రధానం.

ఇటీవలి కాలంలో తెలుగు పత్రికలలో వందల సంఖ్యలో సంస్కృత భాషాపదాలు తప్పుగా వాడుతున్నారు. పత్రికలలో కనిపించే, ఎలక్ట్రానిక్ మీడియాలో వినిపించే ఈ అపప్రయోగాలే బాగా ప్రచారమై జనసామాన్యం నోళ్ళలో నానుతున్నాయి. తెలుగు మాట్లాడే అసంఖ్యాకులకు సంస్కృతం, ఆ భాషా వ్యాకరణం తెలియదు కాబట్టి తప్పులు దొర్లుతున్నాయి. వాటిని దిద్దుకునే ప్రయత్నం చేయకపోవడం వల్ల అవి అలాగే కొనసాగుతున్నాయి. ఇట్టి పదాలు ఎందుకు వాడకూడదో, ఎలా వాడాలో, అందులోని పొరపాటు ఏమిటో సంస్కృత వ్యాకరణరీత్యా వివరిస్తూ సుప్రసిద్ధ పాత్రికేయులు, బహుభాషా కోవిదులు తిరుమల రామచంద్ర 1996 లో "ఆంధ్రప్రభ" దినపత్రికలో ఏడాదికాలం "పలుకుబడి" శీర్షిక నిర్వహించారు. వారికి కేవలం సంస్కృతంలోనే కాకుండా ప్రాకృతం, హిందీ, కన్నడం, తమిళం, ఆంగ్లభాషలలో గాఢమైన ప్రవేశం ఉన్నందున పదచర్చ అర్థవంతంగా చేశారు.

1995 మే 20న ప్రారంభించి సరిగ్గా మళ్ళీ అదే తేదీవరకు వారం వారం తిరుమల రామచంద్ర ఈ శీర్షిక వ్రాశారు. ఇది ధారావాహికంగా ప్రచురించబడుతున్న సమయంలోనే "జర్నలిస్టుల సహకార ప్రచురణ సంఘాన్ని" ఏర్పాటు చేసి యువ జర్నలిస్టుల కోసం ప్రత్యేకంగా వృత్తిని మెరుగుపరుచుకునేందుకు ఉపకరించే గ్రంథాలు వెలువరించాలనే ఆలోచన వచ్చింది. ఈ ఆలోచనను సుప్రసిద్ధ చిత్రకారుడు బాపుకు తెలపడంతో వారు సృజనాత్మకమైన 'లోగో' చిత్రించి పంపారు. అప్పుడున్న సమాచారశాఖ కమీషనర్‌కు ఈ విషయం వివరించగానే తొలుదొలుత మేము ప్రచురించ సంకల్పించిన రెండు గ్రంథాలకు రెండు ప్రభుత్వ ప్రకటనలు మంజూరు చేశారు. తిరుమల రామచంద్ర 'పలుకుబడి'తోపాటు మరో సుప్రసిద్ధ జర్నలిస్టు జి. కృష్ణ అప్పుడు వ్రాస్తున్న 'కన్నవి–విన్నవి', 'అప్పుడు–ఇప్పుడు' ప్రచురించాలని ప్రతిపాదించాము. తన రెండు గ్రంథాలకు జి.కృష్ణ ముందుమాట కూడా వ్రాసిచ్చారు. 'కన్నవి–విన్నవి'కి ప్రముఖ చిత్రకారుడు చంద్ర ముఖచిత్రం కూడా వేసిచ్చారు. ఆ తర్వాత జి.యస్.వరదాచారి 'దిద్దుబాటు' శీర్షికన వ్రాస్తున్న వ్యాసాలు ప్రచురించాలనుకున్నాము.

ఈ ఆలోచన తొలిదశలో తిరుమల రామచంద్రను సంప్రదించినప్పుడు వెంటనే వారు ఆమోదం తెలపలేదు. ఆలోచించి చెబుతానన్నారు. దాదాపు నెలరోజులపాటు పని ఆగిపోయింది. ఆ మధ్య కాలంలో నా కోసం వారు మా ఇంటికి ఫోను చేశారట. కాని ఎన్నిసార్లు ఫోను చేసినా 'ఈ నంబరు తాత్కాలికముగా పనిచేయుటలేదు' అని జవాబు వచ్చిందని తిరుమల రామచంద్ర నాకు ఆ తర్వాత వ్రాసిన జాబులో తెలిపారు.

1997 జనవరి 8వ తేదీన నా పేరున అప్పుడు నేను పనిచేస్తున్న పత్రిక కార్యాలయానికి తిరుమల రామచంద్ర లేఖ వ్రాస్తూ - 'పలుకుబడి' గ్రంథాన్ని ప్రచురించడానికి ఆమోదం తెలిపారు. తాను ప్రస్తుతం మద్రాసు వెళ్ళి పదిరోజుల తర్వాత తిరిగివస్తానని, జనవరి 20వ తేదీన ఇంటికి ఫోన్ చేస్తే మిగతా విషయాలు మాట్లాడుకుందామని వ్రాశారు.

ఆ తర్వాత ఎందుకోగాని, వారు చెప్పిన గడువుకు మద్రాసునుంచి వచ్చినట్టులేదు. వారు వచ్చాక నాకేదో వృత్తిపరమైన ఒత్తిడి పెరిగింది. 'జర్నలిస్టుల సహకార ప్రచురణ సంఘం' ప్రతిపాదన, కేవల ప్రతిపాదనగానే మిగిలిపోయింది. 2006లో అరవయ్యవపడిలో పడిన కొందరు జర్నలిస్టులం ఒక తాటిపైకొచ్చి "వయోధిక పాత్రికేయ సంఘం"గా ఏర్పడ్డాము. వృత్తిపరమైన ప్రయోజనాలు కాపాడుకోవాలనే లక్ష్యానికి ఊతమిస్తూ దాదాపు నూటా ఎనభై ఏండ్లకు పైబడిన ఘనచరిత్రగల తెలుగు పత్రికారంగాన్ని తీర్చిదిద్దిన మహనీయుల లఘు పరిచయాలతో కూడిన బృహత్ సచిత్ర గ్రంథాన్ని తెలుగు, ఇంగ్లీషు భాషలలో విజయవంతంగా వెలువరించాము. ఆ తర్వాత మరికొన్ని ప్రచురణలు తెచ్చాము.

ఈ క్రమంలో 2013 తిరుమల రామచంద్ర శతజయంతి రావడం సంభవించింది. వారి జన్మతిథి ప్రకారం ఈ జ్యేష్ఠశుద్ధ చతుర్దశి జ్యేష్ఠ నక్షత్రాన శతజయంతి ఉత్సవాలను ప్రారంభించి, వయోధిక పాత్రికేయ సంఘం "తిరుమల రామచంద్ర - శతజయంతి సంస్మృతి" సంచికను తెచ్చింది. పుస్తకరూపంగా రాని 'పలుకుబడి'ని ప్రస్తుతం మేము ప్రచురించాము. ఈ శీర్షికక్రింద వారు వ్రాసిన మొత్తం వ్యాసాల ప్రతులు లభించకపోవడంతో, దొరికినంత వరకు అచ్చువేశాము. ఈ శీర్షికను ప్రచురించిన పత్రికా కార్యాలయంలోను ఆ నాటి పత్రికలు లేకపోవడం విచారకరం. దొరికినంత వరకు పుస్తకరూపంలో రాకపోతే అవి కూడా కాలగర్భంలో కలిసిపోతాయనే భయంతో ఈ ప్రచురణ వెలువరిస్తున్నాము.

ఇందులో తిరుమల రామచంద్ర పత్రికలలో కనిపించే అపప్రయోగాలను ఆసక్తికరంగా కథలా చెప్పారు. అందుచేత అవి పాఠకుల మదిలో హత్తుకుపోయే విధంగా ఉన్నాయి. ఈ స్పష్టభాషణం వల్ల పరిశోధన పారంగతుడైన తిరుమల రామచంద్ర ఎంతో నష్టపోయాడు. తప్పు ఉంటే కుండబద్దలు కొట్టి చెప్పే వారితత్త్వం వల్ల 'తెలుగు భాషా చరిత్ర' రచన చేసిన ఆచార్య గంటి సోమయాజి, 'తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వం నమూనా సంచిక' సిద్ధం చేసిన గిడుగు సీతాపతిలాంటి వారి ఆగ్రహానికి గురయ్యారు. అయితే లోకానికి ఎంత గొప్ప పండితులైనా – వారూ ఉప్పుకారం తింటారు కాబట్టి తప్పులను ఒప్పులుగా భావించే భజంత్రీలనే చేరదీస్తారనే నిజాన్ని మరోసారి ఇలా రుజువుచేశారు.

తెలుగు భాషా పండితులు, పరిశోధకులలో రుజుపథికుడైన తిరుమల రామచంద్ర సాధికారంగా చేసిన ఈ 'పలుకుబడి' వ్యాసాలలో ఏ అంశాన్నైనా నిష్కర్షగా, నిక్కముగా, అరటిపండు ఒలిచి చేతిలోపెట్టిన రీతిలో చెప్పారు.

సుప్రసిద్ధ సినీనటుడు, పూర్వముఖ్యమంత్రి ఎన్.టి. రామారావుకు స్పష్టంగా, తెలుగు నుడికారంతో సంభాషణలు చెబుతారని పేరు. కాని వారు నటించిన అనేక చలనచిత్రాలలో 'ప్రతిజ్ఞ' అనే మాటను 'ప్రతిగ్న' అని, 'జ్ఞానం'ను 'గ్నానం' అని పలకడం ఎవరైనా గమనించవచ్చు. భాషాజ్ఞానం గల ఎన్.టి. రామారావుకు అది తప్పని తెలిసి ఉండవచ్చు. కాని వారికి "జ్ఞ" పలకదేమో! అందుచేత ఆ మాటను ఎప్పుడూ "గ్నా" గా ఉచ్చరించేవారు.

తిరుమల రామచంద్ర వాంగ్మూలం, వాంగ్మయం, వాంగ్మాల, వాగ్మౌక్తికాలు అని వ్రాయడం తప్పని 'పలుకుబడి'లోని ఒక వ్యాసంలో బల్లగుద్ది చెప్పారు. వాక్+మూలం అనేది రెండు పదాల సమాసం. సంస్కృత వ్యాకరణం ప్రకారం వాక్ అనే మాట ప్రక్కన మూలం అనే అనునాసికమైన మ ఉన్నప్పుడు వెనక ఉన్న కకారం అనునాసికమై పోతుంది. అంటే క వర్గంలోని అనునాసికమైన ఙ కారంగా మారుతుంది. అప్పుడు వాక్–వాఙ్+మూలం=వాఙ్మూలం, వాఙ్మూలం అనే రూపం ఏర్పడుతుందని తెలిపారు. వాం+గ్+మూలం కాదు. గకారం వచ్చే ప్రసక్తే లేదు. అలాగే వాక్+మయం అనప్పుడు వాక్–ఙ్+మయం=వాఙ్మయం, వాఙ్మయం అవుతుంది. వాక్ + మాల = వాఙ్మాల అని, వాక్ + మౌక్తికాలు = వాఙ్ + మౌక్తికాలు – వాఙ్మౌక్తికాలు అవుతుందని వివరించారు.

మరొక వ్యాసంలో ఇష్టాగోష్ఠి కాదు ఇష్టగోష్ఠి అని సోదాహరణంగా పేర్కొన్నారు. పత్రికారంగంలో ఇన్‌ఫార్మల్ మీట్ అనే దానికి పర్యాయపదంగా ఇష్టాగోష్ఠిని యథాతథంగా వాడుతున్నారు. ఇష్టాగోష్ఠి అనే రెండు పదాలు కలిస్తే ఇష్టగోష్ఠి అవుతుంది కాని ఇష్టాగోష్ఠి కాదన్నారు. వాస్తవానికి ఇష్టాగోష్ఠి అనే పదంలో తప్పేమీ లేదు. అయితే ఇష్టాగోష్ఠి అంటే ఇష్టమైన గోష్ఠి అనే అర్థమే కాని ఇష్టులతో గోష్ఠి అనే అర్థం లేదు. నిజానికి ఇష్టాగోష్ఠి, ఇష్టగోష్ఠి అనే పదాలను సమయానుకూలంగా, సందర్భశుద్ధితో వాడవలసి ఉంటుందని హెచ్చరించారు.

తెలుగులో తత్సమపదాలు సంస్కృతం నుంచే కాక దాదాపు వెయ్యేండ్లు శాసనభాషగా ఉన్న ప్రాకృతం నుంచి కూడా వచ్చి చేరాయి. కొన్ని వందల పాళీ-శౌరసేన ప్రాకృతపదాలు తెలుగులో కలిసిపోయి తెలుగు పదాలనే ముద్ర వేసుకున్నాయి. ఉదాహరణకు సుంకరి, జూదరి, కమ్మరి, సొన్నారి లాంటి పదాలు. ఇలాగే ప్రాకృతం నుంచి లేఖకార శబ్దం తెలుగులో లేకరి అయిందనీ, వి ఉపసర్గలో విలేకరి అని కావచ్చునని తిరుమల రామచంద్ర అంటారు. మనకు అచ్చ తెనుగులో మహాప్రాణాలు లేవు కాబట్టి లేకరి అని ప్రాచీనమైనవాడుక. ప్రాకృతం నుంచి లేఖ+ఆర-లేఖర-లేఖర-లేఖరి అని గ్రహించినప్పుడు విలేఖరి అని వాడడం ప్రమాదభరితం కాదని తిరుమల రామచంద్ర అభిప్రాయపడ్డారు. అయితే ఈ విలేఖరిని బహువచనంగా వాడినప్పుడు విలేఖరులు అవుతుంది. అప్పుడు "ఖరులు" శబ్దం వల్ల ఇతర అర్థాలు తీసే అవకాశం ఉంటుంది. పైగా చెవికి ఇంపుగాను లేనందున విలేకరులని వాడడమే మంచిదని సుప్రసిద్ధ సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావు అభిప్రాయం. అందుచేత వారి సూచనే పాటిస్తున్నాము.

ఆంగ్ల ఉచ్చారణను, వ్రాతను భక్తిశ్రద్ధలతో పాటించడం వల్ల విచక్షణ లేకుండా భారతీయ భాషల పదాలను, ముఖ్యంగా వ్యక్తుల పేర్ల ఉచ్చారణలో, లేఖనంలో తప్పులు చేస్తున్నాము. ఇందుకు ఉదాహరణ సత్యజిత్‌రాయ్, సిద్ధార్థ శంకర్‌రాయ్‌ని మనం రే రే అంటున్నాం. ఆర్.ఎ.ఐ=రాయ్ అని భారతీయ ఉచ్చారణ. అలాగే- త్రివేది, దుబే, కృపలానీ, వాధ్వానీ, మాలానీ సరైన రూపాలు. అన్బళగన్ అంటే ప్రేమసుందరుడు. అంబలగన్ అనడం అపభ్రంశం. కన్నబిరాన్-కణ్ణాపీరాన్, కన్నాబిరాన్ అని అష్టావక్రమయింది. ఆంగ్ల స్పెల్లింగ్ ఆధారంగా తెలుగులో వ్రాయడం వల్ల లాల్ క్రిషన్ అడ్వాణీని అద్వాని అని, మోదీని మోడీ అని, దిల్లీని ఢిల్లి అని, హర్యాణాను, హర్యానా అని, ఠాణెను థానే అని, దెహ్రాదూన్‌ను డెహ్రాడూన్ అని, షికాగోను,

చికాగో అని, టాగోర్‌ను ఠాగూర్ అని, అమితాభ్‌ను అమితాబ్ అని, రబ్డీదేవిని రబ్రీదేవి అని, శీలాదీక్షిత్‌ను షీలాదీక్షిత్ అని, కిరణ్ బేదీని కిరణ్ బేడి - ఇలా ఇంకా ఎన్నో పేర్లను తప్పుగా వ్రాస్తున్నారు.

అధ్వరయం అన్నా, ఆధ్వర్యమన్నా తప్పు. ఆధ్వర్యవం సరైనమాట. ఘనపాఠి అంటే గొప్ప వేదపండితుడు అని అర్థం. గొప్పవాడు, సమర్థుడు, నిపుణుడు అనే అర్థంలో ఆ పదాన్ని వాడవచ్చుకాని. వాడు పదిబుడ్లు లాగేసే ఘనాపాఠీ అని వ్యసనాలలో కూరుకుపోయినవారికి ప్రయోగించడం సరికాదు అన్నారు తిరుమల రామచంద్ర. ఈ మధ్య ఇంగ్లీషులో ఘనాపాఠి ఫలానా శర్మ అని ఇంగ్లీషు వార్తా ఏజెన్సీ కథనం చూసి-ఘనాపాఠికి 'గణపతి' ఫలానా శర్మ అని వ్రాసిన ఉదంతానికి ముక్కుపైన వేలువేసుకోవడం తప్ప మరేం చేయగలం.

విశేషణపదం విశేష్యపదం ప్రత్యేకతను తెలుపడమో, ప్రత్యేకతను ఆమోదించడమో చేయాలి. కేవలం విశేషణమైనా విశేష నామవాచకంతో అన్వయం కుదరాలి. లేదా ఆశించిన భావం రాదు. కాంగ్రెసును శక్తిమంతంగా, ధృడంగా చేయడం ఉద్దేశమైనప్పుడు 'కాంగ్రెస్ పటిష్ఠానికి" అన్న వాక్యం సాధువుకాదు. ఆ అర్థం రాదు. కాంగ్రెస్‌ను పటిష్టం చేయడానికి అనవచ్చు. అలాగే 'కాంగ్రెసు బలోపేతానికి' అనివాడడం కూడా తప్పే. ఇక్కడ కాంగ్రెసును బలోపేతం చేయడానికి అనో, కాంగ్రెస్ బలోపేతం కావడానికి అనో వ్రాయవచ్చునని ఉదాహరించారు.

ఔత్సాహిక శబ్ద సాధుత్వా సాధుత్వాన్ని చర్చిస్తూ అమెచ్యూర్ అనే ఆంగ్ల పదానికి తర్జుమాగా ఔత్సాహిక అని వాడుతున్నారన్నారు. అమెచ్యూర్ అంటే అభిలాష, ఉత్సుకుడు, ఆసక్తిగలవాడు అనే అర్థాలున్నాయి. కాని ఔత్సాహిక అనే అర్థం మాత్రం లేదు. నాటకాలలో నటించడం వృత్తి కాక, మరొక వృత్తిలో ఉంటూ కేవలం ఆసక్తితో, ప్రవృత్తితో నాటకాలలో నటించేవాడు అమెచ్యూర్. ఉత్సుకుడు అన్నా, ఉత్సాహి అన్నా, ఔత్సాహికుడు అన్నా ఒకటే అనే భ్రాంతితో ఈ పొరపాటు జరిగి ఉంటుంది. మన రాష్ట్రంలో అర్ధ శతాబ్దం క్రితం ప్రముఖులుగా ఉన్న నటులంతా ఉత్సాహకులే అని ఆయన వివరించారు. ఉత్సాహ+ఇక=ఔత్సాహిక అనే రూపం ఏర్పడుతుంది. కాని దాని అర్థం ఉత్సాహానికి సంబంధించిన అనే. ఉత్సాహం కలవారు, ఉత్సాహవంతులు అనే అర్థం రాదు. అందుచేత ఉత్సాహవంతులు లేదా ఉత్సాహులు అని గాని, ఉత్సాహక నాటక సంఘాలు అని కాని అనవలసి ఉంటుందన్నారు.

మరొకవ్యాసంలో ఉచ్చారణ కొంత సన్నిహితంగా ఉండడం వల్ల, ఒకే వర్గంలోనివి కావడం వల్ల యథాలాభం-యథాలాపం ఒకటే అనుకుంటున్నారు. కాని అవి రెండూ వేరు వేరు అని, వాటిని తారుమారు చేయటం పొరపాటని, దేని అర్థం దానిదేనని ఆయన వివరించారు.

సమష్టి అని వాడడం సరైన ప్రయోగం. సమిష్టి అపశబ్దమని వేరొకవ్యాసంలో వివరించారు.

నిరశన-నిరసన అనే పదాల వాడకంలో నేటి పత్రికా రచయితలు తబ్బిబ్బై తారుమారుగా వ్రాస్తున్నారు. ఈ రెండు పదాల మూలధాతువులు వేరు. వాటిని బట్టి వాటి అర్థాలు వేరు. కాబట్టి ఒకదాని బదులుగా మరొక పదం వాడితే తప్పుడు అర్థం వస్తుంది. నిరశన అంటే ఆహారం లేకపోవడం, తిండిలేకపోవడం, తినకపోవడం అనే అర్థం. నిరసన అంటే కాదనడం, తోసివేయడం, నిరాకరించడం, ఒప్పుకోము అని గట్టిగా చెప్పడం అని అర్థం. ఈ దృష్ట్యా నిరశన-నిరసన పదాల అర్థంలో పోలిక లేదని తెలిపారు.

సునిశితం-సున్నితం పర్యాయపదాలనుకొని కొందరు రచయితలు ఇష్టారాజ్యంగా వాటిని వాడతారు. స్వరసామ్యం వల్ల మరికొందరు రెండింటికీ ఒకే అర్థం అనుకుంటారు. నిజానికి ఇవి రెండు విరుద్ధ భావాలు తెలిపే వేరు వేరు పదాలని ప్రయోగించి తిరుమల రామచంద్ర చూపారు. సునిశిత అంటే బాగా తీక్షణమైన, బాగా పదునెక్కిన అని అర్థం. శబ్ద రత్నాకరం కచ్చితము అని అర్థమిచ్చింది. కాని ప్రస్తుతం దీన్ని మృదువుగా, సుకుమారంగా అనే అర్థంలో వాడుతున్నాము.

దారుఢ్యంకాదు దార్ఢ్యమ్ అని వాడాలంటారు తిరుమల రామచంద్ర. సంస్కృత పదాల కొసనో, మధ్యనో మరొక అక్షరం దూర్చివాడడం పొరపాటని వారు పేర్కొన్నారు. సుప్రసిద్ధ కథారచయితలు, మహాపండితులు, చివరికి వాచకాలు వ్రాసేవారు సైతం దార్ఢ్యమ్ అని కాకుండా, విద్యార్థులు తమ దేహ దారుఢ్యం రక్షించుకోవడానికి అని వాడడం ఏమిటని వారు ప్రశ్నించారు.

ఉపాధ్యాయ- ఉపాధ్యాయిని అనే పదాల గురించి వివరిస్తూ 'ఉపాధ్యాయిని' సంస్కృత వ్యాకరణం ప్రకారం తప్పుకాదన్నారు కాని ఉపాధ్యాయురాలు అనే అర్థంలో వాడడం మాత్రం తప్పని చెప్పారు. ఉపాధ్యాయుని భార్యని ఉపాధ్యాయినీ అంటారు. స్వయంగా విద్య నేర్పే మహిళను ఉపాధ్యాయా, ఉపాధ్యాయీ అనాలి. ఉపాధ్యాయనీ,

ఉపాధ్యాయి అనే పదాలకు ఉపాధ్యాయుని భార్య అనే అర్థం కూడా లేకపోలేదు. అందుచేత, స్పష్టతకోసం ఉపాధ్యాయా అని వాడడమే సరైందన్నారు. ఆచార్యుడి భార్యను ఆచార్యాణీ అంటారు. స్వయంగా బోధించే మహిళ అయితే ఆచార్య. తెలుగులో ఆచార్యురాలు. క్షత్రియ వంశంలో పుట్టిన స్త్రీ క్షత్రియాణీ, క్షత్రియ. క్షత్రియుని భార్యని క్షత్రియీ అంటారు.

తరచు తారుమారుగా వ్యవహరించే పదాల్లో నిర్దిష్టం - నిర్దుష్టం ఉన్నాయి. ఉచ్చారణలో చాలా దగ్గరగా ఉన్నందున ఈ పొరపాటు జరుగుతున్నది. నిర్దిష్ట అంటే ఫలానా, ఫలానా అని నిర్దుష్ట అంటే దుష్టం కానిది, దోషరహిత అని అర్థం.

షష్ఠమ సాధువుకాదు. షష్ఠ సాధురూపం. ఉధృతం కాదు ఉద్ధృతం సరైనపదం.

ఇష్ట అనేది సంస్కృత పదం కాబట్టి మధ్యలో తెలుగు ప్రత్యయం దూరడం అసహజం. కాబట్టి ఇష్టకు వ్యతిరేకపదం అనిష్టం కావాలి. కాని అయిష్టం అని వాడడం తప్పు అన్నారు.

ఇంగ్లీషు వ్యాకరణం ప్రకారం నేను, మేము ప్రథమ పురుషవాచకాలు. నీవు, మీరు ద్వితీయ పురుష (మధ్యమ పురుష) వాచకాలు. వాడు, వారు, అది, రాముడు, సీత తృతీయ పురుష వాచకాలు. ఇంగ్లీషు వ్యాకరణం ప్రకారం పూర్తిగా ఇవి తలకిందులు. లింగ విషయంలోను ఇలాంటి తప్పులు ఆంగ్ల, సంస్కృత వ్యాకరణ సంప్రదాయాల విభేదం వల్ల ఎన్నో వస్తున్నాయి. ఎంత గొప్ప రచయిత వ్రాసినా ఇలాంటి తప్పు తప్పే అన్నారు తిరుమల రామచంద్ర.

ఉవాచ, తిష్ఠ తెలుగు సంప్రదాయ విరుద్ధమైన ప్రయోగాలు. ఉవాచ అనేది భూతకాల వాచకమైన ప్రథమ పురుష ఏకవచన రూపం కాబట్టి నామవచకమనుకొని 'పరంధామయ్య ఉవాచ' అని, పరంధామయ్య కథనం అనే అర్థంలో వాడడం పొరపాటు. అలాగే తిష్ఠ అనేది మధ్యమ పురుష ఏకవచనరూపం. తెలుగులో ఉండు అనే అర్థంలో తిష్ఠ వాడుతున్నారు.

సమావేశం సమావేశస్థలం అనే అర్థంలో వాడే కూటము తెలుగుపదం. కాని కూటమి అంటున్నారు. అది తప్పు సంస్కృత కూట శబ్దానికి మిథ్య అయినది, అసత్యమైనది. కల్ల అయినది, కృత్రిమమైనది, కపటంగలది, నిందితం, తుచ్ఛం, అసత్యం, దంబం, డాబు, మాయ, పాపం మొదలైన అర్థాలు కాబట్టి సమావేశం అనే అర్థంలో కూటమి వాడకూడదన్నారు.

పొద్దుగాల–తెలంగాణాలో బాగా ప్రాచుర్యంలో ఉన్న అందమైనమాట. దీనికి పొద్దుకలుగ అని అర్థం.

నిష్పూచీ అనే పదం సరైందికాదు. సంస్కృతోపసర్గమైన నిస్ అనే దానిని పూచీ అనే తెలుగు పదానికి అతికించడం వ్యాకరణ సంప్రదాయ విరుద్ధం. అలాగే పేచీ తెలుగుపదం కాబట్టి దానికి నిడ, నిస్ అనే సంస్కృత ఉపసర్గలు చేర్చి – నిష్పేచీ ని వాడడం సరికాదు.

శోభాస్కర అనే పదంపై చర్చిస్తూ– శోభా+కృత్+అ=శోభాకర అవుతుంది. శోభలో స కరమ్ లేనప్పుడు శోభాస్కరం అనే మాట ఎలా ఉత్పత్తి అవుతుందని మరో వ్యాసంలో తిరుమల రామచంద్ర ప్రశ్నించారు. శోధించేది, ప్రకాశించేది అనే అర్థంలో శోభాయమాన వాడడం సరైంది కాదు. యమాన అనేది నిజమైనది కాకుండా, ఒకదానివలె కనిపించేది, ఒకదానివలె తోచేది, ఆచరించేది అనే అర్థాల్లో వస్తుంది. శోభయమాన అంటే శోభిస్తున్నది అనే అర్థం రావాలి. కాని శోభ వలె కనిపించేది అని కాదు కదా? అందుచేత శోభామాన అనడం ఉచితం. జయంతి అంటే పెద్దల జన్మదినం అని రూఢి. వర్ధంతి అనే మాటను ఉత్తర భారతీయులు జయంతికి పర్యాయపదంగా వాడుతున్నారు. మనకు అంతకుముందుగానే జన్మదినానికి జయంతి ఉంది కాబట్టి మరణతిథికి వర్ధంతి అని వాడుతున్నాము. చరిత్రకు సంబంధించిన అర్థంలో మనం వాడుతున్న చారిత్రిక అనే పదం కన్నా చారిత్రక అనే పదం వ్యాకరణానికి దగ్గరిది.

సులభంగా, అలవోకగా అనే అర్థంలో కూసువిద్య ప్రయోగిస్తున్నాము. కూసుకన్నడపదం. అలాగే "అక్కుపక్షి" లోని అక్కు కూడా. అక్కు అంటే పక్షి అని అర్థం. జగదంబను జగదాంబ అనడం పొరపాటు జగత్+అంబ=జగదంబ అవుతుంది. కాని జగదాంబ కాదు అన్నారు.

క్షమార్పణం కాదు క్షమాపణం అనాలి. రామార్పణం, అంటే రాముని కొరకు, కృష్ణార్పణం అంటే కృష్ణుని కొరకు అని చతుర్థీ తత్పురుషసమాసం. క్షమార్పణం అలాంటిదికాదు. ఇక్కడ క్షమను అర్పించడం కాదు. క్షమను అర్థించడం, క్షమాప్ ధాతువుపై భావార్థకంలో ల్యూట్ ప్రత్యయం. అని అన–అణ అవుతుంది. క్షమాపణ అంటే క్షమించమని కోరడం. క్షమార్పణం తప్పు అన్నారు వారు.

ప్రదానం–ప్రధానం రెండు వేరువేరు పదాలు. కాబట్టి జాగరూకతతో పలకాలి, వ్రాయాలి. ప్రదానం అంటే బహుమతి ఇవ్వడం అని అర్థం. ప్రధానం అంటే కొన్ని

ప్రాంతాల్లో వివాహ తాంబూలాలు పుచ్చుకోవడమని అర్థం. కొన్నిచోట్ల గర్భదానాన్ని ప్రధానం అని వ్యవహరిస్తారు. ప్రధాన అంటే ప్రథముడు, అతి ముఖ్యుడు, మూలపురుషుడు, రాజుగారి మొదటి సహచరుడు, ముఖ్యమైనది అని అర్థాలున్నాయి. ప్రధాన శబ్దంతో మన తెలుగువారు తృప్తిపడక నను ని చేసి ప్రధాని అంటున్నారు. అవధాని, రాజధానిలాగ. ప్రధాని అంటే సంస్కృత వ్యాకరణం ప్రకారం ప్రధానులు–ముఖ్యులు ఎందరో కలవాడు అనిఅర్థం. అతను ప్రధానమంత్రి కాదు. అతనిపైనో, కిందో ఎందరో ప్రధానులు ఉన్నవాడు అని అర్థం. ఏమైనా ప్రధాని అంటే ప్రధానమంత్రి అని మాత్రం అర్థం కాదు.

హత్య, హంతకుడు అనే పదాల ప్రయోగం తప్పు. అయినా గొర్రెదాటుగా వాటిని ప్రయోగిస్తున్నాము. హత్య అనే పదం హన అనే ధాతువునుంచి ఏర్పడింది. దానికి హింసించడం, వెళ్ళడం అనే అర్థాలున్నాయి. ఈ హత్య అనే పదాన్ని విడిగా వాడరాదని వ్యాకరణ నియమం. దీని వెనక ఒక నుబంత పదం ఉన్నప్పుడే హత్య అనే రూపం ఏర్పడుతుంది. ఉదాహరణకు, గోహత్య, బ్రహ్మహత్య, అశ్వహత్య హనస్తచ అని పాణిని సూత్రం. విడిగా ప్రయోగించాలంటే వధ అనాలి. అలాగే చంపేవాడు అనే అర్థంలో హంతకుడు అనే పదాన్ని తప్పుగా, విరివిగా వాడుతున్నారు. ఘాతకుడు అనవచ్చు. లేదా హంతృకుడు అనవచ్చు. బహుశా అంతక అనే పదం హంతకగా మారి ఉండవచ్చునని తిరుమల రామచంద్ర అభిప్రాయం.

తిరుమల రామచంద్ర 'పలుకుబడి' వ్యాసావళి అన్వీక్షిస్తే – పాత్రికేయుల రచనల్లోని తప్పులు చాలా వరకు కరతలామలకమయ్యాయి.

--------

# వ్యక్తిగా తిరుమల రామచంద్ర

- డా॥ జె. చెన్నయ్య

తిరుమల రామచంద్ర సరస్వతీ పుత్రుడేగాని లక్ష్మీదేవి కటాక్షం లభించలేదు. పత్రికారచయితగా లభించే వేతనం కూడా ఆనాడు అతి తక్కువే కాబట్టి కుటుంబ ఖర్చులకు సరిపోయేదికాదు. ఆంధ్రప్రభలో మద్రాసులో పనిచేస్తూ హైదరాబాద్ బదిలీ కావడంతో 1970లో కుటుంబాన్ని వదిలి వచ్చేశారు. అప్పుడు ప్రారంభమయ్యాయి అసలు కష్టాలు. మద్రాసులో పిల్లల చదువులు, ఇంటి ఖర్చుల కోసం నెలనెలా రామచంద్ర పంపుతున్నా, అందినది అందినట్లే ఖర్చయిపోతూ మనియార్డరు కోసమో, చెక్కుకోసమో వారి సతీమణి అనంతలక్ష్మీ ఎదురుచూడవలసివచ్చేది. ఆమెకు చదువు అంతగా రాదు. డబ్బు పంపమని ఉత్తరాలు రాసే పరిస్థితి లేదు. అవసరాలు చేసిన వత్తిడి భరించలేక ఆరోజుల్లో ఇన్‌లాండ్ లెటర్‌పైన ఇండియన్ బ్యాంకు, ఇండియన్ బ్యాంకు అని ఉన్న ఉత్తరమంతా ఆ పేరేరాసి పోస్టు చేశారట. నిజానికి ఆర్థిక ఇబ్బందులు ఎంతగా చుట్టుముట్టినా దాని గురించి విచారించకుండా ఎదురైన కష్టాన్ని చిరునవ్వుతో, నిర్వికారంగా స్వీకరిస్తూ వచ్చే స్వభావం కలిగిన స్థితప్రజ్ఞులు రామచంద్ర. తాను ఎప్పుడూ ఎంత దూరమైనా బస్సులోనే వెళ్ళేవారు. జేబుదొంగలు ఆయన వద్దనున్న మొత్తాలను కొట్టేసిన సందర్భాలు కూడా వున్నాయి. ఒకసారి కంటి ఆపరేషన్ కోసం హైదరాబాద్‌లో సరోజినిదేవి కంటి ఆస్పత్రిలో కొన్నాళ్ళు ఉండవలసి వచ్చింది. తప్పనిసరై ఇన్‌పేషెంట్‌గా ఉండవలసిరావడం మరోవైపు ఆరోజు కూడా ఏదైనా రాసిపంపితే తప్ప కొంత పారితోషికం రాని పరిస్థితి. ఒకరాత్రి ఆస్పత్రి సిబ్బంది ఆయన కోసం చూస్తే, మంచం మీద లేరు. ఎక్కడికెళ్ళారనే విషయం ఆరా తీస్తే, ఆస్పత్రి ఆవరణలో వీధిలైట్ల వెలుగులో వ్యాసం రాస్తూ కనిపించారు. అలా ఆస్పత్రిలో

వుంటూ కూడా వ్యాసాలు రాసి పోస్టు బాక్సులో వేశారు. డబ్బు విలువ బాగా తెలిసినవారు కాబట్టే తన మిత్రులకు, సన్నిహితులకు, తోటి పత్రికారచయితలకు మంచి సలహాలిస్తుండేవారు. డబ్బును వృధా చేయవద్దని, అనవసర వ్యయాల జోలికి వెళ్ళవద్దని చెప్తుండేవారు. ఆయనకు రెండు జతల ఖద్దరు బట్టలకు మించి ఉండేవికావు. ఏదైనా ఊరెళ్లితే కూడా తన వద్ద నున్న సంచీలో జతబట్టలు వేసుకొని వెళ్ళేవారు. సూట్‌కేసులు, బ్రీఫ్‌కేసులువంటివి ఎరగని నిరాడంబరజీవి. ఎవరైనా మిత్రులతో కలసి ఎక్కడికైనా వెళ్ళవలసివస్తే వాళ్ళు కోరినట్లు టాక్సీలోనో, ఆటోలోనో వెళ్ళక బస్సులోనే వెళ్ళేవారు. 1982లో జరిగిన సంఘటన ఒకటి. మలేషియాలో కౌలాలంపూర్‌లో జరిగిన రెండవ ప్రపంచ తెలుగు మహాసభలకు వెళ్ళినప్పటిమాట. హైదరాబాద్ నుంచి మద్రాసుకు రైల్లోవెళ్ళి అక్కడ్నించి విమానంలో కౌలాలంపూర్ వెళ్ళాల్సివచ్చింది. మద్రాసు స్టేషన్ నుంచి విమానాశ్రమానికి టాక్సీలో వెళదాం. డబ్బులు మేమే ఇస్తామని కిన్నెర ఆర్ట్ థియేటర్స్ రఘురాం మొదలైన మిత్రులు అంటే రామచంద్ర ఒప్పుకోలేదు. తనతోపాటు వాళ్ళనుకూడా బస్సులోనే తీసుకెళ్ళారు.

పేదరికాన్ని జీవనవ్రతంగా స్వీకరించి కుటుంబంలో భర్తగా, పిల్లలకు తండ్రిగా, పత్రికా కార్యాలయంలో ఉద్యోగిగా, తెలుగు భాషా సంస్కృతుల రంగంలో పేరున్న పండితునిగా ఆయన కృషికి ఏలోటూ చేయలేదు. పగలంతా పత్రికా కార్యాలయంలో ఎంతో వత్తిడివున్న పరిస్థితిలో పనిచేసేవారు. రాత్రి ఆలస్యంగా ఇంటికి వచ్చిన తర్వాత కూడా రాత్రంతా రచనలు చేస్తూ గడిపేవారు. మధ్యలో పిల్లలు నిద్రలేస్తే, వారికి చక్కగా కథలు, కబుర్లూ చెప్పి నిద్రపుచ్చేవారు తప్ప విసుక్కొనే మనిషికాదు. ఉదయం ఇంటెడుపనిలో మునిగిపోయేది వారి శ్రీమతి. వంటచేయడం, ఇల్లు శుభ్రపరచుకోవడం, పిల్లల్ని తయారుచేయడం వంటి పనులతో ఆమెకు ఊపిరి సలపని రీతిలో వుండేది. అలాంటి సందర్భాల్లో తాను రాత్రంతా రాసుకుని అలసిపోయాననో, ఆఫీసుకు వెళ్ళేందుకు సిద్ధమవుతున్నాననో తన కోసం వత్తిడి పెట్టకుండా ఆడపిల్లలను కూడా జడవేసి సిద్ధంచేసి బడికి పంపేవారు.

ఆయన ఎదుటివారిపట్ల ఎంతో ప్రేమగా, గౌరవంగా, ఆప్యాయంగా ఉండేవారు. తనకంటే వయసులోనూ, హోదాలోనూ పెద్దలైనా, చిన్నవారైనా తేడా చూపేవారు కారు. చిన్నవారైతే ఆయన హితబోధతో ఎంతో లబ్ధిపొందే అవకాశం లభించేది. జీవితంలో ఎలా పైకిరావాలో, ఏరంగంలో ఎలా ముందుకు సాగాలో, జీవితాన్ని ఎంత జాగ్రత్తగా కొనసాగించాలో, ఉన్నంతలో డబ్బును ఎలా పొదుపుగా

ఖర్చుపెట్టాలో చెప్పేవారు. ఆయనకు సన్నిహితులైనవారు తమ కష్టాల్ని చెప్పుకొని వాటినుంచి బయటపడేదాకా వారినుంచి సలహాలు కోరేవారు. ఇతర ప్రాంతాల్లోనివారికి కొంత సమయము కేటాయించి ఉత్తరాలు రాయడం ద్వారా ఆయన ఆపని చేసేవారు. కష్టాల్లో వున్నవారికి ఎంతో ధైర్యం చెప్పేవారు. చిన్నవయసులోనే ఊరువదిలి ఎన్నో ప్రాంతాలకు వెళ్ళి, అక్కడి పరిస్థితులకు అనుగుణంగా జీవితాన్ని సాగించి ఎన్నో కష్టనష్టాలను నిబ్బరంగా భరించి, ఆ మనుగడ పోరాటంలో ఎంతో అనుభవాన్ని, జ్ఞానాన్ని సముపార్జించినవారు కాబట్టి ఆ అనుభవాన్ని, జ్ఞానాన్ని ఇతరుల బాగుకోసం ధార పోసేందుకు ప్రయత్నించేవారు.

తోటివారిని ఎంతగానో గౌరవించేవారు. చిన్న ఉపకారం చేసినా మహోపకారం చేశారని నిండుమనసుతో పదేపదే కృతజ్ఞతలు చెప్పేవారు. ఎవరు ఏ చిన్న మంచిపని చేసినా వెన్నుతట్టి ప్రోత్సహించి ఉత్సాహపరచేవారు. ఎప్పటికప్పుడు ఎవరి ఋణాన్నయినా తీర్చేసేవారు. వారి శ్రీమతి చేసే సేవలకు కూడా కృతజ్ఞతలు చెప్పే అలవాటున్న విశిష్ట వ్యక్తిత్వం రామచంద్రది. అనంతలక్ష్మిగారు ఈయన కోపాన్ని కూడా భరిస్తూ అన్నీ అమర్చే అనుకూలవతి అయిన ఇల్లాలు. ఆయన బస్సులో వెళు తున్నప్పుడో, ఏదో సమావేశంలో కూర్చున్నప్పుడో ఏ ఆలోచన వచ్చినా చిత్తు కాగితాలపైన, ఆఖరికి బస్సు టిక్కెట్ల వెనుకా రాసుకునేవారు. అలాంటి కాగితపుముక్కలు ఇంట్లో పారేసుకొనేవారు. వాటిని ఇంకెవరైనా అయితే చిత్తు, కాగితాల కిందే జమకట్టి ఊడ్చి అవతల పారబోస్తారు. కాని అనంతలక్ష్మిగారు మాత్రం ప్రతిముక్కనూ ఎంతో జాగ్రత్తగా, భద్రపరచేవారు. ఆయన ఆ పేపరు ముక్కలకోసం వెతుకుతుంటే దేనికోసం వెతుకుతున్నారని కనుక్కొని మరీ వాటిని ఇచ్చేవారు. ఆయన ఎంతో ఆనందించి ఆమెకు మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పేవారు. భార్య కాబట్టి తనకు సేవలు చేయడం ఆమె విధి అని ఏనాడు భావించలేదు. ప్రతి మేలుకు స్పందించి థాంక్స్ చెల్లించేవారు.

రచయితలు, పాత్రికేయులు, ఇతర ముఖ్యస్థానాల్లో వున్నవారు తమ కుటుంబాల గురించీ, పిల్లల గురించి పట్టించుకోరు. వారికి సమయం చిక్కకపోవడం ఒక కారణమైతే సమయాన్ని వారికోసం కొంత కేటాయించేందుకు ఏమాత్రం ప్రయత్నించకపోవడం మరో కారణం. రామచంద్ర అలాకాదు. నిజంగా సమయం చిక్కకపోయినా ప్రయత్నించి భార్యాపిల్లల గురించి ఆలోచించే వారు. సమయము కేటాయించేవారు. జీవితంలో మంచి చెడుల గురించి వారికి చెప్పేవారు. పండితపుత్ర పరమశుంఠ అన్న లోకోక్తిని పూర్వపక్షం చేస్తూ పిల్లల్ని బాగా చదివించారు. విద్యేతరమైన

విషయాలను సైతం శ్రద్ధతో బోధించేవారు. ఏ ఊరెళ్ళినా తిరిగి వచ్చేటప్పుడు పిల్లలకు చిన్నచిన్న బహుమతులను తేవడం మరచిపోయేవారు కాదు.

పెద్దకుమార్తె, డా॥నీరజ మద్రాసు విశ్వవిద్యాలయములో తెలుగు సాహిత్యంలో పిహెచ్.డి చేశారు. కొడుకు శేషశాయి, రెండోకుమార్తె ఆముక్తమాల్యద కూడా పిహెచ్.డి చేసినవారే. శేషశాయి పత్రికారచయితగా తనవారసత్వం నిలబెట్టాలని కోరుకున్నారు. ఆ కోరికను కుమార్తె నీరజ నెరవేర్చారు. రామచంద్ర పట్టుబట్టి ఆమె చేత జర్నలిజం చదివించారు. ఆమెకు పత్రికారచనాశాస్త్ర విషయాలకు సంబంధించి ఆయనే నోట్స్ రాసిచ్చారు. ఆమె మంచి మార్కులతో ఉత్తీర్ణురాలయ్యారు. రామచంద్ర ఎంతో సంతోషించారు. తండ్రి పనిచేసిన ఆంధ్రప్రభ దినపత్రికలో చాలాకాలం పనిచేశారు. ముఖ్యంగా ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం విభాగంలో తనకున్న భాషాసాహిత్యపరిజ్ఞానం, నాన్న నేర్పిన ఎన్నో విషయాల వల్ల లభించిన అవగాహనతో విశేషమైన సేవలందించి తనపేరు నిలబెట్టారు.

రామచంద్రతో వయోభేదాలకతీతమైన ఆనందానుభూతిని కలిగించేది. అంతటి సౌజన్యం మూర్తీభవించిన వ్యక్తి ఇంట్లోవున్నా, కార్యాలయములోవున్నా తన చుట్టూ వున్నవారితో ఎంతో ఆత్మీయంగా మెలిగేవారు. ఆ రకమైన ఆత్మీయత ఆయన వ్యక్తిత్వంతో పెనవేసుకుపోయిన వారెందరో నేటికీ వున్నారు. ప్రముఖ పండితులు కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి ఇంట్లో రామచంద్ర అద్దెకుండేవారు. నిజానికి ఇద్దరి మధ్య పాండిత్యపరమైన సాన్నిహిత్యము, అనుబంధమేకాదు సొంత అన్నదమ్ముల అనుబంధం వుండేది. ఇంటిని ఖాళీ చెయ్యడానికి ప్రయత్నించినప్పుడల్లా లక్ష్మణశాస్త్రిగారు వారించేవారు. రామచంద్ర తన సామాన్లను రిక్షా ఎక్కించినప్పుడల్లా ఆ ఇంటివారు సామాన్లను దింపించేవారు. 12 ఏళ్ళపాటు ఆ ఇంట్లో పేరుకు మాత్రమే అద్దెకున్నారు రామచంద్ర. వారి మధ్య అవ్యాజమైన సోదరప్రేమ అవిచ్ఛిన్నంగా కొనసాగింది. ఇక్కడ వస్తుపరంగా రామచంద్ర చిన్నవాడు. లక్ష్మణశాస్త్రి నామధేయులైన కప్పగంతులవారు పెద్దవారు. అంతే తేడా. అది తప్పితే ఇద్దరూ ఆ రామలక్ష్మణుల్లా పరస్పరం గౌరవించుకున్నారు.

బహుభాషావేత్తగా ఆయన ఒక్కనాటితో రూపొందినవారుకాదు. అధ్యయనం అపారంగా సాగించి భాషాజ్ఞానాన్ని ఔపోశనపట్టిన ఫలితంగా ఆస్థాయికి చేరుకున్నారు. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, భారతి వంటి ప్రధానమైన పత్రికలకు సంపాదకుని స్థాయిలో పనిచేసినా ఆయన ఎక్కువగా తెరవెనుకపాత్రగానే మిగిలిపోయారు. దానికాయన

ఎప్పుడూ బాధపడిన దాఖలాలు లేవు. ఆయన తనది భాషాసేవకుని పాత్రగానే భావించి ఆ పాత్రను పరమపవిత్రంగా, నిస్వార్థంగా చేశారు. భాషాదోషాలు పెరిగిపోవడంపై ప్రత్యేక దృష్టి వారికి వుండేది. పత్రికా రచనలోనేకాకుండా జనవ్యవహారంలో కూడా దొర్లే తప్పులను ఎత్తి చూపేవారు. భాషను సుసంపన్న చేసేందుకు ఎన్నో శీర్షికలు నిర్వహించారు. భాషాదోషాలేవో, సరైన రూపాలేవో సోపపత్తికంగా పేర్కొనే సందర్భంలో తన పాండిత్యాన్ని చాటుకొనే ప్రయత్నం చేయకుండా విశ్లేషణకే ప్రాధాన్యమిచ్చారు. ఎంతో మంది అలనాటి సంపాదకులతో కలసి పనిచేసిన కాలంలో తాను నేర్చుకున్న విలువైన అంశాలను తన శీర్షికల ద్వారా,తన గ్రంథాల ద్వారా అందించారు.

వారు ప్రచారానికి దూరంగా ఉండేవారు. సన్మాన సత్కారాలకు కూడా ఎంతో దూరం వుండేవారు. అందువల్లనే ఆయనకు రావలసినంత గుర్తింపు రాలేదు. అలా తమ కృషికి తగిన గుర్తింపు రాకపోతే బాధపడ్డవారు మనకు కనిపిస్తారు. అది సహజం. కాని తిరుమల రామచంద్ర గుర్తింపుకోసం పాకులాడకపోవడమే గాక ఇది లభించలేదని ఇసుమంతైనా బాధపడనూలేదు. ప్రచార సామగ్రి కూడా ఆయన వద్ద ఉండేదికాదు. తన ఫొటోనో, తన గురించిన సమాచారాన్ని ఒకచోట రాసి పెట్టుకోవడమో ఆయన చేయలేదు. ఈ విషయంలో స్వానుభవం ఒకటివుంది. 1993లో ఆయనకు తెలుగు విశ్వవిద్యాలయం విశిష్ట పురస్కారం ప్రకటించినప్పుడు ఆహ్వానపత్రంలో ఫొటోవేయడం సంప్రదాయం. ఆయనను అడిగితే లేదన్నారు. ఈ వ్యాసకర్త ఆయనను తన ద్విచక్రవాహనంపై సమీపంలోని ఫొటోస్టూడియోకు తీసుకువెళ్ళి ఫొటో తీయించుకున్నారు.

ఎవరికైనా మాట ఇస్తే కట్టుబడి వుండేవారు. కలుసుకోడానికి వచ్చే వారికి తన సమయాన్ని కేటాయించేవారు. తన దగ్గర కూర్చోబెట్టుకొని తెలిసిన విశేషాలను వివరించేవారు. చివరి వరకూ అదే విధానాన్ని కొనసాగించారు. ఆకస్మికంగా అనారోగ్యం కలిగింది. చూసుకొనేవారు లేరు. అమ్మాయి వారిని దగ్గర్లోని తమ ఇంటికి తరలించుకువెళ్ళారు. అలాంటి పరిస్థితిలో కూడా రామచంద్ర తనకోసం వచ్చేవారికి కలిగే అసౌకర్యం గురించి ఆలోచించారు. 'నాకు అనారోగ్యంగా వుంది. ఫలానా చిరునామాలో మా అమ్మాయిగారి ఇంట్లో వుంటాను. ఎవరైనా నాకోసం వస్తే ఈ చిరునామా గుర్తించుకొని అక్కడికి రండి' అని తమ గది తలుపుపై రాశారు. ఈ విషయాన్ని ఇరుగుపొరుగువారికి కూడా చెప్పివుండవచ్చు. కాని ఎవరైనా తనకోసం వచ్చినప్పుడు అడగడానికి ఆ సమయములో ఎవరూ కనిపించకపోతే ఇబ్బంది పడతారని

భావించి స్వహస్తాలతో వివరాలు రాసిన వ్యక్తి రామచంద్ర. ఇంతకంటే గొప్ప కమ్యూనికేటర్, మానవతామూర్తి ఎవరుంటారు చెప్పండి?

రామచంద్రగారి జీవితాన్నంతటినీ పరిశీలిస్తే వ్యక్తిగతమైన విషయాలపట్ల శ్రద్ధ చూపినట్లు కనిపించదు. పదవులు, ప్రభుత్వ ఉద్యోగాలు సంపాదించాలని, వాటికోసం పలుకుబడి కలిగినవారిని ఆశ్రయించాలనే ఆలోచనేలేదు. ఏదో తెలుసుకోవాలని, ఎటువంటి పరిస్థితుల్లోనైనా ఇమిడిపోయి జ్ఞాన సముపార్జనా లక్ష్యాన్ని నెరవేర్చుకోవాలని, తెలుసుకున్న దానితో సంతృప్తిపడరాదని తపనపడేవారు. ఆ పూట భోజనం చేస్తేచాలు. ఆ ఊరు చేరడానికి టికెట్టుకు డబ్బులుంటేచాలు. వాటితోనే సరిపెట్టుకొని ఎక్కడెక్కడికో వెళ్ళారు. ఎవరెవర్నో కలిశారు. అనేక భాషల్లో విద్యను ఆర్జించారు. అనుభవాన్ని ఆర్జించారు. హంపీ నుంచి హరప్పాదాక అలుపెరుగక అతి సామాన్యమైన బాటసారిగా సాగి తన జ్ఞానాన్ని అజరామరంగా నిలిచే విధంగా పుస్తకాల్లో నిక్షిప్తం చేసి అంతే సామాన్యంగా ఈ లోకం నుంచి నిష్క్రమించారు.

--------

# శతజయంతి ఉత్సవం : సమీక్ష

**- నందిరాజు రాధాకృష్ణ**

వేదికపై, వేదికకు అభిముఖంగా ఆశీనులైన సాహితీమూర్తులకు అభివాదాలు. సదస్సు ఆసాంతం విరామం కోరుకోకుండా సహనం వహించిన అక్షర అభిమానులకు, సాహితీప్రియులకు మరోసారి అభివందనాలు. ఒక విశిష్టవ్యక్తిని గురించి ఒకరోజల్లా స్మరించుకున్నాం. తిరుమల రామచంద్ర నిజంగా సాహితీ కృషీవలుడు. ఆయన సరళమైన, సలక్షణమైన, సహజసుందరమైన తీయనైన తెలుగుభాషకు పట్టంకట్టి పత్రికా రచయితలకు మార్గదర్శకులుగా నిలిచిపోయారు. తిరుమల రామచంద్ర శతజయంతి ఉత్సవం తెలుగునేలపై ఒక చారిత్రిక ఘట్టం. నాకు తెలిసి ఒక రచయిత అయిన పాత్రికేయుని శతజయంతి వేడుక జరుపుకోవడం ఇది రెండోది. తెలుగుపత్రికారంగంలో మకుటాయమానంగా వెలుగొందిన నార్లవెంకటేశ్వరరావు గారిది మొదటిదికాగా, ఇప్పుడు తిరుమల రామచంద్రకు మాత్రమే ఆ గౌరవం లభించింది. నార్లవారి శతజయంతిని గుంటూరులో వైభవోపేతంగా నిర్వహించారు. ఇప్పుడు రాష్ట్ర రాజధానిలో రామచంద్ర శతజయంతి పురస్కరించుకుని సదస్సు జరుపుకున్నాం. దీన్ని సాహిత్య అకాడెమీ భుజస్కంధాలపై వేసుకుని నిర్వహించడం, వయోధిక పాత్రికేయ సంఘం ఇందులో పాలుపంచుకోవడం విశేషం.

నిత్యప్రవాహమైన తెలుగుభాష అనేక కారణాల వలన కాలుష్యానికి గురయింది. ప్రపంచీకరణ అందుకు దోహదపడింది. అయితే భాష స్వచ్ఛతను, శబ్దస్వరూపాన్ని పరిరక్షించడానికి పట్టుదలతో కృషి చేసిన పాత్రికేయులలో రామచంద్ర ఒకరు. ఈ మహానుభావుని రచనలను సమగ్ర సాహిత్య సంపుటాలుగా ప్రచురించేందుకు అధికార భాషా సంఘమో, తెలుగు విశ్వవిద్యాలయమో, తెలుగు అకాడెమీనో సంకల్పిస్తే భాషను

నిలబెట్టినట్లవుతుంది. తెలుగు సాహిత్యం, పత్రికారంగాల్లో ప్రాతః స్మరణీయులు శ్రీ రామచంద్ర. ప్రాకృత, సంస్కృతాంధ్ర సారస్వతాలలో నిష్ణాతునిగా, ద్రావిడ భాషల పరిశోధకునిగా విశిష్ట సేవలందించిన రామచంద్ర జీవితం ఉత్కంఠభరితం. 84 సంవత్సరాల జీవితంలో అర్థశతాబ్దంపాటు పత్రికా రచనకే అంకితమైన అక్షరశిల్పి ఆ మహనీయుడు. ఆయన మనస్సుతో మనస్విగా బతికారు. ఆయన నిరాడంబర వచస్వి, 60 ఏళ్ళకు షష్ఠిపూర్తి చేసుకోలేదు. 70 ఏళ్ళకు సప్తతి జరగలేదు. 80 ఏళ్ళకు 'అశీతి' అసలే లేదు. 84 ఏళ్ళ సహస్రచంద్ర దర్శనం సమకూరలేదు. ప్రచారానికి ఏనాడూ ఆయన అంగలార్చలేదు. నిరాడంబరత, నిండుమనసు, ఓరిమి ఆయన వ్యక్తిత్వంలో ఇమిడిపోయాయి. అంతటి మహామహోపాధ్యాయుని శతజయంతి సభలో దిగ్గంతులు, దిగ్గజాలు, మేరునగధీరులైన పత్రికా సంపాదకులు ప్రసంగించిన విద్వద్గోష్ఠిలో పాల్గొనే అవకాశం నిజంగా నా అదృష్టం. అందరి సాంగత్యంలో పని చేయగలగడం అపూర్వ అవకాశం. పండిత పాత్రికేయుడుగా పురస్కారాలు అందుకున్న రామచంద్రను ఎన్నో కోణాల నుంచి స్పృశించారు అక్షరయోధులు. ఒక సామాన్య పత్రికా రచయితలో ఎన్ని విశిష్ట లక్షణాలు ఉన్నాయో ఉదయం నుంచి సాయంత్రం వరకు జరిగిన విద్వద్గోష్ఠి సాహిత్య అభిమానులకు వివరించగలిగారు.

ఉదయం నుంచి ఇప్పటివరకు సాగిన సదస్సు మూడు భాగాలను సంక్షిప్తీకరించే ప్రయత్నమే ఈ సమాపనోపన్యాసం. 11 మంది ఉద్దండుల వివరణాత్మక ప్రసంగాలు, పరిశోధనా పత్రాలను సంక్షిప్తంగా చెప్పడానికి పూనుకోవడం దుస్సాహసమే.

ఉదయం దీపోత్సవం అనంతరం సాహిత్య అకాడెమీ ఆఫీసర్ ఇన్‌చార్జ్ ఎస్.పి. మహాలింగేశ్వర్ ఆహూతులకు స్వాగతం పలుకుతూ సదస్సు లక్ష్యాన్ని వివరించారు. భాషాసేవలో, వివిధ భాషా పరిశోధనల ప్రోత్సాహంలో, ప్రచురణ కార్యక్రమాలను సోదాహరణంగా వివరించారు. ప్రారంభోపన్యాసం చేసిన ఆచార్య ఎన్.గోపి, తిరుమల రామచంద్రతో సాంగత్యం, సాన్నిహిత్యం వివరించారు. సదస్సు ఈ రూపం దాల్చడానికి వయోధిక పాత్రికేయ సంఘం చొరవ కారణమని అభినందించారు. సదస్సు నిర్వహణకు సాహిత్య అకాడెమీ ఆసక్తి కనబరచి ముందుకు రావడం హర్షణీయమన్నారు.

దాదాపు ఆరు దశాబ్దాలపాటు పత్రికారంగంలో అపూర్వ అనుభవం గడించి తెలుగు పాత్రికేయులకు ఆచార్యులుగా విరాజిల్లుతున్న డాక్టర్ జి.ఎస్.వరదాచారి తమ ప్రారంభోపన్యాసంలో, రామచంద్రను నిరాడంబరుడు, నిగర్వి, నిక్కచ్చిమనిషిగా

అభివర్ణించారు. ఆయన మహాపండితుడు, నిష్కపటి అని పేర్కొన్నారు. ఒక భాషాసేవకుని గురించి, పత్రకార్ శిరోమణి గురించి చెబుతూ లక్ష్మీకటాక్షానికి ప్రాకులాడని యావజ్జీవ సాహితీ కృషీవలుడన్నారు. ఆయన లక్ష్యశుద్ధి గల రచయితగా పేర్కొన్నారు. రామచంద్ర రచలన్నింటిలోనూ పాత్రికేయధర్మం కనిపిస్తుందని పత్రికా రచనలో విషయాన్ని బట్టి భాష, దానిని బట్టే శైలి సూత్రాన్ని పాటించారన్నారు. సత్యనిష్ఠ వీడకుండా విషయాన్ని పాఠకప్రియంగా వివరించిన పాత్రికేయుని గురించి తెలిపారు. రామచంద్ర ఆత్మకథాత్మక యాత్రా కథనం "హంపీ నుంచి హరప్పా దాక"లో సొంత గోడుకంటే సమకాలీన సామాజిక స్థితిగతుల చిత్రణే ఎక్కువగా కనిపిస్తుందన్నారు. పాత్రికేయుడు ఎలా వ్రాయాలో, ఎలా వ్రాయకూడదో గొప్పగా వివరించారన్నారు.

ద్రవిడ విశ్వవిద్యాలయం పూర్వ ఉపాధ్యక్షుడు ఆచార్య రవ్వా శ్రీహరి ముఖ్య అతిథి ప్రసంగంలో రామచంద్ర గుణగణాలు, భాషా సామర్థ్యాలను వివరిస్తూ ప్రాచీన పండితుడైనా పుష్కలంగా నవీనతను సంతరించుకున్న రచయిత, నిత్యసత్య శోధకుడు, దేశభక్తుడు, నిరాడంబరుడు, అనువాదకుడు, సమీక్షారచయిత, పరిశోధకుడు, బహుభాషా మహాపండితుడు, లిపి శాస్త్రజ్ఞునిగా అభివర్ణించారు. వివిధ భాషా సాహిత్యాలలో పరిశోధన విమర్శ రంగాల్లో రామచంద్ర మహనీయమైన కృషి చేశారన్నారు. రామచంద్ర సంస్కృతాంధ్రాల్లోనే కాకుండా ప్రాకృతంలో గొప్ప పరిశోధన చేసిన విద్వాంసులుగా అభివర్ణించారు. మౌలిక రచనల్లోనేకాక అనువాద రచనల్లోనూ ఆయన సిద్ధహస్తులని ఆచార్య శ్రీహరి పేర్కొన్నారు.

రామచంద్రగారి పాళీ-ప్రాకృతం పరిశోధన గురించి ఆచార్య చౌడూరి ఉపేంద్రరావు సోదహరణంగా వివరిస్తూ ఆయనకు పాకృతమంటే ఆదరాభిమానాలు ఎక్కువన్నారు. తెలుగు భాషపైనే కాకుండా సాహిత్యంపై కూడా పాళీ-ప్రాకృతాల ప్రభావం ఎక్కువని రామచంద్ర అభిప్రాయపడేవారన్నారు. తల్లిదండ్రుల, మిత్రుల మహత్త్వ ఆకాంక్షలకు ఏమాత్రం గురికాకుండా, ఏ ఇతర బంధాలలో చిక్కుకోకుండా యదేచ్ఛగా జీవితం కొనసాగించాలన్న విశిష్టవ్యక్తి అని, బాల్యంనుంచే ప్రతిభను ప్రదర్శించడం ప్రారంభించారన్నారు.

శ్రీ ఎం.నారాయణశర్మ తమ పత్ర సమర్పణలో రామచంద్ర భాష, లిపి, సాహిత్యాంశాలపై వెలువరించిన అనేక అభిప్రాయాలు, గ్రంథాలు భవిష్యత్ తరాలకు మార్గదర్శకాలన్నారు. తెలుగు పదాల ఉనికి ఎక్కువగా ద్రవిడజాతుల నుంచేనని

రామచంద్ర విశ్వసించే వారన్నారు. కాకతీయలిపిని తిక్కనలిపి, రెడ్డికాలపు లిపిని శ్రీనాథలిపి అని రామచంద్ర వ్యవహరించారన్నారు. రామచంద్ర తదనంతరం తెలుగులో శాసనపరిశోధన మరింత ముందుకు వెళ్ళిందని తెలిపారు. తెలుగు ప్రాంతమే కాక, భారతదేశమే కాక సంపూర్తిగా ప్రపంచలిపి పరిణామాన్ని పిడికిట పట్టుకున్న రామచంద్రగారి రచన "మనలిపి-పుట్టుపూర్వోత్తరాలు" ఈమార్గాన్ని అందిపుచ్చుకుని అకాడెమీలు ముందుకు సాగితే ప్రాచీనుల కాంక్షలు నిజమవుతాయన్నారు.

పాత్రికేయ ప్రముఖులు, వరిష్ఠ సంపాదకులు డాక్టర్ ఎ.బి.కె.ప్రసాద్ తమ ఉపన్యాసంలో వివిధ రంగాలలో మేరునగధీరులైన బహుముఖీన కృషిని సామాన్య పాఠకలోకానికి చేర్చగల వ్యవహారిక భాషాచణులైన పాత్రికేయుల చేయూత అవసరమన్నారు. భావితరాలకు సాంస్కృతిక లిఖిత, అలిఖిత వారసత్వాన్ని భద్రంగా బట్వాడా చేయగల రచనా పాటవం గలిగిన పండిత-పాత్రికేయతరంలో కొసమెరుపుగా, ధృవతారగా వెలుగొందిన స్మృతిబింబం తిరుమల రామచంద్ర అని శ్లాఘించారు. రామచంద్ర కలం క్రమంగా లేఖినీ చిత్రాలలో చిందులేసుకుంటూ స్త్రీమూర్తి వర్ణనలో, శ్రమజీవన సౌందర్యానికి, శ్రామిక జనవిజయానికి అద్భుత శిల్పాకృతి కల్పించిన దేవీ ప్రసాద్‌రాయ్ చౌదరి కళాత్మక సొబగులలో విలీనమై పోయిందన్నారు. దిషణ ఉన్న దిలాస పండితుడేగాని, రామచంద్ర విలాస పురుషుడు కాదన్నారు.

మరోరచనా దురంధరులు, విశేషానుభవ పాత్రికేయులు శ్రీ కల్లూరి భాస్కరం రామచంద్రతో తమకున్న వ్యక్తిగత పరిచయం, సాంగత్యం వివరిస్తూ, ఆయన ఎప్పుడు కనిపించినా, ఒక నిత్య సంచారి కాసేపు ఒక చెట్టుకింద ఆగినట్లుతోచే వారన్నారు. ఆయన ఆహార్యం ఎంతో సాదాసీదాగా ఉండేదని, అయితే ఆయన చూపుల్లో జిజ్ఞాస నిరంతరం పొంగిపొర్లుతుండేదన్నారు. మౌలికంగా రామచంద్ర సంస్కృతాంధ్ర ప్రాకృతాది భాషలలో సంప్రదాయాలకు చెందిన పండిత వారసత్వం నుంచి వచ్చారని, స్థలకాలాలను కూడా మరచిపోయి హోరాహోరీ పండిత చర్చలు సాగిన బంగారు కాలానికి చెందిన వారని పేర్కొన్నారు. వివిధ ఆకారాలనుంచి పురాచరిత్రను పరిశీలించాలన్న ఆసక్తి చూపేవాళ్ళకు రామచంద్ర వంటి పండితులు కరవవుతున్న వెలితి భూతద్దంలో కనిపిస్తున్నదని ఆవేదన వెలిబుచ్చారు.

సాహిత్యం, సంగీతం, కళలు వంటి రంగాలలో చేయితిరిగిన సీనియర్ పాత్రికేయులు శ్రీ టి.ఉదయవర్లు 'పాత్రికేయుల రచనలు-పలుకుబడి' అన్వీక్షణంలో బహుభాషావేత్త రామచంద్ర అభివర్ణించినట్లు భాషా ప్రవాహాన్ని ఏ నదిలోనైనా

ప్రవాహమార్గంలో ఎన్నెన్నో ఉపనదులు, వాగులు వంకలు వచ్చి చేరిపోయినట్టుగా, అవి ఎన్ని ఎక్కువ సంఖ్యలో చేరితే అది అంతమహానది అవుతుందన్నారు. ఏ భాషా ప్రాంతంలోనైనా దాని ఇరుగుపొరుగుతో, ఇతర ప్రాంతాలనుంచి చుట్టపుచూపుకువచ్చే వారితో కళకళలాడుతూ పరస్పరం ఇచ్చిపుచ్చుకునే సందర్భాలలో కొత్తపదాలు చేరిపోతాయని చెబుతూ, ఇదిక్రమంగా ఓ పూవు పూసినట్టు జరిగే భాషావికాసమన్నారు. పత్రికలలో వందలసంఖ్యలో సంస్కృత భాషాపదాలు తప్పుగా వాడుతున్నారని, ఎలక్ట్రానిక్ రంగంలో వినిపించే అపప్రయోగాలు బహుళ ప్రచారమై ప్రజలనోళ్ళలో నానుతున్నాయని విచారం వెలిబుచ్చారు. ప్రతిపాత్రికేయుడు రామచంద్ర "పలుకుబడి"ని చదవాలన్నారు. రామచంద్ర ఆత్మకథ "హంపీ నుంచి హరప్పాదాక"ను స్పృశిస్తూ, సీనియర్ పాత్రికేయులు శ్రీ ఆర్వీరామారావు ఆయన ఆరినా వెలుగులు విరజిమ్మే దీపమని కొనియాడారు. ప్రముఖుల ఆత్మకథలను ఆయన ప్రస్తావిస్తూ, ఆ కథలు వ్యక్తుల జీవిత విశేషాలను వ్యక్తం చేయడానికి ఉపకరిస్తాయంటూ, అటువంటి ఆత్మకథల ప్రయోజనం పరిమితంగా ఉంటుందని అన్నారు. సమకాలీన, సమాజ స్థితిగతులను తమ దృక్కోణం నుంచి చెప్పడానికి, తమ జీవితవిశేషాలను తెలపడానికి ఆలంబనగా చేసుకుంటే సర్వజనామోదంగా తయారు కావడమే కాకుండా సార్వకాలీనంగా ఉంటాయని చెబుతూ రామచంద్ర ఆత్మకథ "హంపీ నుంచి హరాప్పాదాక" అందువల్లనే తెలుగుజాతి ఆత్మకథలా నిలిచిందన్నారు. "రామచంద్ర జీవితం వడ్డించిన విస్తరీ కాదు, పూలపానుపూ కాదు. ఆయన జీవితం అక్షరాలా జీవనసమరం. ఆ సమరాన్ని ఆయన ముళ్ళబాట అనుకోలేదు. ఆయన కర్మవాది. ఫలితం గురించి ఏనాడూ పట్టించుకోలేదు" అన్నారు.

పాత్రికేయునిగా ప్రారంభించిన జీవితాన్ని అధ్యాపకునిగా మరుల్చుకుని, రచయితగా నిలదొక్కుకున్న డాక్టర్ జె.చెన్నయ్య రామచంద్రుని ఉదాత్త చరితుడన్నారు. ఆయన సరస్వతీ పుత్రుడేకాని, లక్ష్మీపుత్రుడు కాదని, కావాలని కోరుకోనూ లేదని పేర్కొన్నారు. కష్టాల కడలిని బహునేర్పుగా ఈదగలిగిన సహనశీలిగా వర్ణించారు. నిరాడంబరత ప్రస్తావిస్తూ ఎంతదూరమైనా బస్సుల్లో వెళ్లేవారే కాని ఇతరుల సొమ్మేకదా అని ఎప్పుడూ కార్లెక్కిన వారు కాదన్నారు. డబ్బువిలువ, శ్రమగౌరవం ఆకళింపు జేసుకున్న గొప్పవ్యక్తిగా రామచంద్రను పేర్కొంటూ, డబ్బు వృథాచేయవద్దని, అనవసర వ్యయాల జోలికి అసలే వెళ్ళొద్దని సహచర పాత్రికేయులు, రచయితలకు చెప్పేవారట. వ్యక్తులపట్ల ప్రేమగా, గౌరవంగా, ఆప్యాయంగా ఉండేవారన్నారు. కష్టాల్లో ఉన్నవారికి

ధైర్యం చెప్పేవారన్నారు. మనుగడ పోరాటంలో అనుభవం, జ్ఞానం సంపాదించిన మహోన్నతునిగా తన అనుభవం, జ్ఞానం ఇతరుల బాగుకోసం ధారపోయడంలో నిమగ్నమయ్యారన్నారు.

--------

# ప్రసంగ కర్తల సంగ్రహ పరిచయాలు

**డా॥ జి.యస్ వరదాచారి** జగమెరిగిన జర్నలిస్టు. వీరు ప్రస్తుతం వయోధిక పాత్రికేయుల సంఘం అధ్యక్షులుగా ఉన్నారు. దాదాపు 60 సంవత్సరాల పాత్రికేయ జీవితంగల వీరు ఆంధ్రజనత, ఆంధ్రభూమి, ఈనాడు దినపత్రికల సంపాదక వర్గంలోనే కాకుండా పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం జర్నలిజం శాఖలో ప్రధాన ఆచార్యులుగా, ఇటీవలి వరకు హెచ్.యం.టి.వి.లో తీర్పరిగా పనిచేశారు. వీరు రచించిన "దిద్దుబాటు", "ఇలాగేనా రాయడం", తెలుగు పత్రికలు-తీరుతెన్నులు జర్నలిస్టులకు కర దీపికలు. పై వ్యాసం తిరుమల రామచంద్ర శతజయంతి సదస్సు ప్రారంభోపన్యాసం.

**ఆచార్య రవ్వా శ్రీహరి** సంస్కృతాంధ్ర భాషలలో గొప్ప పండితుడు. వీరు ప్రస్తుతం తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణల విభాగం ప్రధాన సంపాదకులుగా ఉన్నారు. లోగడ వీరు ద్రవిడ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా పనిచేశారు. సూర్యరాయాంధ్ర నిఘంటు శేషంగా వీరు కూర్చి ప్రచురించిన "శ్రీహరి నిఘంటువు" వీరి భాషాసేవకు మచ్చుతునక. "తెలుగులో అప ప్రయోగాలు", "తెలుగులో అలబ్ధ వాఙ్మయం" ఇత్యాది గ్రంథాలు వ్రాశారు. గుర్రం జాషువా "గబ్బిలము" కావ్యాన్ని, డా॥ సి. నారాయణ రెడ్డి "మట్టి-మనిషి-ఆకాశం" కావ్యాన్ని సంస్కృతంలోకి అనువదించారు. పై వ్యాసం సదస్సులో వీరు సమర్పించిన కీలకోపన్యాసం.

**భండారు శ్రీనివాసరావు** ఆకాశవాణి, దూరదర్శన్‌లలో పాత్రికేయులుగా సుప్రసిద్ధులు. వీరు మాస్కో రెడియోలో కూడా పనిచేశారు. ఇటీవల వారు రష్యా అనుభవాలకు అక్షర రూపంలో "మార్పుచూసిన కళ్ళు" గ్రంథాన్ని వెలురించారు. పై వ్యాసం తిరుమల రామచంద్ర శతజయంతి సదస్సు తొలి సమావేశంలో వారు చేసిన అధ్యక్షోపన్యాసం.

**ఆచార్య చౌదూరి ఉపేందర్ రావు** కు సంస్కృతం, ప్రాకృతం, పాళి, తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలు కొట్టిన పిండి. వీరు ప్రస్తుతం న్యూఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ

విశ్వవిద్యాలయంలోని సంస్కృత అధ్యయన ప్రత్యేక కేంద్రంలో ఆచార్యులుగా వున్నారు. దాదాపు పది గ్రంథాలు వీరు వ్రాశారు. వీరు రచించిన వాఙ్మయ వల్లరి (సంస్కృతం) కు అఖిల భారతీయ విద్వత్ పరిషత్ అవార్డు వచ్చింది. ఇంకా వీరు భర్తృహరి నీతి శతకం, సత్యవ్రత శాస్త్రి రచనలు - విమర్శ (ఇంగ్లీష్) బుద్ధధర్మ (హిందీ) రచించారు. తాజాగా శాంతిదేవ, బోధికార్యావతార (ఇంగ్లీష్) గ్రంథానికి సంపాదకత్వం వహించారు.

**ఎం. నారాయణశర్మ** తెలుగులో, సంస్కృతంలో స్నాతకోత్తర పట్టాపొందిన పండితుడు, కవి. అనేక పత్రికలలో తెలుగుసాహిత్యం, చరిత్రపై వీరు శతాధిక వ్యాసాలు ప్రచురించారు. తమోచిత్రాలు, అస్తిత్వపుష్పాలు అనే కవితా సంకలనాలు, డా.ఎన్.గోపి కవితా రూపసృష్టి-నానీలు-పరిశీలన, డా.సి.నారాయణరెడ్డి నాగార్జునసాగరం - కళాసాహితీచందం పరిశీలన ఇత్యాది అంశాలపై పరిశోధనా వ్యాసాలు వ్రాశారు.

**డా.ఎ.బి.కె. ప్రసాద్** తెలుగు జర్నలిజంను కొత్త పుంతలు తొక్కించిన సృజనాత్మక సంపాదకుడు. 1958లో వామపక్ష భావజాల పత్రిక "విశాలాంధ్ర"లో తెలుగు జర్నలిజం రంగంలో శ్రీకారం చుట్టిన ఎ.బి.కె. గత ఐదున్నర దశాబ్దాలుగా అంచెలంచెలుగా ఎదిగారు. ఈనాడు వైజాగ్ ఎడిషన్‌కు ఎడిటర్ అయ్యారు. ఆ తర్వాత రాష్ట్రంలో ఇటీవలి వరకు ఆయన పనిచేయని దినపత్రికంటూ లేదు. నిజానికి తెలుగు పత్రికల సంస్థాపక సంపాదకుడిగా ఆయనకు పేరువచ్చింది. ఈనాడు తర్వాత ఉదయం, వార్త, ఆంధ్రజ్యోతి హైదరాబాద్, తిరుపతి ఎడిషన్లు ఎబికె వెలిగించిన దీపాలే. ఆంధ్రభూమి అసోసియేట్ ఎడిటర్‌గా, "ఆంధ్రప్రభ' చీఫ్ ఎడిటర్‌గా కూడ ఆయన పనిచేశారు. వీరి సంపాదకీయాలు ఇప్పటివరకు పది సంపుటాలుగా వచ్చాయి. వీరి "నిబద్ధాక్షరి"కి పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు ప్రదానం చేసింది.

**ఆర్.వి.రామారావు**కు జర్నలిజం రంగంలో నాలుగు దశాబ్దాల అనుభవం ఉంది. విశాలాంధ్ర సంస్థల ప్రచురణ "కొత్తబాట"లో ఆర్.వి.రామారావు పాత్రికేయ జీవితం ఆరంభించారు. ఈనాడు, ఆంధ్రప్రభ, ఉదయం, ఆంధ్రభూమి, ఈభూమి, రీడిఫ్ వెబ్‌సైట్లలో వివిధ హోదాలలో పనిచేశారు.

**కల్లూరి భాస్కరం** 'ఆంధ్రప్రభ'లో పాత్రికేయ జీవితం ప్రారంభించారు. అనంతరం కుముదం గ్రూప్‌కు (చెన్నై) చెందిన "భక్తి"కి ఎడిటర్‌గా కొంతకాలం పనిచేశారు. ఇటీవలివరకు "సాక్షి" దినపత్రికలో వీరు సహసంపాదకులుగా ఉన్నారు. సాహితీ విమర్శకుడుగాను, రచయితగాను, రాజకీయ విశ్లేషకుడుగాను గుర్తింపు పొందారు. పూర్వ ప్రధాని పి.వి.నరసింహారావు "ఇన్‌సైడర్"ను "లోపలిమనిషి"గా వీరు తెనిగించారు.

**టి.ఉదయవర్లు** 'ఆంధ్రజ్యోతి' గ్రూప్ పత్రికలలో, 'ఆంధ్రప్రభ' దినపత్రికలో నాలుగు దశాబ్దాలకాలం పనిచేసి వేలాది వ్యాసాలు, సమీక్షలు వ్రాసిన సీనియర్ జర్నలిస్టు. వీరు

రచించిన "లోకాలోకనం"కు పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు ప్రదానం చేసింది. వీరి 'తారాతోరణం' గ్రంథానికి రాష్ట్ర ప్రభుత్వం నంది అవార్డు అందచేసింది. హైదరాబాద్ నగరంపై వీరు వ్రాసిన 'నమస్తే హైదరాబాద్' బహుళ జనాదరణ పొందింది. పలువురు ప్రముఖుల సంస్మరణ సంచికలకు వీరు సంపాదకత్వం వహించారు. అంతర్జాతీయ బాలల చలన చిత్రోత్సవాల సందర్భంగా చిల్డ్రన్స్ ఫిల్మ్ సొసైటీ ఆఫ్ ఇండియా ప్రచురించే "బయోస్కోపు" కు (తెలుగు) వీరు దశాబ్దకాలంగా సంపాదకత్వం వహిస్తున్నారు.

**జె. చెన్నయ్య** ప్రస్థుతం పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రజాసంబంధాల అధికారిగా, విస్తరణ సేవా విభాగం ఇన్‌ఛార్జిగా, విశ్వవిద్యాలయం త్రైమాసిక సమాచార పత్రిక 'తెలుగువాణి' సంపాదకులుగా ఉన్నారు. తొలుత 'ఈనాడు'లో జర్నలిస్టు వృత్తి జీవితం ప్రారంభించిన వీరు ఈనాటికీ 'ఆకాశవాణి'లో న్యూస్‌రీడర్‌గానూ శ్రోతలకు సుపరిచితులు. "తెలుగు దినపత్రికలు - భాషా సాహిత్య స్వరూపం" అనే అంశంపై సిద్ధాంతవ్యాసం సమర్పించి వీరు పిహెచ్.డి.పట్టా పొందారు. "పత్రికలు - ప్రసారమాధ్యమాలు" అనే గ్రంథాన్ని ఇటీవల వీరు వెలువరించారు.

**నందిరాజు రాధాకృష్ణ** సుమారు నాలుగు దశాబ్దాలుగా ఈనాడు, ఉదయం, ఆంధ్రజ్యోతి, వార్త, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ఆంధ్రప్రభ మొదలగు పత్రికలలో జర్నలిస్టుగా వివిధ హోదాలలో పనిచేశారు. ప్రస్తుతం ఫ్రీలాన్స్ పాత్రికేయులుగా పలు పత్రికలకు, ఆకాశవాణి వార్తా విభాగానికి పనిచేస్తున్నారు. వీరు ఇటీవల "అక్షరధార" ప్రచురించారు.

– – –

